



ముఖచిత్రం : జనరంజని

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

తప్పక చూడండి!　　　　　తప్పక చూడండి!

సూపర్ హిట్ చిత్రాలు నిర్మించిన

"దేవర్ ఫిలింస్" అందిస్తున్న

మరో హిట్ చిత్రం





# జింక్ లోపమా?
# పుష్కలమైన పంట దిగుబడికి





# అన్నపూర్ణ
## జింక్ సల్ఫేట్ సంపూర్ణ సహకారం అందజేస్తుంది

పంట పెరుగుదలకు కావలసిన పోషక పదార్థాలలో జింక్ అతి ముఖ్యమైనది. భూసారంలో తగినంత జింక్ లేనట్లయితే పంట పెరుగుదల దెబ్బతింటుంది

మీ పైర్లు జింక్ లోపంతో అధిక దిగుబడిని యివ్వటం లేదా? మీరు విచార పడనవసరంలేదు-అన్నపూర్ణ జింక్ సల్ఫేటును సిఫార్సు చేయబడిన మోతాదులో ఉపయోగించి మీ భూసారాన్ని వృద్ధిచేయండి. మీ పైర్లు ఆరోగ్యవంతంగా పెరగడాన్ని మీరు త్వరలోనే గమనిస్తారు. అధిక దిగుబడిని ఖచ్చితంగా సాధిస్తారు.

**అన్నపూర్ణ జింక్ సల్ఫేటు**

- 22 నుంచి 24 శాతం వరకు మెటాలిక్ జింక్ కలిగి యున్నది.
- హెక్టేరుకు 50 కి.గ్రా. చొప్పున మూడు కాలాల్లో ఒకసారి దుక్కిలో సాధారణ మోతాదుగా ఉపయోగించవచ్చును
- జింక్‌లోపం ఉన్న చవుడు భూములలోనయితే హెక్టారుకు 100 కి.గ్రా. వరకు సాధారణ మోతాదుగా వాడవచ్చును.
- జింక్‌లోపం పైరుమీద కనబడితే జింక్ సల్ఫేటును మూడుసార్లు పిచికారి చేయవచ్చును
- జింక్‌సల్ఫేటు మరియు సూపర్ ఫాస్ఫేటు వేరువేరుగా 48 గంటల తేడాతో ఉపయోగించాలి
- మీ సౌకర్యంకోసం 50 కిలోల పాలిథీన్ సంచులలో లభిస్తుంది

**రైతుల పాలిట కామధేనువు - అన్నపూర్ణ**

ఉత్పత్తిదార్లు :
**పారమౌంట్ అగ్రో కెమికల్స్ ప్రైవేట్ లిమిటెడ్**
90 డి రోడ్డు నం. 14 బంజారా హిల్స్
హైదరాబాదు 500034.
[illegible]

నేడే చూడండి! నేడే చూడండి!




రాజ్యలక్ష్మి సినీఆర్ట్ క్రియేషన్స్

# "కలియుగ రావణాసురుడు"

ఈస్టమన్ కలర్

దర్శకత్వం :- బాపు నిర్మాత :- అంగర సత్యం

సుదర్శన్ 70 ఎం. ఎం.
ఎ/సి హైదరాబాద్

అంజలి
సికింద్రాబాద్

— తారకరామ రిలీజ్

# 1980

# చక్రపాణి అవార్డులు

తెలుగులో ఉత్తమ నవలా, కథా సాహిత్యాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో చక్రపాణి అవార్డులను ప్రతి సంవత్సరమూ బహూకరిస్తున్నాం. ఈ సంవత్సరం మూడు ఉత్తమ నవలలకు, నాలుగు ఉత్తమ కథలకు అవార్డులు ఇవ్వటానికి నిర్ణయించాం

## అవార్డుల వివరాలు

| | | |
|---|---|---|
| నవల : | మొదటి అవార్డు — | రూ 2,000 |
| | రెండో అవార్డు — | రూ 1,500 |
| | మూడో అవార్డు — | రూ 850 |
| కథానిక : | మొదటి అవార్డు — | రూ 1,000 |
| | రెండో అవార్డు — | రూ 750 |
| | మూడో అవార్డు — | రూ 500 |
| | నాలుగో అవార్డు — | రూ 350 |

పై అవార్డులను పొందటానికి రచయితల, రచయిత్రుల నుంచి ఉత్తమ నవలలను, కథలను ఆహ్వానిస్తున్నాం

*అవార్డులను పొందగోరేవారు పాటించవలసిన నిబంధనలు:*

1 నవలలు, కథలు — ఆంధ్రుల సమకాలీన సామాజిక జీవనానికి ప్రతిబింబంగా ఉండాలి

2 నవల అగరావు సైజులో 90 పేజీలకు మించకుండా, 70 పేజీలకు తగ్గకుండా ఉండాలి. అచ్చులో 80 పేజీలకు మించరాదు ఒక్కొక్క పేజీలో 25 లైన్లు మించకుండా, ఒకే ప్రక్కన వ్రాయాలి

3. కథానిక అరరావు సైజులో 16 పేజీలకు మించకుండా ఉండాలి పేజీకి ఒకవైపునే వ్రాయాలి.

4. అనువాదాలూ, అనుసరణలూ అవార్డులకు ఆమోదించబడవు రచన స్వంతమేననీ, దేనికీ అనువాదం, అనుసరణ, ఆధారం కాదనీ హామీపత్రాన్ని ప్రతి రచనకూ జతపర్చాలి. కలం పేర్లతో వ్రాసేవారు తమ అసలు పేర్లను తప్పకుండా తెలియజేయాలి

5 అవార్డులకు పంపే నవలల, కథల కవర్లపై 'చక్రపాణి 1980 అవార్డులకోసం' అని స్పష్టంగా వ్రాయాలి.

6 అవార్డులు పొందని నవలలు, కథలు కూడా 'యువ'లో ప్రచురణకు స్వీకరించే హక్కు మాకున్నది.

7 అవార్డులు లభించని నవలలను, కథలను తిరిగి పొందగోరేవారు తగినన్ని తపాలా బిళ్ళలు అంటించిన కవర్లను విడిగా జతపర్చాలి లేకపోతే వాటిని తిప్పిపంపడం సాధ్యంకాదు.

8 అవార్డులను ఇచ్చే విషయంలో 'యువ' సంపాదకులదే తుది నిర్ణయం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

అవార్డుల నిమిత్తం నవలలు, కథలు మాకు చేరవలసిన అఖరు తేదీ సెప్టెంబరు 30, 1980, పొడిగించ బడింది.

— సంపాదకుడు, యువ

# శ్రద్ధాంజలి



యువజన నాయకుడు

శ్రీ సంజయ్‌గాంధి

# శ్రద్ధాంజలి



యువజన నాయకుడు

శ్రీ సంజయ్‌గాంధి




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 42 ఆగస్టు 1980 సంచిక 2

**1980-81** సంవత్సరంలో వచ్చే ఆదాయంపై ప్రజలు చెల్లించ వలసిన పన్నులను నిర్వచించే 1980–81 బడ్జెటును పార్లమెంటులో, ఆర్థికమంత్రి శ్రీ ఆర్. వెంకటరామన్, 1980 జూన్ 18 తేదిన ప్రతిపాదించారు. 1947 సంవత్సరం తరువాత తేలికైన బడ్జెటు ప్రతిపాదన జరగడం ఇదే మొదటిసారి. భరింపలేని కొత్త పన్నులు ఏవీ యీ బడ్జెటులో ప్రతిపాదింప బడలేదు. పైగా, ఆదాయపు పన్నును చెల్లించ వలసిన కనీసపు ఆదాయపు పరిమితి ఏడాదికి పది వేల రూపాయల నుంచి పన్నెండు వేలకు పెంచబడింది. అంటే, ఏడాదికి పన్నెండు వేలరూపాయల లోపు ఆదాయం వచ్చేవారు, ఆదాయపు పన్నును కట్టనక్కర లేదన్న మాట. ఇది, చాలా మంది మధ్య తరగతి కుటుంబీకులకు సహాయ కరమైన నిర్ణయం.

అయితే, పన్నెండు వేల రూపాయలపైబడిన ఆదాయం వచ్చినవారు, ఎనిమిది వేల నుంచీ పన్ను కట్టాలని ప్రతిపాదింపబడింది. ఈ ప్రతిపాదన చాలా కుటుంబాలకు బాధాకరమైనది. పన్ను మొదటి మెట్టును పన్నెండు వేల రూపాయలుగా నిర్ణయించినప్పుడు, ఆ మెట్టులోపల వచ్చే ఆదాయంపై, ఏ పరిస్థితులలోనూ పన్ను కట్టనక్కర లేకుండా నిర్ణయం జరిగితే బాగుంటుంది.

మూడేళ్ళుగా వస్తున్న, యీ తిరకాసు యీ సంవత్సరంతో పోతుందని చాలా మంది ఆశించారు. పెరిగిపోతున్న ధరల రోజులలో, పన్ను చెల్లించ వలసిన మొదటిమెట్టును పన్నెండు వేల రూపాయలకు పెంచడంలో, మధ్య తరగతి కుటుంబీకుల ఇబ్బందులు కొంతవరకు తగ్గే మాట నిజమే, కాని పన్నెండు వేల పైన ఆదాయం వచ్చేవారు ఎనిమిది వేలనుంచీ పన్ను కట్టాలనడం, చాలామంది మధ్య తరగతి కుటుంబీకులకు వ్యసన కారణం అవుతుంది. బడ్జెటును పార్లమెంటు ఆమోదించే లోపల, యీ విషయంలో తగిన సవరణను అర్థిక మంత్రి ప్రతిపాదిస్తారని ఆశిస్తున్నాము

ఆస్తి పన్ను విషయంలో కూడా అర్థికమంత్రి, మధ్యతరగతి కుటుంబీకులకు కొంత సహాయాన్ని కలుగజేశారు. పన్ను చెల్లించ వలసిన కనీసపు ఆస్తి పరిమితిని లక్ష రూపాయల నుంచి లక్షన్నరకు పెంచారు ద్రవ్యోల్బణంవల్ల విలువలు పెరిగిపోతున్న యీ రోజులలో, యీ సదుపాయం గొప్ప సదుపాయం కాదు: కాని, కొంత సదుపాయమే అస్తుల విషయంలో, అర్థిక మంత్రి బంగారపు ధరను గురించి కొంత అలోచించాలని కోరుతున్నాము. మూడేళ్ళ నాడు గ్రాము యాభై అయిదు రూపాయలు వున్న బంగారం ధర యీనాడు నూట ముప్పయి రూపాయలుగా వుంది. ఆ ధర ప్రకారం, ఆస్తి విలువను కట్టాలంటే, అర్థిక మంత్రి యిచ్చిన సదుపాయం వల్ల ప్రయోజనం పొందేవారు ఎక్కువ మంది వుండరు. పోగా చాలా యిబ్బంది పడేవాళ్ళు ఎక్కువ మంది వుంటారు. ఆస్తి పన్ను కట్టడానికి బంగారాన్ని అమ్ముకోవలసిన వారు కూడా కొంత మంది వుండవచ్చును. అంచేత, ఆస్తి విలువను కట్టడంలో బంగారపు విలువను పదేళ్ళనాటి విలువగా లెక్క కట్టాలని కూడా అర్థికమంత్రి ప్రకటిస్తే లక్షల సంఖ్యలో మధ్య తరగతి కుటుంబీకులు హర్షిస్తారు

* * *

భారత రాజకీయ రంగంలో 50 సంవత్సరాలు ఒక ప్రముఖ నాయకుడుగా వున్న శ్రీ వరాహగిరి వెంకట గిరి గారు జూన్ 24 తేది ఉదయం అకస్మికంగా మరణించారు. కార్మిక నాయకుడుగా, మంత్రిగా, గవర్నరుగా, వైస్ - ప్రెసిడెంట్‌గా, ప్రెసిడెంట్‌గా శ్రీగిరి తమవిధులను అత్యంత సమర్థతతో నిర్వహించడమేకాక, సహృదయుడుగా, స్నేహశీలిగా గొప్ప పేరుపొందారు రాజకీయ రంగంలో, స్వాతంత్ర్య పోరాటంలో అనేకసార్లు జెయిలుకు వెళ్ళి, అనేక త్యాగాలుచేసిన వ్యక్తి శ్రీగిరి. అందువల్లనే,స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అనేక

పెద్ద పదవులతో వారు నియమించబడినప్పుడు, ప్రజలు హర్షించారు. 88 సంవత్సరాల వయసులో, పండిన జీవితాన్ని ముగించుకొన్న శ్రీగిరి ఆత్మకు శాంతిని ప్రసాదించ వలసిందని భగవంతునికి మా ప్రార్థన. వారి కుటుంబానికి మా సానుభూతి

* * *

1980 జూన్ మాసం భారతదేశ చరిత్రలో ఒక ఘోరమైన మాసమైంది ఒక ఉజ్జ్వల నాయకుడుగా పరిణామం పొందుతున్న శ్రీ సంజయ్ గాంధి విమాన ప్రమాదంలో ఆకస్మిక మరణం చెందారు. తల్లి శ్రీమతి ఇందిరా గాంధికి ఇదొక పెద్ద గాయం రాజకీయ రంగంలో ఒక తీరని లోటు ఎంతో పైకి రావలసిన వ్యక్తి, తన ప్రజ్ఞను ప్రదర్శించడం ఆరంభించడంలోనే, క్రూర విధి ఆ జీవితాన్ని అంతమొందించడం చాలా విచారకరం. పరిమితి లేని దుఃఖానికి గురియైన శ్రీమతి ఇందిరా గాంధికి, శ్రీ సంజయ్ గాంధి కుటుంబానికి మా సానుభూతి ప్రకటిస్తున్నాము

# చిత్రవార్తలు



రాష్ట్రపతి డా॥ నీలం సంజీవరెడ్డి గారు 18.6.80 తేదీన హైదరాబాదుకు వచ్చినపుడు
ముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి గారు, పురపాలక శాఖా మాత్యులు శ్రీమతి
సరోజినీ పుల్లారెడ్డి గారు విమానాశ్రయంలో ఆహ్వానించారు



జూన్ 22వ తేదీన స్వాతంత్ర్య సమరయోధుల 4వ వార్షికోత్సవము - హైదరాబాదు శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్రభాషా నిలయంలో జరిగినపుడు ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి గారు ప్రసంగించారు.

---

జూన్ 18తేదీన ఇరాన్ ప్రభుత్వపు వాణిజ్యశాఖామంత్రి గౌ॥ రేజాసదర్ హైదరాబాదుకు వచ్చినపుడు వారిని విమానాశ్రయంలో సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి శ్రీ కె. వి. ఆర్. పద్మనాభ రాజు స్వాగతం చెప్పారు



# మెరుపులూ - మరకలూ!

పెళ్ళి లాటరీలాంటి దంటారు. కాని అది నిజంకాదు. లాటరీలో మీకు ప్రైజు రావచ్చు, రాకపోవచ్చు

•

పురుషుల దుస్తుల ఫ్యాషన్‌లో ఆధునిక పద్ధతి-స్త్రీల చీరల డిజైన్‌ను అనుకరించడం.

•

'నరకానికి పొండి' అని రాజకీయ నాయకుల్ని నిందించి లాభమేముంది! ఆ నరకాన్ని వాళ్ళు సృష్టించే వరకూ మనం నోరు పారేసుకోకూడదు.

•

రాత్రి పన్నెండింటి దాకా బార్‌లో ఖుషీగా విస్కీ-తాగి, ఆ మరునాడు ఉదయమే మళ్ళీ అదే బార్‌కు వెళ్ళి-ఆన్‌రాక్స్ మీద రెండు ఆస్ప్రో బిళ్ళలు ఆర్డర్ చేశాడు ఆనందరావు.

•

పరస్పరం నమ్మకంలేని ఇద్దరు భాగస్థులు ప్రయివేటు బస్సు సర్వీసు ప్రారంభించారు రెండో రోజునే ఆ ఇద్దరూ కండక్టర్లుగా మారారు.

•

ప్రపంచంలో ఉన్న డబ్బంతా నా దగ్గరుంటే ఏం చేస్తానో తెలుసా? నాకున్న అప్పుల్లో బహు కొన్ని మాత్రమే తీరుస్తాను

•

వైవాహిక రజతోత్సవ శుభ సమయమున, ఓ నిమిషం పాటు నిశ్శబ్దంగా లేచి నిలబడాలని భార్యను అర్థించాడాయన

---

కల్యాణ కృష్ణ

---

# మనిషి మైనస్ షి

తెనాలి సుశీలాదేవి

పద్మకు జరుగుతున్నదంతా కలలో లాగ వుంది. కలలో తేలుతున్నట్టుగానే అడుగులో అడుగువేసుకుంటూ గదంతా ఒకసారి తిరిగి చూసింది. ఆ అమ్మాయి కళ్ల ముందుగా గదిమధ్య అలంకరించిన పందిరిమంచంమీద పడి కొన్ని క్షణాలు అలాగే నిలిచిపోయాయి

తనకోసం....తనకోసమే....తన జీవితాన్ని, తన యౌవనాన్ని తన స్త్రీత్వాన్ని సార్థకంచేసుకోమని....

ఈ వుదయమే తన బ్రతుకు బాట మలుపు తిరిగింది. తిరిగిన ఆ మలుపులో తనకు తోడు దొరికింది. ఆ తోడు గమ్యం చేరుకొనేవరకు యీ ప్రయాణంలో తనకు అండగా ఉంటుంది. సుగమమే అయినా దుర్గమమే అయినా తను ఒంటరికాదు. కష్టమయినా సుఖమయినా తనతో పంచుకోడానికి ఓతోడు .... ఒక మనిషి.... తనవాడు....

తన బ్రతుకుని మలుపు తిప్పి తన చేయిపట్టి కొత్త బాట వెంబడి పయనానికి సిద్ధపడిన ఆ దేవతామూర్తి...ఏడీ...ఏడీ...ఎక్కడ....?

* * *

పద్మ హృదయంలో దేవతామూర్తిగా రూపుదిద్దుకున్న మోహన్ ఆ గది బయట డాబామీద వెన్నెల్లో కూర్చుని వున్నాడు. అతనికి కూడా జరిగిందంతా కలలాగే వుంది. కాలుస్తున్న సిగరెట్ పొగలో యీ మధ్య జరిగింది కళ్ళకు కనబడినట్టు వుంది చిత్రంగా.

సంస్కరణలు, ఆదర్శాలు, అభ్యుదయాలు వీటిమీద కాలేజీలో కేవలం వుపన్యాసాలు యివ్వటమే కాదు, జీవితంలో చేసి చూపించాలి అని నిర్ణయం తీసుకున్నాడు.

కొన్ని నిర్ణయాలు అమలులోకి రావాలంటే ఆచరించేవాడికి ఒక్క గుండె

ధైర్యమే కాదు. నలుగురిని ఎదిరించి నిలబడే గుండెబలంతోపాటు నలుగురూ తనను కాదన్నా తన బ్రతుకు తాను చూసుకోగలిగిన ఆర్థిక స్వాతంత్ర్యం కూడా వుండాలి.

సెక్రటేరియట్‌లో వుద్యోగం దొరకటంతో తనకా స్వాతంత్ర్యం వచ్చేసి తన మనసు మారుమూలలలో వున్న ఆదర్శాలను వెలికి తీసి ఆచరణలో పెట్టటానికి ప్రారంభించేశాడు. సరిగ్గా యీ సమయంలోనే నాన్న నాలుగైదు ఫోటోలు పట్టుకొని రైలుదిగి వచ్చాడు.

ఆ ఫోటోలోని అమ్మాయిలందరూ బాగానే వున్నారు. వాళ్ళ అందచందాల కన్న ఆ ఫోటోల వెనుకవైపు వాళ్ళ స్థితిగతుల ననుసరించి తనను కొనగల వాళ్ళ స్థోమతు అంకెల రూపంలో మరింత ఆకర్షణీయంగా వుంది. వాటిని తిరస్కరించటమే కాదు పెళ్ళి విషయంలో తన అభిప్రాయం విని చిందులు తొక్కాడు.

"నీకంత ఆదర్శంగా వివాహం చేసుకోవాలని వుంటే పోనీ కట్నంలేకుండా చేసుకుందాం మంచి సాంప్రదాయం, లక్షణకరమూ చూసి...."

ఆఖరు అస్త్రంగా ప్రాధేయపడసాగేడు ఆయన.

"నాన్నా, వరుడిని కొనుక్కోగల డబ్బుగాని, సాంప్రదాయాలు గానీ ఏ ఆడపిల్లనయినా వధువుని చేస్తాయి. కాని నా ఆశయం వధువుగా తన రూపాన్ని కలలో కూడా వూహించుకోలేని అభాగ్యురాలిని, అనాధను పెళ్ళికూతురిగా చేసి నా జీవితభాగస్వామిగా తెచ్చుకోవాలని."

"అంటే ఏ అనాధశ్రమం పిల్లనో కట్టుకుంటావు అంతేనా."

"అవును వెలుగులో వున్నవాళ్ళం వెలుగుకే అంకితమయితే ఆ వెలుగుకి నోచుకోక జీవితాంతం చీకటిలో మగ్గవలసిన వారి స్థితి ఎలా వుంటుంది. మన వెలుగు వాళ్ళకి కొంచెం పంచి, ఆ చీకట్లోంచి వాళ్ళకు చేయి అందించి బయటకు తీసుకురాగలగాలి. నేను ఆ పనే చేయాలనుకుంటున్నాను."

"ఛీ! ఒక్కగా నొక్క కొడుకువని ఎన్ని ఆశలో కలబోసి నిన్ను పెంచుకున్నాం. యిట్లా నరకం చూపిస్తావనుకోలేదు. మనకు కొడుకే లేడు, చచ్చాడు అని చెబుతాను మీ అమ్మతో."

కొంత కోపంతోనూ, రోషంతోనూ అంతకుమించిన బాధతోనూ విసురుగా వెళ్ళిపోతున్న తండ్రిని చూసి జాలేసింది తనకు. నిజమే ఏ తండ్రయినా అలాగే బాధపడతాడు. అయినా తనకు తెలుసు. తనని వదిలి ఎన్నాళ్ళో వుండలేడు. ఆ కోపం చల్లారడానికి కొంత వ్యవధి కావాలి.

ఆ రోజు తన స్నేహితుడిని వాకబుచేసి ఆ వూళ్ళోని సేవాసదనము చేరుకున్నాడు ప్యూన్ లోపలికి తీసుకువెళ్ళాడు

ఆ ఆఫీసు గదిలో ఆ కుర్చీలో కూర్చుని వున్న ఆ పెద్దావిడను చూడగానే నమస్కరించా లనిపించింది ఆ పనే చేశాడు ఆవిడే ఆ సేవా సదనానికి అధికారిణి తను వచ్చిన పని తెలుసుకుని ఆశ్చర్యంతో నమ్మలేనట్లు చూసింది తనకేసి

"మీ పెద్దవాళ్ళకు తెలుసా?"

"నేను యిక్కడి అమ్మాయిని చేసుకోబోతున్నట్టు తెలీదు కాని నాకు నచ్చిన పిల్లని చేసుకుంటానని, ఆస్థి అంతస్థులు, అండదండలు లేని అనాధ పిల్లను చేసుకుంటానని చెప్పాను"

"అనాధను వుద్ధరిస్తాను అంటారు" అంది నవ్వుతూ

"అంతమాట నేను అనలేను కాని నా సాహచర్యంతో మరో మనిషికి ఆనందాన్ని, సంతృప్తిని యివ్వగలను ఆ శక్తిని నాకు భగవంతుడు యిచ్చాడు అవి లేని మరో మనిషికి వాటిని నేను పంచటం వుద్ధరింపు అనలేను ఇందులో నా స్వార్థం కూడా వుంది. లేనివారి కివ్వడం వలన వాటికి విలువ వుంటుంది నా అభిప్రాయం తప్పంటారా?"

"అనను మిమ్మల్ని చూస్తుంటే నాకెంతో సంతోషంగా వుంది. మీలాంటి వారు నూటి కొక్కరున్నా యీ దేశం ఎంతో బాగుపడుతుంది" ఆవిడెంతో వుద్వేగంతో చెబుతోంది.

"మి రేమనుకోకపోతే నాకు సరిపోతుందనుకున్న అమ్మాయి వుంటే చూపించండి అయితే ఒక రిక్వెస్టు నేను యీ కారణంగా వచ్చానని మాత్రం చెప్పకండి" ఆవిడ తన మాటను మన్నించింది సేవాసదనం గురించి చెబుతూ ఆ భవనం, తోటా చూపిస్తూ తనను అంతటా తిప్పింది ఇక్కడ అన్ని వయసుల ఆడవాళ్లూ వున్నారు కొందరు బుట్ట లల్లుతున్నారు. ఎంబ్రాయిడరీ చేస్తున్నారు కొందరు ఏదేదో బొమ్మలు తయారు చేసేవాళ్ళూ చదువుకుంటున్న వాళ్లూ యిలా ఇందరిలో తనకు యీడయిన పిల్ల ఎవరని ...

చివరకు ఆమెనే అర్థించాడు ఆమె నవ్వింది ఎంతో ఆత్మీయంగా బెల్ నొక్కింది ప్యూను వచ్చాడు 'పద్మని, వుషని తీసుకురా' అంది ఆ పేర్లు రెండూ తను మననం చేసుకుంటూండగానే యిద్దరమ్మాయిలు వచ్చి ఆవిడకు నమస్కారం చేశారు నా కళ్ళు ఆకుపచ్చ చీరమీద నిలిచిపోయాయి.

'ఇదిగో పద్మా. నీవు ఎంబ్రాయిడరీ చేసిన ఆ నెమళ్ల టేబిల్‌క్లాత్ తీసుకురా. యీయన కొంటారుట' అంది

తాను విభ్రమంతో ఆమెకేసి చూశాడు తనెప్పుడు కొంటానన్నానని ఆమె కళ్లార్పుతూ సైగ చేసింది తనకు

'ఉషా యీ మధ్య నీవు కొత్తగా అల్లిన వైరుబుట్ట తీసుకురామ్మా' రెండో అమ్మాయి లోపలికి వెళ్ళిపోయింది

"ఇప్పుడు చెప్పండి. వీళ్ళిద్దరే మీకు సరయిన యీడులో వున్నవాళ్ళు యిద్దరిలో మీకు నచ్చిన వారెవరు? వాళ్ళ వివరాలు ఫైలుతీసి చూపిస్తాను"

"నాకు నెమళ్ళ ఎంబ్రాయిడరీ నచ్చింది" చప్పున అన్నాడతను.

"ఏమిటి టేబిల్ క్లాత్ చూడకుండానే"

"ఐ మీన్ ఆ అమ్మాయి...అదే పచ్చచీర పద్మ

తన తడబాటు చూసి ఫక్కున నవ్వింది. అంతలోనే సర్దుకుంది 'సారీ' అని. ఇద్దరమ్మాయిలూ ఒక్కసారే వచ్చారు. తనకళ్లు పద్మమీదే నిలిచి పోయాయి. అయితే వాళ్ళిద్దరూ ఒక్కసారయినా నాకేసి చూడలేదు తాము తెచ్చినవి టేబుల్‌మీద పెట్టి ఆమె ఆజ్ఞప్రకారం వెళ్ళిపోయారు

"మీరు రేపు వుదయం రండి. ఆ అమ్మాయి వివరాలు చెబుతాను"

"నాకే వివరాలు అక్కరలేదండి. నాకు కావలసింది అమ్మాయి. అంతే."

"అయినా మాకూ మీ వివరాలు కావాలి. అదిగాక యిక్కడి అమ్మాయిని మీరు వివాహం చేసుకుని తీసుకుపోతున్నా సరే కొన్ని నిబంధనలున్నాయి. కొన్నింటిలో మీరు సంతకాలు చేయాలి. ముఖ్యమయింది అమ్మాయి యిష్టపడాలి"

'అలాగే రేపు పదిగంటలకు వచ్చేస్తాను'

తరువాత చెప్పాడు తన స్నేహితుడు తన గురించి తన వుద్యోగం గురించి చెప్పినవన్నీ నిజమేనా, కాదా అని వాళ్ళు ఎంక్వయిరీ చేస్తారని. అందుకు ఆమాత్రం వ్యవధి కావాలి కదా వాళ్ళ భయం వాళ్ళది మరి

సరిగ్గా వుదయం పదిగంటలకు తను అక్కడున్నాడు పద్మ అనబడే ఆ అమ్మాయిని పిలువనంపారు.

పద్మ వచ్చింది తెల్లకలువలా. ఆ అమ్మాయి తనకేసి చూడలేదు కాని తను మాత్రం నిలువెల్లా కళ్ళయి పరికించాడు.

"వీరు మోహన్‌గారని యిక్కడే సెక్రెటేరియట్‌లో అకౌంట్స్ ఆఫీసరుగా వున్నారు "



కళ్లెత్తి 'నమస్తే' అంది పద్మ. తనూ అభినయం చేశాడు

'వీరు పెళ్ళిచేసుకొనే వుద్దేశంతో తనకు భార్యగా రాబోయే కన్యను యీ సేవాసదనంలో వెతుక్కోటానికి వచ్చారు. నీకు యిష్టమయితే వీరు నిన్ను....'

సంభ్రమంగా తలెత్తి చూసింది. ఆ కళ్ళల్లో ఎంత వెలుగు... వెనువెంట లీలగా ఏదో అనుమానం..

"మేడం...." సందిగ్ధంగా ఆగిపోయింది.

"నేను అన్నీ విచారించాను పద్మా. యితను వున్నతమైన సంస్కారము గలవాడు కనుకనే ఒక అనాధబాలికకు చేయూత నివ్వాలని తనను కోరి వరించే వారిని కొనవి యిక్కడికి వచ్చారు. నీవు నచ్చావు. మరి నీకూ...."

"నాకే తెలియదు మేడం. మా మంచి చెడ్డలు, బరువు బాధ్యతలు యిన్నేళ్ళుగా మీరు చూస్తున్నారు. ఈనాడు యీ విషయంలో కూడా మీ అభిప్రాయానికే నేను విలువ యిస్తాను." నెమ్మదిగా తలవంచుకుని అంది పద్మ.

"ఆల్‌రైట్ మిస్టర్ మోహన్. మంచిరోజు చూసి ముందుగా మా సేవా సదనంలోనే ముహూర్తం జరిపించి తిన్నగా రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్ళి సంతకాలు చేసి వచ్చేస్తే సరిపోతుంది. బైదిబై మీతో మరోమాట. ఈనాడు ఏవో ఆశయాలతో, ఆదర్శాలతో ముందడుగు వేస్తున్నాం అనుకుంటూ ఏదో సంస్కరిస్తున్నాం అన్నట్టు చేసేసి తరువాత నలుగురూ నాలుగు మాటలంటున్నారని తప్పుకోటం పరిపాటయింది. మీరలా చేస్తారని కాదు. అయినా చెప్పడం నా విధి. యిక్కడ యీ పిల్లలకు ఒకరికొకరితో స్నేహమే తప్ప 'నా' అనేవాళ్ళు లేరు. ఒక విధంగా గాయపడిన హృదయాలు. మీరు వారి బాధను మాన్పి తోడునీడగా మెలగగలిగితే మంచిది. కాని ఏ విధమయిన అసహనంతోనయినా వారిని కించ పరచటం గానీ గాయపరచటం గానీ జరిగితే వాళ్ళకు తిరిగి యిక్కడకు రావడానికి ముఖం చెల్లక, మరో దారిలేక చావుకు సిద్ధపడవచ్చు. వెలుగు చూపించి నట్టే చూపించి గాఢాంధకారంలోకి నెట్టేయకండి. నీకు నేనువున్నాను అని చెప్పగలిగే ఆత్మీయత, ఆదరణ, అనురాగం ఎటువంటి పరిస్థితిలోనయినా మనిషికి జీవంపోస్తాయి. అవన్నీ మీరు మా పద్మకు అందించి ఆమెకో నూతన జీవితం ప్రసాదిస్తారని ఆశిస్తాను."

ఆమె మాటలు తన మనసులో బాగా నాటుకుపోయాయి.

తను పెళ్ళికూతురును చూసుకున్నానని, ఫలాని రోజున ముహూర్తం అనీ వుత్తరం రాశాడు తల్లిదండ్రులకు. వస్తారని ఆశలేదు. అయినా ముహూర్తం జరిగినంతసేపూ ఎదురుచూస్తూనే వున్నాడు. నిరాడంబరంగా పద్మకీ తనకీ పెళ్ళి జరిగిపోయింది. ఆ అలంకరణలతోనే రిజిస్ట్రార్ ఆఫీసుకు బయలుదేరి అక్కడి తతంగం ముగించి తిరిగి సేవాసదనానికి వచ్చేసరికి తండ్రి వచ్చి వున్నారు. పద్మ గురించిన వివరాలన్నీ తెలుసుకున్నట్టున్నాడు. కోపంతోనూ బాధతోనూ ఆయన ముఖం కందగడ్డలా వుంది. తనను చూసేసరికి అప్పటిదాకా అణుచుకున్న కోపం వువ్వెత్తుగా పొంగింది.

"ఛీ భ్రష్టుడా. అన్నంత పనీ చేశావు కదరా. ఇలాంటి పని చేసేముందు మేం జ్ఞాపకం రాలేదా!"

"నేను ముందే చెప్పాను నాన్నా యిలాంటి అమ్మాయినే చేసుకోవా లనుకుంటున్నాని "

"చెప్పావు అయినా యింతగా తెగిస్తావనుకోలేదు పోనీ చేసుకున్నావు అనాధనే అనుకో వాళ్ళలోనే తల్లీతండ్రీలేని వాళ్ళున్నారు కదా వాళ్ళెవరూ కనబడలేదూ చివరకు హంతకురాలయిన ఒక ఆడపిశాచి కూతురిని చేసుకు న్నావే ముందుగా వివరాలు తెలుసుకోలేదా? దీని తల్లి జైల్లో వుందిరా "

"నాకు అన్నీ తెలుసును నాన్నగారూ అయినా యిప్పుడు యీ అమ్మాయి మీ కుమారుని భార్య మీ కోడలు. తనని 'అదీ యిదీ' అనడం అంత బావులేదు " తను కాస్త సీరియస్‌గానే చెప్పాడు ఆయన బాధ నాకు తెలుసు. అంతమాత్రాన ఒక ఆడపిల్లను నలుగురిలో యిలా అవమానకరంగా మాట్లాడటం

"నా ఖర్మ నాయనా అంతా నా ఖర్మ ఏదో ఒకనాడు యీ పిల్లా నీకింత విషం యిచ్చేసి వాళ్ళమ్మలాగా "

"నాన్నా! పదేపదే ఆ విషయం పునశ్చరణ చేయొద్దు ఈమె తల్లి హంతకు రాలు అని మీకు తెలిసింది కనుక యిలా మాట్లాడ గలుగుతున్నారు మీరన్నట్టు మరే తల్లీదండ్రీ లేని అనాధ అయితే మనం ఆమె తల్లిదండ్రులు దొంగలు కాదనీ, హంతకులు కాదనీ, వ్యభిచారులు కాదనీ మనకెలా తెలుస్తుంది ఆ తల్లిదండ్రులు అలాంటివాళ్ళు కాకపోతే యీ పిల్లలు యిక్కడికి రావాల్సి వుండేదే కాదు నేను ఎంచుకుంటున్నది అమ్మాయినే కాని ఆవిడ తల్లిదండ్రుల సాంప్రదాయాలూ, స్థితిగతులూ కావు ఆ గతం ఎలాంటిదైనా నాకు సంబంధం లేదు " ధృఢనిశ్చయంగా అన్నాడు తను. సజల నయనాలతో తన పాదాలమీద వాలిపోయింది పద్మ.

నూతన వధువుని నూతన గృహంలోకి తన స్నేహితులే తోడ్కొని తెచ్చారు తమకు కావలసిన ఏర్పాట్లన్నీ వాళ్ళే చేశారు ఈ రాత్రి ఈ రాత్రే తమకు తొలిరాత్రి.

చప్పున ఆలోచనల్లోంచి బయటపడ్డాడు

'అరె' పద్మ కాచుకుని వుంది గదిలో తనే ఆలశ్యం చేశాడు

మోహన్ రావడం చూసి పద్మ తల మెల్లిగా వాలిపోయింది కంపిస్తున్న

ఆమె శరీరాన్ని రెండుచేతుల్తో పెనవేసి గాఢంగా హత్తుకున్నాడు ఏదో చెప్పా లని కదులుతున్న ఆ పెదవులను తన పెదవులతో మూసేశాడు

"పద్మా! ఆ కన్నీళ్ళేమిటి? ఏడుస్తున్నావా?"

"లేదు లేదు నాకోసం కాదు...మీకోసం మీరు మీవాళ్ళని కాదని ."

"అదంతా ఇప్పుడొద్దు నా కోసమే చేసుకున్నాను నన్ను కాదని, నన్ను వదిలిపెట్టి వాళ్ళు ఉండలేరు పద్మా మా నాన్నగారు నిన్ను కించపరిచారు కదూ. ఆయన తరపున నేను నీకు క్షమార్పణ..."

చప్పున తన అరచేతిని మోహన్ నోటిమీద వుంచింది

"పద్మా! ఒకమాట, నీవేమీ అనుకోనంటేనే. మగవాడు హంతకుడు కావ డానికి ఎన్నో కారణాలు ఉంటాయి. కాని అదది, సున్నితమైన హృదయం గలిగిన స్త్రీ, మాతృమూర్తి అయిన స్త్రీ 'అమ్మా' అని ఎవరు పిలిచినా గుండెలు స్పందించి ఆత్మీయతను కురిపించే స్త్రీ హంతకురాలు అయిందంటే నాకెంతో బాధగా ఉంది ఏ పరిస్థితులు ఆమెనంత కఠినాత్మురాలిగా చేసి ఉంటాయో మి అమ్మ గురించి నీవు చెప్పగలవా ? నే నిలా అడిగానని బాధ పడనంటేనే," పద్మ మౌనంగా అతని కళ్ళల్లోకి చూసింది

ఆ మౌనం వెనుక ఎంత విషాదం విశ్ళలంగా వున్న ఆ కళ్ళ వెనుక సముద్రాలు దాగివున్నాయి

పద్మ నెమ్మది.. లేచి వెళ్ళి తన సూట్‌కేస్ తీసింది బట్టల అట్టడుగు నుంచి ఒక బౌండుపుస్తకము తెచ్చి మోహన్ చేతుల్లో పెట్టింది

అయోమయంగా చూశాడు

"మీరడిగిన మా అమ్మకథ నేను జైలుకి వెళ్ళి అమ్మను కలుసుకున్నప్పు డల్లా విన్న కథ ఆమె గుండెల్లో రగులుతున్న ఆవేదన అక్షరాల రూపు దాల్చుకుని ఇందులో పొందుపరిచి వుంది అమె చెప్పింది చెపినట్లు యదాతథంగా యిది వ్రాశాను మా అమ్మ 'హంతకురాలు, హంతకురాలు' అని ఎదుటివారి నోటినుండి విన్నప్పుడు నా హృదయం వెయ్యి ముక్కలవుతున్నట్లుగా వుంటుంది ఎవరికీ చెప్పుకోలేను నా గుండెల్లో భారంగా వుంటుంది అలాం టప్పుడు యీ పుస్తకం తీసుకుని చదువుతాను అంతా చదివేశాక నా కొక లాంటి ఉపశమనం కలుగుతుంది. దొంగకానీ హంతకురాలుగానీ, వ్యభిచారిణి కానీ ఆమె మా అమ్మ! అంతే. 'అమ్మ' కనుకనే హంతకురాలు అయింది.

పద్మ కనుకొలకుల్లోంచి జారిన నీళ్ళు పుస్తకంమీద రాలిపడ్డాయి

"బాధపడకు. నన్ను క్షమించు. ఆనందంగా గడపవల క్షణాలను ఆవేదనపాలు చేయడం ఏంబావులేదు తరు చదువుతానుగానీ ముందుగా నిన్ను చదవాలని ఉంది" అ న్నాడు రెండు చేతులతో

భారంగా తయారయిన వాతావరణం తేలికపడింది. శృంగ కుంది పద్మ యవ్వనం తృప్తిగా పండింది మోహన్ ఆనందం, సంతృప్తి చోటుచేసుకున్నాయి

మత్తుగా, అలసటగా నిద్రకొరిగిన పద్మకేసి కొన్ని క్షణాలు చూశాడు ముంగురులు సవరించాడు. పెదవులను మెల్లిగా స్పృశించాడు లేచి వచ్చి కుర్చీలో కూర్చుని టేబిల్ లైటు వెలుతురులో ఆ నోటుపుస్తకము తెరిచాడు మోహన్. అక్షరాల వెంబడి కళ్ళు పరుగులు తీశాయి భావన ననుస రించి దృశ్యాలు కళ్ళముందు కనబడుతున్నట్టుగా వుంది

* * *

"దేవుని ఎదుట ప్రమాణం చేసి అంతా నిజమే చెబుతాను. అబద్ధం చెప్పను" లాయరు అందించిన పుస్తకంమీద అరచేతుల నాన్చి తల వాల్చుకుని ప్రమాణంచేసింది అరుణ

ఆవేళ కోర్టు కిటకిటలాడిపోతోంది జనంతో. ఆ కేసుపట్ల అందరికీ కుతూహలం

నేరం గురించి తెలిసినవాళ్ళు, తెలియనివాళ్ళకు చిలవలు పలవలుగా వర్ణించి వివరించేవాళ్ళు వాళ్ళలో వాళ్ళే వాదోపవాదాలు చేసుకునేవారు గోలగోలగా వున్న జనమంతా ఒక్కసారిగా నిశ్శబ్దమయ్యారు, సూదిపడితే వినిపించేంతగా.

అందరి కళ్లూ బోనులో నిలబడి ప్రమాణంచేస్తున్న అరుణమీదే వున్నాయి. ముప్పయి, ముప్పయ్యయిదు ఏళ్ళ మధ్య మంచి వయసులో, యౌవనంలో వుంది ఎంతో అందంగా వుంది విషాదం మూర్తీభవించిన ఆ ముఖంలో కూడా ఏదో ఆకర్షణ ఆ అందంలో ఎంతో సౌకుమార్యం

పచ్చటి ఆమె ఒంటిఛాయ నల్లని పల్చటిచీరలో ప్రస్ఫుటమౌతోంది. తల మీదుగ కప్పుకున్న ఆ పైటచెరగులోంచి కోలనైన ఆ పచ్చటిముఖం కొద్దిగా మాత్రమే కనిపిస్తోంది

మనిషిలోని సౌకుమార్యం, అందం, ప్రమాణంచేస్తున్న ఆ కంఠస్వరంలోని మాధుర్యం, మార్దవం గమనిస్తున్న ప్రేక్షకులు ఆమె అలాంటి నేరం చేసి బోను ఎక్కిందంటే నమ్మలేకుండా ఉన్నారు

నాదోపవాదాలు జరగవలసిన అవసరంలేదని మనివి చేసుకుం
'ు నేను అంగీకరిస్తున్నాను కోర్టువారు అడిగే ప్రశ్నలకు
లేను నేను నేరం ఎలా చేశానన్నది, ఎటువంటి పరిస్థితులలో
ు అన్న విషయం మాత్రం అందరి ఎదుట విన్నవించుకోవా
కోర్టువారు అనుమతిస్తే నా కథ చెబుతాను"
ంచిన అరుణ కొద్దిగా తలెత్తి జడ్జికేసి, న్యాయమూర్తులకేసి
విండివున్న జనంకేసి చుట్టూ ఒకసారి చూసింది ఆ కళ్లలో
గానీ, బాధగానీ లేవు ఒక విధమైన నిర్లిప్తత ముఖంలో
కోర్టు నిశ్శబ్దమయింది
మంద్ర స్వరంతో మెల్లమెల్లగా మొదలుపెట్టింది అరుణ

*        *        *

నా పేరు అరుణ ప్రస్తుతం నా వయసు ముప్పయిరెండేళ్లు. సంతానం నలుగురులోనూ మొదటి ముగ్గురూ ఆడపిల్లలు బాబు చివరివాడు

నా పద్నాలుగో ఏట ..

స్కూలు జరుగుతూండగానే ఏదో భయం భయంగా అనిపించి మధ్యలో లేచి యింటికి వచ్చేశాను అమ్మ కనిపించగానే భోరుమని ఒకటే ఏడుపు లంకించుకున్నాను బెంబేలెత్తిపోయింది అమ్మ

'ఏమ్మా అరుణా ఏం జరిగింది తల్లీ' కంగారుగా దగ్గరకు పొదువుకుంది. చెప్పాను. చూపించాను. మళ్లీ భోరుమన్నాను

'ఇంతేనా ప్రాణాలు తీశావుకదే ఏదో పెద్ద ఆపద ముంచుకొచ్చేసినట్టు. పద పద ఆ గదిలోకి రా' అంటూ అమ్మ ముఖంనిండా సంతోషం పులుముకుని 'ఏమండోయ్' అంటూ నాన్న దగ్గిరికి పరుగెట్టింది నేను మొదట్లో భయపడి పోయానుగానీ తరువాత చాలా సంబరంగా గడిచిపోయింది.

పేరంటాలు, ముత్తయిదువులు, తాంబూలాలు, కొత్తబట్టలు 'ఓహో' అన్నింటికన్నా నాకు ఆనందం కలిగించింది ఇక స్కూలు మానేయమన్నమాట. ఎగిరి గంతులు వేశాను చదువుమీద శ్రద్ధలేకపోవడ మొకటే కారణం కాదు. మగపిల్లల వెకిలిచేష్టలు నాకు భరింపరానివిగా వుండేవి.

మావాళ్ళందరిలోకి నేను చాల అందమైనదాన్నని అనేవారు. ఇంట్లోవాళ్ళే కాదు, బయటివాళ్ళుకూడా నన్ను చూసిన ప్రతివాళ్లూ ఆ మాటే అనేవాళ్లు ఎదుగుతున్న వయసుతోపాటు నా అందం వన్నె పెరిగింది అయితే అందరి పల్లెటూరి




పిల్లల్లాగ వయసుకి మించినట్టు నా మనసు పెరగలేదు నా యీడు వాళ్ళకు తెలిసిన ఎన్నో విషయాలు నాకు అర్థమయ్యేవే కాదు వాళ్ల మాటలు, హాస్యాలు వింటూంటే నాకు అర్థంకానిదేదో మనసులో లీలగా ప్రస్ఫుట మయ్యేది కాని సరిగ్గా తెలిసేది కాదు

నాన్న చూసి చూసి ఓ సమ్మంధం తెచ్చారు. వాళ్ళు నన్ను చూడటానికి వచ్చారు.

'అమ్మాయిని చూసేదేమిటి బంగారు బొమ్మ' అంది అమ్మ నన్ను ముద్దు పెట్టుకుంటూ

'అబ్బాయి ఎంత అందంగా ఉన్నాడండీ' అంది పొంగిపోతూ పెళ్ళిచూపులు అయ్యాక.

నాకు సరిగ్గా చూడటానికి సిగ్గేసింది ~~కాని వాళ్లూ వీళ్లూ అతని~~ గురించి మాట్లాడుకుంటూంటే చెవులు రిక్కరించుకుని విన్నాను.

'అందంలో ఒకరిని మించి ఒకరున్నారు" అన్నారు చూసిన ప్రతివాళ్ళు.

'ఇంత అందానికి ఎవడు తపస్సు చేస్తున్నాడో' అనేవాళ్ళు తనని చూసి స్నేహితురాళ్ళు 'మరి ఇంత అందమైన అబ్బాయిని పొందటానికి తను కూడా తపస్సు చేసిందా' ఈ ఆలోచన వస్తే సిగ్గు ముంచుకొచ్చేది నాకు.

ఎంతో సంబరంగా మరెంతో అట్టహాసంగా మా పెళ్ళి జరిగిపోయింది

'చీకటి వుక్క పందిరిమంచం మల్లెపూలు అగరొత్తుల పరిమ ళాలు పళ్ళేలనిండా పిండివంటలు వీటన్నిటి మధ్య భయంభయంగా సిగ్గు

సిగ్గుగా మా అందచందాలు, ఆకర్షణలు, ఆలోచనలు, అలవాట్లు ఒకరి కొకరు పంచుకున్నాం. పొద్దున లేచాక మాత్రం మళ్ళీ రాత్రయ్యేవరకు ఆయన ముఖంచూస్తే ఒట్టు. సిగ్గుతో చచ్చిపోయాను ఇలా జరిగింది నా పెళ్ళి, పేరంటం. తెలిసీ తెలియని వయసులో, విరిసీ విరియని మనసుతో భర్తతో కాపురానికి వచ్చాను. మావారు విరుద్యోగి.

'ఇదే మన ఇల్లు' అన్నారు.

కోటి కోరికలతో ఆ గడపదాటి లోపలికి అడుగుపెట్టాను.

ఆయన వుద్యోగం ఏమిటో, వచ్చే జీతం ఎంతో యివేవీ నాకు అక్కర వుండేవి కావు తను తెచ్చిన సరకులతో వండటం, ఆయనకోసం ఎదురుచూడటం, ఆయవ ఒడిలో నా కోరికలు పండించుకోటం, యింతే తెలిసింది ఆఫీసుకు బయలుదేరి వెళ్ళేవరకు నా కొంగుపుచ్చుకుని ప్రతిక్షణం పనికి అడ్డుతగులుతూ వేళాపాళా లేకుండా సరాగాలు మొదలెట్టేవారు. ఆయన అటు భోజనం చేసి వెళ్ళగానే ఒంటరిగా దిక్కుతెలియనిదానిలా వుండిపోయేదాన్ని.

వెళ్ళేముందు గదిలోకి పిలిచి కౌగిట్లో బిగించేవారు ఆయన వెళ్ళిపోయాక కూడా చాలాసేపు నా పెదవులమీద ఆ వెచ్చని స్పర్శ అలాగే వుందనిపించేది. దినాలు ఎంత తొందరగా దొర్లిపోయేవో ఆశ్చర్యంగా వుండేది ఒకనాడు రాత్రి ఆయన ఒళ్ళో పడుకుని గోముగా అడిగాను

'నేను మా వాళ్ళింటికి వెళ్ళాలి చూడాలని వుంది'

'అలాగే. శనివారం రాత్రి బయలుదేరి వెళదాం. ఆదివారం వుండిపోయి సోమవారం వుదయమే తిరిగి వచ్చేయొచ్చు'

'అలాకాదు యీసారి ఓ నాలుగైదు నెలలుదాకా తిరిగి రాదలుచుకోలేదు'

'అదేం' విక్కముఖం పెట్టారు

'నాకు మీరు వెళ్ళిపోయాక ఒంటరితనంతో విసుగ్గా వుంది. అందుకని తోడు తెచ్చుకోవాలని'

'అందుకు నెలల పర్యంతం వెళ్లాలా పుత్తరం వ్రాస్తే మీవాళ్ళే ఎవరో ఒకరు వచ్చి కొన్నాళ్ళు తోడుగా వుంటారు.'

'అబ్బబ్బ మట్టిబుర్ర తోడు అంటే.. అదే ..మనిద్దరికీ కూడా కాలక్షేపంగా .. ఎప్పటికీ మనతోనే వుండిపోయే '

ట్యూబ్‌లైట్ వెలిగింది ఆయన సంతోషం పట్టశక్యం కాలేదు.

పెళ్ళయి సంవత్సరం తిరిగేసరికి 'పద్మ' పుట్టింది.

పాపకు పాలు పట్టటం కూడా చేతకాలేదు నాకు. అవన్నీ నేర్చుకుని పరిస్థితి ఒక కొలిక్కి తెచ్చుకొనేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. పాప ముద్దుముచ్చట్లలో మునిగిపోయిన మేము యింకా యింకా తేలకుండానే మళ్ళీ కడుపు. పద్మకు ఏడాది నిండేసరికి మరో పాప పుట్టింది 'ఉష' అప్పటికి నాకు కాస్తా అనుభవం వచ్చింది. సంసారం అంటే ఏమిటో యిప్పుడిప్పుడే అర్థంఅవుతోం దనిపించింది రాత్రీ పగలూ భేదంతెలియకుండా మొగుడూ పెళ్ళాల ముచ్చట్లే కాదు బరువులూ బాధ్యతలూ కూడా ముసురుకొని వస్తాయి కాపురం అంటే అవి తెలిసొచ్చింది

కాపురంలో కలతలు, ఒడిదుడుకులు మొదలయ్యాయి

సంసారంలో డబ్బు అవసరం తెలిసింది డబ్బుకి యిబ్బంది పడటం అనుభవానికి వచ్చింది అయనవైపు అదుకునేవారెవరూ లేరు. అసలు ఆయనకి ఒక అక్కగారు తప్ప మరెవరూ లేరు అవిడ ఎక్కడో చాలా దూరంలో పిల్లలమూ, సంసారాన్ని ఒక్కనాడూ కూడా వదిలిరాలేని యిబ్బందుల్లో వుంటుంది.

ఆ వేళ నలతగా అనిపించి పడుకుండిపోయాను.

'అరుణా ఏమిటలా వున్నావు?' మంచంమీద పక్కనే కూర్చుని నా నడుము మీదుగా చేయివేసి లాలనగా అడిగారు

చెప్పటానికి/ముఖం చెల్లలేదు. సిగ్గుగా వుంది. అవమానంగా వుంది–బాధగా దుఃఖంగా కూడా వుంది

తప్పుచేసినదానిలా తలను వంచుకున్నాను

'చెప్పు అరుణా' నా ముఖంలో ముఖంపెట్టి అడిగారు.

'ఈ సారి నేను అపరేషన్ చేయించుకుంటానండి. అయన ముఖంలోకి చూడకుండానే అన్నాను

'అంటే యిప్పుడు నీవు మళ్ళీ '

మౌనమే సమాధానం యిచ్చింది చివాలున అక్కడినుంచి లేచి వెళ్ళిపోయారు దాంతో కంఠంలోనే సుళ్ళుతిరుగుతూండిన ఏడుపు తన్నుకు వచ్చింది. దిండులో తలదూర్చి ఎంతసేపో యేడ్చాను

నాకు తెలుసు, యిప్పటి పరిస్థితులలో యిది అదనపు భారమని కాని తప్పు నాది మాత్రమేనా? కోపం కూడా వచ్చింది.

రెండోదానికే పాలులేక పాల డబ్బాలు కొంటూ అవి ఒంటికి సరిగ్గా పడక పాప ఆరోగ్యం చీటికిమాటికీ వేధిస్తూ ఆ రోగాలకి, మందులకి తలమునిగేలా వుంది. వెంటనే యిదొకటి.

ఆ రాత్రి ప్రక్కలో పడుకుని మీద చెయ్యివేసినా వులుక్కుండా పలుక్కుండా వుండిపోయాను

'కోపం వచ్చిందా ఛ ఛ మనసులో పెట్టుకోకు ఏదో వర్రీడ్‌గా వుండి పరేగానీ యీ సారి అబ్బాయి పుట్టాలి మరి. అప్పుడే ఫుల్‌స్టాప్ '

'మళ్ళీ పాపే పుడితే '

'మరో ఛాన్సు యివ్వక తప్పదు '

'ఛీ పొండి ' కోపమంతా కరిగిపోయి ఆయన గుండెల్లో ఒదిగిపోయాను.

ఈ మారు ప్రసవం చాలా కష్టమైంది. బలహీనంవల్ల బాలింతగా వుండగానే జబ్బు చేసింది. ఎట్లా సమకూర్చారో తెలీదుగానీ నా జబ్బు కొన్ని వందల రూపాయలను మింగేసింది బాబు పుడితే ఆపరేషన్ చేయించుకోవాలన్న నా కోరిక తీరలేదు ఆయన ముచ్చటకోసం మరో అవకాశం యివ్వక తప్పలేదు

ఇల్లు గడవటం కష్టమయింది సరదాగావుండే ఆయన దిగులుపడిపోయారు.

'పాపకు పాలడబ్బా అయిపోయింది' అన్నాను

'నా జేబులో డబ్బు కూడా అయిపోయింది '

'మరెలా ? పాలుతాగే పిల్లకదా. నా దగ్గర కూడా లేవు '

'నన్ను చావమంటావా ?'

ఆ మాటతో నా నోరు కట్టుబడిపోయేది గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ వెళ్ళిపోయేదాన్ని.

దారిద్ర్యం ఎంత బాధాకరమయింది. ప్రేమానురాగాలు పెనవేసుకొన్న మనుషులను ఎంత కఠినంగా మారుస్తుంది. ఎలాంటివాళ్ళలోనయినా ఊహించ లేని మార్పులు తెచ్చేవి రెండే. ఒకటి డబ్బు. దారిద్ర్యం రెండోది మా యిద్దరి మధ్యా చిలిపిచేష్టలు, అలకలు, ప్రతిమాలుకోటాలు, శృంగారం చాల వరకు తగ్గిపోయింది.

ఆఫీసునుండి యింటికి రాగానే కొంగు వదలకుండా నా వెంటవెంటే తిరిగే ఆయన ఇప్పుడు ముభావంగా, దిగులుగా, ఒంటరిగా ఆలోచిస్తూ కూర్చుండి పోతున్నారు

యింట్లో యిబ్బందులతో, డబ్బు సర్దుబాటుకాక అట్లా దిగులుగా మారిపోయా రనుకుంటే నాలో ఎక్కడలేని ప్రేమా పొంగిపొర్లేది అలాంటప్పుడు ఏదో చిలిపిమాటలతో, చేష్టలతో తన నిర్లిప్తతను కొంతవరకు పోగొట్టగలిగేదాన్ని.




ఆ రాత్రి గడిచి తెల్లవారితే మళ్ళీ మొదలు ఒక్కోసారి అర్ధరాత్రి మెలకువ వచ్చి చూస్తే పైకప్పుకేసి చూస్తూ, ఆలోచిస్తూ కనబడే ఆయన్ని చూసి నా గుండెల్లో గుబులుపుట్టేది కళ్ళలో నీళ్ళు తిరిగేవి పిల్లలు పుట్టకముందు ఎట్లావుండేవాళ్ళమో తలుచుకుని పిల్లల్ని చూస్తే విసుగొచ్చేది వాళ్ళ పక్క-లోంచి లేచి వెళ్ళి ఆయన్ని కావిలించుకుని పడుకునేదాని. ఇద్దరిలో యే ఒక్కరమో ఒక్కమాటా మాట్లాడకపోయినా నా లాలనలో ఆయన వుపశమనం పొందినట్టు అనిపించేది కారుచీకటిలో సౌదామినిలా అప్పుడప్పుడూ యివన్నీ మరిచిపోయినట్టు నన్ను ప్రేమగా, మనస్ఫూర్తిగా దగ్గరకు తీసుకునేవాళ్ళు. పిల్లలను లాలించి ఆడించేవాళ్ళు

ఈసారి.. నాలుగోసారి

ఆయనకి విషయం చెప్పాలంటేనే భయం వేసింది. చెప్పలేకపోయాను కూడా కొన్నాళ్ళకి ఆయనకే అనుమానం తోచినట్టుంది.

'ఈసారి బాబు పుడతాడంటావా ?'

చెప్పకపోయినా తెలుసుకున్నారే అన్న ఆశ్చర్యంతో వులిక్కిపడి చూశాను. వెనువెంటనే ముఖం వాల్చేశాను

'అరుణా! తప్పుచేసినట్టు బాధపడతా వెందుకు ? ఇబ్బందులు వుంటూనే వుంటాయి మనసు బావుండక నీకు బాధ కలిగించి వుండొచ్చు నన్ను క్షమించు. ఈసారి పాపయినా సరే, బాబయినా సరే 'బంద్ సరేనా ?'

నాలుగోసారి చాలా బలహీనపడిపోయాను. ఒంట్లో రక్తం చాల తక్కువగా వుందని మంచి మందులు, టానిక్కులు వాడాలని అంది డాక్టరు అవన్నీ ఎలా తెచ్చారో తెలియదుగానీ అతికష్టంమీద ప్రసవం జరిగింది. అంత కష్టంలోనూ బాబు పుట్టటం మాకు ఆనందమే కలిగించింది యిక పిల్లలు వద్దనుకుని ఆపరేషన్ చేయించుకున్నాను.

హాస్పిటలు నుంచి తిరిగి వచ్చాక కూడా బోలెడు మందులు, టానిక్కులు చిన్నపిల్లలిద్దరికీ పాలడబ్బాలు, డబ్బు సర్దుబాటు అవక తల తిరిగిపోసాగింది.

ఇంట్లో అవసరాలు బాగా పెరిగాయి బజారులో ప్రతి వస్తువూ ధర పెరిగింది. తగినంతగా జీతాలు పెరగనందున యిబ్బందులు మొదలయ్యాయి

'అరుణా! యివాళ పనిపిల్ల రాలేదేం ?'

'వద్దన్నాను ' అంట్లు తోముతూ అన్నాను.

'ఎందుకని ?'

'వదిహేను రూపాయలు మిగిలిద్దామని '

'ఆ తరువాత యిరవైరూపాయల మందులు తెచ్చుకోవాల్సి వస్తుంది.' విసురుగా అన్నారు

'మీరు నాకే మందులూ, టానిక్కులు తేనక్కరలేదు. వాటి గురించి పాపం మీరేం యిబ్బంది పడక్కరలేదు '

నా పొదుపుని అర్థంచేసుకుని అభిమానించకపోగా విసుక్కున్నందుకు నాకు కోపం వచ్చింది

నాలుగురోజులపాటు ఒకరితో ఒకరం మామూలు అవసరాలకు మించి ఒక్క మాటకూడా సరదాగా మాట్లాడుకోలేదు

ఈ నాలుగు రోజులూ ఆయనెందుకో సరిగా భోంచేయలేదు రాత్రంతా నిద్ర పోయినట్టు కూడా అనిపించటంలేదు దిగులుగా ఎంతో వ్యధ చెందుతున్నట్టుగా కనిపించినా నేనూ కోపంతో గమనించనట్టుండిపోయాను.



నలుగురు పిల్లలూ పసివాళ్ళు కావడంతో వాళ్ళ పాలు, తిండి, జబ్బులు, మందులు చిరాకెత్తిపోయేది.

పనిమనిషిని కూడా మాన్పించేయటంతో పొద్దస్తమానమూ బండచాకిరితో బండబారిపోయాను. దానికి తోడు యీయన చిరాకులు, విసిగింపులు – దీంతో నా మనసూ పాడయిపోయేది.

ఆయన కష్టం, సుఖమూ గమనించుకునే సహనం నాకు గానీ, విసిగిపోయి వున్న నన్ను భరించే ఓర్పు ఆయనకి కానీ లేకపోయాయి.

ఒక రాత్రి

ఎవరి ప్రక్కలమీద వాళ్ళు పడుకున్నాం. పిల్లలు నిద్రపోయారు. నాలుగు రోజులుగా మా యిద్దరి మధ్య రుసరుసలుగానే వుంది. పక్కమీద వాలగానే అలసటతో బాగా నిద్రపట్టేసింది

నిద్రలో చప్పున మెలకువ వచ్చింది ఒక్క క్షణం నాకేం అర్థంకాలేదు. అర్థంచేసుకున్న క్షణం నా గుండెలు ఝల్లుమనాయి అయన నా పాదాలమీద తలవాల్చుకుని వెక్కి-వెక్కి ఏడుస్తున్నారు నా ఒళ్ళంతా భయంతో, తెలియని ఆందోళనతో గగుర్పొడిచింది

చెట్టంత మగవాడు యిలా అర్ధరాత్రివేళ

పటుక్కున లేచి కూర్చుని ఆయన తలని నా ఒడిలోకి లాక్కున్నాను

తన రెండు చేతులతో నా నడుముని చుట్టేసి, నా ఒడిలో తలదాచుకుని వెక్కిళ్ళు పట్టి ఏడవసాగారు. ఆపుకోవాలని చూస్తున్నారు కానీ వ్యర్థ ప్రయత్నమే అవుతోంది.

నా కళ్ళలోనూ నీళ్లూరుతున్నాయి

వచ్చిన అవాంతరం ఏమిటో? లేక యింట్లోని యీ యిబ్బందులకు తోడు, నా నిరాదరణ అతడిని బేలగా చేసిందా? నన్ను నేనే తిట్టుకున్నాను 'ఎందుకని' అడుగాలనుకున్నాను కాని...కాని యీ సమయంలో ప్రశ్నలు వేస్తే వచ్చేవి జవాబులు కావు కట్టలు తెగే కన్నీళ్ళు

ఇప్పుడు కావలసింది ఆ వ్యథిత హృదయానికి ఉపశమనం

అయన తలని, వీపుని నా చేతులతో నిమురుతూ వుండిపోయాను కాసేపటికి ఆ దుఃఖం పొంగు చల్లారింది

'అరుణా!' అన్నారు తలెత్తకుండానే జీరగా దుఃఖంతో పూడుకుపోయి నట్టు వుంది కంఠస్వరం

'ఏమండీ? ఏమిటిది? ఏం జరిగింది?' నా ఆతృతను అతి ప్రయత్నం మీద అణిచిపెట్టుకుంటూ నెమ్మదిగా ప్రశ్నించాను

'అరుణా అరుణా ' ఆ కంఠంలో దుఃఖం యింకా సుళ్ళు తిరుగుతూనే వుంది.

'ఇన్నేళ్ళ సంసారంలో ఏనాడు మీ కంట తడి చూడలేదు నేను మీరిలా ఏడవకండి. నాకూ ఏడుపు వస్తోంది ' అనడమేమిటి వచ్చేసింది నాకు

'అరుణా అరుణా నాకు నాకు చచ్చిపోవాలని వుంది అరుణా ' నా

ముఖంలోకి చూస్తూ ఆ మాటలు అనేసి మరుక్షణం మళ్ళీ నా ఒడిలో తలదాచుకున్నారు.

నా గుండెలు గుభేలుమన్నాయి. నా నవనాడులు స్తంభించిపోయినట్లు విరత్తురాలనయ్యాను.

ఏంమాట యిది. ఆయనకి అలా అనిపించటానికి కారణమేమిటి. ఇంటి పనులతో విసిగి వేసారిపోయిన నా చీదరింపులని, నా నిర్లక్ష్యాన్ని భరించలేక యిలాంటి నిర్ణయానికి వచ్చారా? లేక యీ సంసారం యీదలేక....

'ఏం మాటలండీ అవి. ఇలాంటి మాటలు మీరు అనవలసినవేనా. ఆ పసివాళ్లని చూడండి. నా ముఖం చూడండి. మమ్మల్ని చూస్తూ మీరు మరోసారి ఆ మాట అనగలరా? అయినా యిప్పుడేమంత మునిగిపోయిందని? ఇబ్బందిగా ఉంది. కాస్త కష్టపడుతున్నాము. అంతమాత్రాన యివేం మాటలు. మనలాంటి వాళ్లు యీ ప్రపంచంలో కొల్లలు. అందరూ మీలాగే అనుకుంటున్నారా? అయినా కష్టాలు మనుషులకి కాక మాన్లకి వస్తాయటండీ,' అన్నాను. నాకు తెలుసు ఇలాంటి మాటలతో మనసును అదుపులో పెట్టుకోగల ఓర్పు ఏనాడో హరించుకుపోయింది నాకు కూడా అని.

'ఏమండీ! పని ఎక్కువయి మిమ్మల్ని విసిగించి వుంటాను. ఆ విసుగులో మీరేదో అంటే కోపంగా నేనూ మాటకి మాట అని వుంటాను. వాటికి ప్రాముఖ్యాన్ని యిచ్చి మీ మనసు నిలా పాడుచేసుకోవద్దు నన్ను క్షమించండి. మిమ్మల్ని యింతగా బాధపెట్టానని నాకు తెలియలేదు.' ఏడుస్తూ నేను ఆయన మీద వాలిపోయాను.

'కాదు అరుణా....లేదు. లేదు. నీమీద నాకేం కోపంలేదు. అయినా మనిద్దరిలో మనకి కోపంగానీ, తాపంగానీ ఒకరిమీద ఒకరు చూపుకోవాల్సిందే కానీ పరాయివాళ్ళమీదకి పోతామా.'

'మరి .. మరి.... ఇంట్లో కటకటగా వుందనే కదూ కష్టాలు ఎల్లకాలమూ వుంటాయా. మంచిరోజులు మనకీ వస్తాయి. కాకుంటే కాస్త సహనం కావాలి. అంతేకాని....'

'నాకు తెలుసు అరుణా. కాని.... కాని రేపటినుంచీ మనకీ బ్రతుకు కూడా వుండదు అరుణా. ఈ పిల్లలకు యీ మాత్రం గంజినీళ్ళు కూడా పోయలేం అరుణా మనం.' పెళ్ళగించుకుని రాబోయే దుఃఖాన్ని ఆపుకో ప్రయత్నిస్తూ అన్నారు

'ఏమిటండీ మీరనేది' నా కంఠంలో కంపనం. ఏదో అవ్యక్తమయిన భయం నా వెన్నులోంచి జరజరా నిలువునా ప్రాకింది.

'బాబు పుట్టకముందు పాప పుట్టిన కొత్తలో నీకు జబ్బుచేసింది గుర్తుందా. నీవా బాలింతరాలివి. ఆ సమయంలో ఏ జబ్బయినా ప్రమాదమే. ఎన్నో మందులు, టానిక్కులు కావాల్సి వచ్చాయి. ఎక్కడా అప్పు దొరకలేదు. అత్యవసరమై, మరో మార్గంలేక ఆఫీసుడబ్బు వాడుకున్నాను. ప్రస్తుతానికి గండం గడిస్తే ఆ తరువాత ఆలోచిద్దాం అనుకున్నాను. అంతలో మళ్ళీ నీవు గర్భవతివి కావడం మళ్ళీ నీ ఆరోగ్యంకోసం బాబు ప్రసవంకోసం బోలెడు డబ్బు ఖర్చయి మనం కోలుకోలేకపోవటంతో ఆ వాడుకున్న డబ్బుని సర్దుబాటు చేయలేకపోయాను. ఆ ఆలోచనలతోనే, ఆ దిగులుతోనే యీ మధ్య నేను కృంగిపోతున్నాను. ప్రతి క్షణమూ నాకా డబ్బే గుర్తువస్తుంటే తినటానికి సయించక, కంటికి కునుకురాక అవస్థపడుతున్నాను. నాలో నేనే కుమిలి కుమిలిపోతున్నాను. ఈ రోజు మా ఆఫీసరు చెకింగ్‌కని దిగాడు. పొద్దున్నే ఈ విషయం బయటపడుతుంది. నేనా డబ్బు కట్టేయలేకపోతే నా ఉద్యోగం ఊడుతుంది. బహుశా జైలుకి కూడా....'

కెవ్వుమన్నాను నేను.

'వద్దండీ అంత మాట అనొద్దు. ఊహామాత్రంగా కూడా నేను భరించలేను. యిన్నాళ్ళుగా యీ విషయం నా దగ్గరెందుకని దాచారు?' అన్నాను. చెబితే మహా ఏదో చేసేసేదాన్ని అన్నట్టుగా. నాకు తెలుసు నేనేం చేయలేనని.

'చెప్పి విన్పి మరింత బాధపెట్టి, అలిసిపోయిన నీ మనసు, శరీరం విశ్రాంతి కూడా దూరంచేయలేకపోయాను అరుణా!'

ఆ కంఠంలో ఆవేదన నా గుండెలను పిండివేసింది.

'అయితే యిప్పుడేం చేయాలనుకుంటున్నారు?'

'ఏమో. నాకేం దిక్కుతోచటం లేదు., అందుకే తెల్లారేసరికి చచ్చిపోతే బావుండునని అనిపిస్తోంది. కాని అరుణా నీవూ.... యీ పసిపిల్లలూ....' చప్పున అరచేత్తో అయన పెదవులు మూశాను.

'ఆ మాటలు మాత్రం అనొద్దు దయచేసి. నేను భరించలేను. యిప్పుడు యింకేం ఆలోచించి నిర్ణయించే స్థితిలో లేము భగవంతుడే ఏదో మార్గం చూపకపోడు. ఉదయం చూద్దాం. ఇప్పటికి కాసేపు కళ్ళుమూసుకుని పడుకుని విశ్రాంతి తీసుకోండి,' అన్నాను.

ఒకరి గుండెల్లో ఒకర్ని పొదువుకుని కళ్ళు మూసుకుని కౌగిలించుకుని పడుకున్నాము

ఇద్దరికీ తెలుసు ఎవరం నిద్రపోవటంలేదని. ఆ మూసిన కనురెప్పల మాటున కళ్ళు అశాంతితో, బాధతో అలమటిస్తున్నాయని, అశ్రువులు కారుస్తున్నాయని.

తెల్లవారింది

అప్పుడే వెళ్ళి ఎవరినో దహనంచేసి వచ్చినవారిలా వుంది ఆయన ముఖం.

'ఆఫీసుకి టైమయింది,' మామూలుగా అన్నాను

'అరుణా!'

ఆ ముఖంలో, ఆ కళ్ళలో దీనత్వం నన్ను కదిలించివేసింది. దగ్గరకు తీసుకుని నా గుండెల్లోకి పొదువుకోవాలనుకున్న వెర్రి ఆవేశాన్ని అణుచుకున్నాను.

'ఎలా వెళ్ళను అంటారు అంతేనా ఏదో ఒక మార్గం చూసుకోవాలి కాని యింట్లో ఊరికే బాధపడుతూ కూచుంటే సమస్య పరిష్కారమవుతుందంటారా. లేచి ముందు బట్టలు వేసుకోండి. తరువాత చెబుతాను '

నేను అందించిన బట్టలు యాంత్రికంగా ధరించారు చెప్పుల్లో కాళ్ళు పెట్టబోతూ మళ్ళీ వెనక్కి వచ్చి కుర్చీలో తలపట్టుకు కూర్చున్నారు

'ఒకసారిలా చూడండి '

ఆయనముందుకు వెళ్ళి నిలబడి ఆయన తలని నా గుండెలకు ఆనించుకుని ఆ తలవెంట్రుకలను నా అరచేత్తో రాస్తూ న్నా

కళ్ళు మాత్రం ఎత్తి చూశారు. నిండుకుండల్లా వున్నాయి

నా చేతుల్లోని లాలనకి ఆ గుండెల్లోని ఆవేదన కరుగుతోంది కరిగి కరిగి ప్రవహించబోతుంది

పైటకొంగుతో ఆ కళ్ళ తడి అద్దాను

'మీరు తప్పుచేశారు అవునా ?'

యీసారి దెబ్బతిన్నట్టు చూశారు

'చూడండి అవసరంకోసమే చేసినా అది అపరాధమే. మీరు ఆ ఆఫీసరుతో ప్రత్యేకంగా మాట్లాడండి మన పరిస్థితులు, కష్టాలు ఇంట్లో ఇబ్బందులు ఆయన ఆయనకి ఎరుకపరచండి ఎటువంటి విషమ పరిస్థితిలో ఇలా చేయవలసివచ్చిందో ఆయనకి నివేదించుకుని మీ పరిస్థితికి దయచూపమని మీ తప్పుకు క్షమించమని

చివరి మాటలు ఆయనకి అయిష్టంగా కనబడినట్టుంది తల తిప్పుకున్నారు. అనునయించాను

'ఇందులో అవమాన పడవలసింది లేదు తప్పు ఎందరో చేస్తారు దాన్ని ఒప్పుకొని క్షమార్పణ కోరుకోవడంలోనే గొప్పతనం వుంది మీ అపరాధాన్ని ఒప్పుకుని క్షమార్పణ అడగండి గంజినీళ్ళయినా త్రాగగలుగుతున్న యీ ఆధారాన్ని లాగేయవద్దని, వాడకున్న సొమ్ముని సర్దుబాటుచేయడానికి కొన్నాళ్ళు వ్యవధి ఇవ్వమని ప్రార్థించండి ఎంత పెద్ద ఆఫీసరయినా ఆయనా మనిషే. మన యిబ్బంది అర్థంచేసుకోవచ్చు దయతలచవచ్చు ' నా మాటలు పూర్తి కాకమునుపే చివాలున లేచారు గబగబా చెప్పుల్లో కాళ్లు దూర్చారు.

గుమ్మం దాటబోతుండగా తిరిగి అన్నాను

'ఆవేశం ఉద్రేకం ప్రదర్శించకుండా నేను చెప్పింది చెప్పినట్టుగా అప్పటికే నా మాటలు వినబడనంత దూరంలో వెడుతున్నారు

ఆ పనీ యీ పనీ చేస్తున్నానన్న మాటేగానీ నా మనసు మనసులో లేదు. ఆఫీసులో ఆయన ఎటువంటి పరిస్థితుల మధ్య నిలబడి వున్నారు ఎన్ని ప్రశ్నలకు తలవాల్చి వున్నారు ఆ ఆఫీసరుది గుండెనో, నల్లబండేనో ముప్పిరిగొంటున్న ఆలోచనలతో మనసుకు స్థిమితం కుదరక కాలుగాలిన పిల్లిలా తిరగసాగాను

ఏ ధోరణిలో వస్తారో, ఎలాంటి వర్తమానం తెస్తారో అని ఒకటే ఆందోళన. ఆ వార్త ఎలాంటిదయినా విని తట్టుకుని ఆయన మనసు విరిగిపోకుండా ఎలా ధైర్యం చెప్పాలో మననం చేసుకోసాగాను

మనసులో లేని ప్రశాంతత ముఖంలోకి తెచ్చుకోటానికి ప్రయత్నం చేస్తూ, నాలో లేని విబ్బరాన్ని ఆయనకి యివ్వాలనే తాపత్రయంతో చెదిరిన నా మనసును కూడగట్టుకున్నాను

చెదిరిపోయిన నా తలను దువ్వుకున్నాను

ముఖం కడుక్కుని, బొట్టు పెట్టుకుని శుభ్రంగా తయారయ్యాను పిల్లలను ఆటలకని బయటకు పంపేశాను.

ముఖాన చిరునవ్వు అతికించుకున్నాను.

క్షణ మొక యుగం అంటే ఇప్పుడే అనుభవానికి వచ్చింది నాకు

'అరుణా.'

మెరుపులా వెళ్లి తలుపు తీశాను నా కళ్లు ఆయన కళ్లలో ఏదో వెతుక్కోసాగాయి

ఆ ముఖంలో సంతోషం కనిపించకపోయినా బాధా కనిపించలేదు

'లోపలికి పద '

ఆయన ఆమాట అనేదాకా గుమ్మందగ్గర కొన్ని క్షణాలు జరిగిపోయాయని నాకు తెలియలేదు

సరిగ్గా అప్పుడే చూశాను ఆయనకి కాస్త వెనగ్గా మరో మనిషి.... మగవాడు

చప్పున తలవంచుకుని లోపలికి వచ్చేశాను

నా ఆతృత అంతా నిప్పులమీద నీళ్ళు చల్లినట్లుగా అణిగిపోయింది అయిన్ని ఏదేదో అడగాలని వున్నపళంగా విషయాలన్నీ తెలుసుకోవాలని నా ఆరాటం అంతా ఆ కొత్త వ్యక్తి రాకతో ప్రక్కకు నెట్టక తప్పలేదు. ఏం జరిగిందో అన్న ఆలోచన నన్ను తినేస్తోంది

ఆ వచ్చిన మనిషిని హాల్లోని కుర్చీలో కూర్చోబెట్టి ఆయన గబగబా లోపలికి వచ్చారు

'అరుణా '

'వెళ్ళినపనేమయింది ?'

యిద్దరం ఒకేసారి అన్నాం

అంత చప్పున నేరుగా ఆ విషయం గురించే ప్రశ్నించేయ కూడదని పుదయం నుండీ నేను చేసుకున్న నిర్ణయం ఎట్లా సడలిపోయిందో మరి

అప్పటికే ఆలశ్యమయినట్టుగా కనిపించిన నాకు ఆయన ఒంటరిగా లోపలికి రాగానే అదే ప్రశ్న వచ్చింది.

'అరుణా ! ఆయనే ఎంక్వయిరీకి వచ్చిన ఆఫీసరు. నీవు చెప్పినట్టే చెప్పాను. సానుభూతితో సాంతం విన్నారు. మన యింటికి వస్తానన్నారు తీసు కొచ్చాను ఆయనకు కప్పు చక్కని కాఫీ '

'అలాగే ! మీరు ఆయనతో మాట్లాడుతూండండి '

స్టౌమీద నీళ్ళు పడేశాను కాఫీపొడి లేక పుదయం కాఫీ గాయలేదని ఆయనకీ తెలుసు

పెరటి గుమ్మ గుండా ప్రక్కయింటికి వెళ్లాను. ఓ చిన్న గరిటతో కాఫీ పొడి తెచ్చాను

గిన్నెలో పిల్లలకోసం వుంచిన కాసిని పాలు పోసేసి కాఫీ కలిపాను సరిగ్గా రెండే కప్పుల కాఫీ అయింది

ఒక్క చుక్క స్పూనతో నోట్లో పోసుకున్నాను

అద్భుతంగా వుంది కాఫీ నిజానికి అలాంటి కాఫీ త్రాగి ఎన్నాళ్ళు అయిందో ! నాకూ తాగాలనిపించింది. కాని రెండే కప్పులు




రాత్రి పదకొండు గంటలవుతూండగా వచ్చారు ఆయన.

'యింతాలస్యం అయిందేం' పెదవుల దాకా వచ్చిన మాటలు ఆయన ముఖం చూసి అక్కడికక్కడే ఆగిపోయాయి.

నేరుగా పడకగదిలోకి వెళ్ళిపోయారు.

వంటింట్లోకి వచ్చి భోజనానికి అన్నీ రెడీచేసిపెట్టి గదిలోకి వెళ్లాను. కళ్ళు మూసుకుని మంచంమీద పడుకుని వున్నారు.

చైతన్యానికి మారుపేరులా వుండే ఆయన ఎంతగా మారిపోయారు. నా అర్ద్రత.

దగ్గరగా వెళ్ళి నిలబడ్డాను. ప్రేమగా నా చేతివ్రేళ్ళతో ఆయన క్రాపుని దువ్వాను

'కంచాలు పెట్టాను, భోజనానికి రండి.'

ఒక్క నిముషం నిశ్శబ్దం. జవాబు రాలేదు. కళ్లెత్తి అయినా చూడలేదు.

'ఇప్పుడే పొద్దుపోయింది. త్వరగా తినేసి పడుకొనేస్తే...'

'నాకు ఆకలిగా లేదు అరుణా!'

'అదేం యింట్లో తాగిన కాఫీయేగా?'

బయట ఏదయినా తినివుంటారనే అనుమానం నాకు లేదు. ఆయన జేబులో చిల్లరడబ్బులు కూడా లేవని తెలుసు నాకు.

'రండి. ఆకలయిన మాత్రం కొద్దిగా మజ్జిగన్నం....'

'వద్దు అరుణా. నా కెలాగో వుంది. తినాలని ఏమాత్రం లేదు.' ప్రక్కకి తిరిగి పడుకున్నారు.

అంటే 'యింక విసిగించకు. వెళ్ళు' అని అర్థం.

అప్పటికే నా కళ్ళు నీళ్లతో నిండిపోయి వున్నాయి.

'అయితే సరే, గిన్నెలు మూతలు పెట్టేసి వస్తాను,' వెనుక్కు తిరిగాను.

చప్పున లేచి నాచేయి పట్టుకున్నారు. అప్పటికే యింక యేమాత్రం భరించ లేమన్నట్టు రెప్పలు మూసుకోటంతో జలజలా రాలిన నా కళ్లనీళ్లు నా చేయి పట్టుకుని వున్న ఆయన చేతిమీద రాలాయి.

తడిసిన కళ్లతో ఆయన ముఖంలోకి చూడలేకపోయాను.

'అదేం అరుణా ! నీవు తినవా ?'

'పరమాన్నం భోంచేసిన రోజునగానీ, ఉప్పేసుకుని గంజినీళ్ళు త్రాగిన రోజునగానీ మీరు తినకుండా నేనెప్పుడయినా తిన్నానా ?'

'నిజం అరుణా ! సారీ.... అయాం వెరీ సారీ.... తెలిసి నిన్ను బాధపెడుతు న్నాను. వెళ్ళి వడ్డించు వచ్చేస్తాను.'

నన్ను దగ్గరకు తీసుకుని, నా నుదుటిమీద ఒక్క క్షణం పెదవులానించి నా కన్నీళ్లను గోటితో మీటేసి వదిలారు.

గది గుమ్మం దాటి రాబోతూ వెనక్కి తిరిగి చూశాను.

ఆయన కర్చీపుతో కళ్ళు ఒత్తుకుంటున్నారు.

భోంచేసినంతసేపు ఆయన్ని ఏం మాట్లాడించలేదు. తనూ ఏం మాట్లాడ లేదు. కాని మధ్య మధ్య నాలుగైదుసార్లు నాకేసి ఆర్తిగా చూడటం గమనిం చాను. చేయికడుక్కొని వెళ్ళిపోయారు.

గిన్నెలవీ సర్ది, వంటిల్లు తుడిచి తలుపులు మూసుకుని నేనూ వెళ్ళాను. ఈమధ్య చాలా రోజులుగా మా పడకలు వేరు అయ్యాయి. పిల్లల మధ్య పడుకుంటాను నేను.

మొదట్లో తన పక్కమీదికి వచ్చేవరకు సతాయించేవాళ్ళు. కానీ యీ మధ్య అశాంతి, దిగుళ్ళు, చిరాకులు, పరాకులు, కోపాలు, పౌరుషాలు వీటి మధ్యపడి మా సరసం సన్నగిల్లిపోయింది. ఇవేవీ గుర్తురాని కొన్ని క్షణాలు ఎప్పుడో గాని లభించేవి కావు.

పిల్లలకు దుప్పటి సర్ది ఆయన పక్కలోకి వచ్చి మెల్లిగా పడుకున్నాను కళ్ళు విప్పి చూడలేదు కానీ చేయి వీపుమీదుగా వేసి దగ్గరగా లాక్కున్నారు.

పెదవి విప్పి ఒక్క మాటయినా మాటాడలేదు కాని వాటి తడి నా ముఖమంతా పరచుకుంటోంది

ఆయన చేతుల్లో ఒదిగిపోయాను తప్ప నేను అడగాలనుకున్నది ఒక్కటీ అడగలేకపోయాను పెదవి విప్పలేకపోయాను

యిద్దరి మధ్య అంతులేని మౌనం.

యిద్దరిలో యే ఒక్కరూ ఏ ఒక్కమాట మాట్లాడినా ఆ హాయిని కోల్పోతా మేమోనన్నట్లు వుండిపోయాము

ఎప్పుడు నిద్రపోయామో ఎవరికీ తెలియదు.

పెద్దపాప పద్మ వచ్చి 'అమ్మా! అమ్మా!' అని తట్టి లేపేదాకా మెలకువ రాలేదు.

అప్పటికే ఎండ కరకరలాడుతూ వచ్చేసింది

మంచం దిగబోతూ ప్రక్కకి తిరిగి చూశాను.

కిటికీలోంచి కొద్దిగా ఎండ పక్కమీద పడుతోంది

ఆ బంగారు రంగు కాంతి ఆయన ముఖంమీద పడుతోంది పరీక్షగా చూశాను

ముఖం వాడిపోయి వడిలినట్లుగా వుంది. బుగ్గలు పల్చబడ్డాయి. ఎప్పుడూ నవ్వుతున్నట్లే వుండే ఆ పెదిమలపైన మెరుపు లేదు దిగులు మనిషిని ఎంత కృంగదీస్తుందో ఆయన్ని చూస్తేనే తెలుస్తోంది

"రామ్మా! పాలు కాచివ్వు"

పద్మ కొంగుపట్టి లాగేసరికి దృష్టి మరల్చక తప్పలేదు.

పిల్లలు ఒక్కొక్కరే వచ్చేశారు

'నాన్నని కాసేపు పడుకోనివ్వండి గోల చెయ్యొద్దు,' అన్నాను. వాళ్ళ పనులన్నీ గబగబా చూసేసి వాళ్ళనలా ఆటల్లోకి వదిలి పనిలో జొరబడ్డాను.

వంట సగంలో వుండగా లేచి వచ్చారు

'లేపకూడదూ. ఎంత పొద్దెక్కిందో. ఆఫీసుకి త్వరగా వెళ్లాలి కూడా.'

బాత్ రూంలోకి వెళ్ళారు.

ఏకంగా స్నానం చేసేసివచ్చి కాఫీ త్రాగారు

ఆయన్ని 'ఆ' విషయం అడగాలని మనసు పీకుతోంది. కాఫీ త్రాగుతుండగా అడగాలని, ఎలా అడగాలో రిహార్సలు వేసుకున్నాను. కాని మూడు గుక్కల్లో ముగించేసి గ్లాసందించేసి గబగబా వెళ్ళిపోయారు గదిలోకి.

కేరింతలు కొడుతూ కాళ్ళకు చుట్టుకోబోయిన పిల్లలని పలకరించనయినా లేదు.

అలవాటుగా 'అరుణా' అని నన్ను పిలవలేదు. 'మీ అమ్మేది?' అని అడగలేదు

చరచరా పడకగదిలోకి వెళ్ళిపోయారు

నా గుండెలు గుభేలుమన్నాయి.

ఏం జరిగి వుంటుంది? . అంట్ల నీళ్ళలోనే చేతులు అదరాబాదరా కడుక్కున్నాను మిగిలిపోయిన మసిని చీరకొంగుకి రుద్దేసుకున్నాను.

రెండంగల్లో యింట్లోకి వెళ్ళి గదివేపు అడుగులు వేశాను.

నా ముఖాన కొట్టినట్టుగా భడాలున తలుపులు వేయబడ్డాయి.

'ఏమండీ,' అని పిలవబోయాను.

తలుపులకు వేస్తున్న గడియ నా పెదవులకు వేసినట్టయింది.

ఏం జరిగింది? ఎందుకలా మాటాపలుకూ లేకుండా వెళ్ళారు కనీసం నా పిలుపయినా వినకుండా, నా ముఖమయినా చూడకుండా ఆ తలుపులు బిగించటం ఏమిటి?

నా గుండెల్లో దడ. కాళ్ళలో వణుకు.

తొలిగిపోతుందిలే అనుకుంటున్న అవాంతరం నెత్తిమీద పడిందా. అయితే మాత్రం

ఇంక ఆగలేకపోయాను తలుపులు తట్టాను.

'ఏమండీ,' పిలిచాను

తలుపులు తెరవలేదు. పిలుపుకి పలకలేదు.

నాలో ఆందోళన, తత్తరబాటు.

'యీయన ఏదైనా అఘాయిత్యంగానీ నా గుండెలు ఝల్లుమన్నాయి.

ఆ ఆలోచన రావటంతో నా ఒంట్లోని రక్తం అంతా పాదాల్లోకి జారిపోతున్నట్లు అనిపించింది

దబదబ తలుపులు బాదాను ఈమారు.

'ఏమండీ ఏమండీ ' కేకలు వేశాను

లోపల కలుగుతున్న భయంవల్ల ఆవేశంగా వుంది వగురుస్తున్నాను.

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

'ఏమం

'అరుణా

చెవులు రిక్కించుకున్నాను

'దయచేసి ఓ గంటసేపు నన్ను డిస్టర్బ్ చేయొద్దు నాకు చాల అలసటగా వుంది వి దపోవాలి'

కరుగ్గా వుంది ఆ కంఠస్వరం

చేసేదిలేక వెనక్కి వచ్చేశాను

పనిచేస్తున్నానన్నమాటేగానీ నా చూపులు ఆ గది తలుపులమీదే వున్నాయి నా మనసు ఆ గదిలోనే పరిభ్రమిస్తూంది

అలవాటు ప్రకారం కాళ్లూ చేతులూ తమ పనులు చేసుకుపోతున్నాయేగానీ మనసు మెదడూ ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతున్నాయి

సాయంత్రం అయిదుగంటలయినా ఆ గది తలుపులు తెరవబడలేదు పిల్లలు ఏదో అడిగితే కసిరాను

విసిగిస్తే రెండు దెబ్బలు వేశాను

నాకున్న చీకాకులో వాళ్ళ ఏడుపు భరించలేక మళ్ళీ నేనే దగ్గర తీసుకుని సముదాయించాను

వాళ్ళ చేతుల్లో తినటానికి ఏదో పెట్టి ఆటలకు పంపేశాను మూసిన ఆ తలుపులకి ఎదురుగ్గా వంటింటి గుమ్మం ఆనుకుని చేరగిలబడ్డాను

నా ఆలోచనలు ఎక్కడ మొదలవుతున్నాయో ఎటు సాగిపోతున్నాయో నాకే తెలియటంలేదు

ఆ ఆలోచనలకి ఒక మొదలంటూ లేదు

వాటికి ఒకదారంటూ లేదు

ఒక గమ్యం కూడా లేదు

ఆ మూసిన తలుపులకు అవతల అలసటతో, బాధతో వేదనతో పడుకుని వున్న ఆ రూపం వూహిస్తున్నాయి నా కళ్ళు

దిగులుతో కృంగిపోతున్న ఆ హృదయంలోని ఆవేదనను, ఆందోళనను అర్థంచేసుకోవాలని ప్రయత్నిస్తోంది నా మనసు

ఎటొచ్చీ ఈ శరీరం మాత్రం ఆ తలుపులు దాటి అయన్ని చేరలేక పోతోంది

అలసిన మనసు, శరీరం నాకు కునుకుపట్టేలా చేశాయి అనుకుంటాను

'అరుణా!'

తలుపులు దాటి దూసుకుని వచ్చింది పిలుపు



స్ప్రింగ్‌లా లేచి నిలబడ్డాను.

పరుగుపెట్టాననే అనుకుంటాను

పిలుపు వచ్చినంత వేగంగా నేనూ తలుపులు చేరుకున్నాను.

గడియ ఎప్పుడు తీశారో గానీ చేయి ఆనగానే తలుపులు తెరచుకున్నాయి మంచం మీద అటుతిరిగి పడుకుని వున్నారు

నెమ్మదిగా వెళ్ళి పక్కనే కూర్చున్నాను.

ఆయన నడుంచుట్టుగా చేయి అటుపక్కకేశాను

క్షణంసేపు నా చేతివ్రేళ్ళు ఆయన చేతిలో బిగుసుకున్నాయి. మరు క్షణంలో చప్పున యిటు తిరిగి నా ఒడిలో ముఖం దాచుకున్నారు

ఏదేదో అడగాలని వున్నా నా మనసును అదుపులో పెట్టుకున్నాను

ఏం చెప్పదలుచుకున్నారో తన నోటిగుండానే రానీ

నా చేతులు ఆయన తలను నిమురుతున్నాయి.

ఆయనలో ఆ బేలతనం చూస్తుంటే నా కళ్ళు తడుస్తున్నాయి ఎంతసేపో అలాగే ఒడిలో వుండిపోయారు.

'ఓ మాట అడగనా అరుణా' ముఖం పైకెత్తకుండానే అన్నారు నాకెందుకో చిన్నగా నవ్వు వచ్చింది

ఆయన్ని ఏదో అడగాలని యింతసేపూ తాపత్రయపడింది నేను ఏదో జవాబులు చెప్పించుకోవాలని ఎదురుచూసింది నేను. కాని యిప్పుడు..

'అడగండి.'

'నా ఉద్యోగం పోతే ఏంచేయాలి అరుణా?'

దీనికి జవాబు నా దగ్గర వుందా?

ఏంచేయాలని చెప్పను?

ఉద్యోగం వుండి సంపాయిస్తూంటేనే అంతంత మాత్రంగా యీడుస్తున్న యీ సంసారం, అది కాస్తా పోతే ..

వెనకేం ఆస్థి వుంది గనకనా ఫరవాలేదని చెప్పడానికి.

'నేను చేస్తాను ఏదయినా వుద్యోగం' అనడానికి నాకు చదువేది?

వంట వండటం తప్ప మరే పనీ రాని నేను ఎలా ఆదుకుంటానని చెప్పను?

ఆయనకి తెలియదా?

ఏమిటీ పిచ్చి ప్రశ్న?

'మీరు ఆఫీసరుగారితో మాట్లాడారా? ఏమన్నారు?'

నిన్నటి నుండి నేను మధనపడుతున్న జవాబుకోసం చెవులు రిక్కించాను.

ఆయన పెదవులు కదలబోతున్నాయి

జవాబు రాబోతుంది.

'ఏమై వుంటుంది? ఏమై వుండొచ్చు.' నాలో ఆపుకోలేని ఆత్రుత.

'మాట్లాడాను.'

'ఏమని?'

'నీవు చెప్పినది చెప్పినట్లుగానే.'

'ఏమన్నాడు?' నాలో కంగారు.

తదేకంగా రెప్పలార్పకుండా కొన్ని క్షణాలపాటు నా ముఖంలోకి చూశారు.

'ఉద్యోగం ఊడక తప్పదు అరుణా.'

'ఆ మరి అన్ని విషయాలూ ఆయనతో చెప్పుతున్నానని, సానుభూతితో విన్నారని అన్నారు. ఆయన మనింటికి కూడా .. '

'నిజమే అరుణా కాని పరిస్థితులు అనుకూలంగా లేవు.'

'వెళ్ళబోసుకున్న గోడంతా వ్యర్థమే నన్నమాట. మీరేం అన్నారు.'

నాకు దుఃఖం పొంగుకొస్తోంది గుండెల్లోంచి ఏ క్షణాన అయినా బయటికి దుంకుతుందన్నట్లు కంఠంలో సుళ్ళు తిరుగుతోంది.

'వుద్యోగం పోకుండా, నేను జైలుపాలు కాకుండా వుండాలంటే....'

'చెప్పండీ ... చెప్పండి. వుండాలంటే ..' కళ్ళనీళ్ళు టపటపా రాల్చేసు కుని ఆతురతతో అడిగాను.

'ఒకే ఒక మార్గం వుంది అరుణా' బరువుగా వుంది ఆయన మాట.

'నిజం? మరి యింకా ఆలోచన ఎందుకూ. ఒక్క మార్గమయినా వుంది కదా.' ఆనందంతో అడిగాను.

'నిజమే. కాని ... ఆ ఒక్క మార్గం మన జీవితాలని మార్చేస్తుంది అరుణా ఒడ్డు ఎక్కుతాం కానీ.... సర్వస్వం పోగొట్టుకుంటాం.'

'మీ మాటలు నాకు అర్థంకావటం లేదు. సర్వస్వం పోగొట్టుకోటం ఏమిటి? ఒడ్డు చేరటం ఎమిటి?'

'అర్థంఅయ్యేలా చెప్పలేకపోతున్నాను. అన్నిటికీ నేను సిద్ధంగా నే వున్నాను యిక నీ అంగీకారమే....'

'నాదేముంది? అయినా నాకేం తెలుసని? మీరు ఎట్లా చెబితే అట్లా చేయ గలనే గాని....'

'చెప్పినంత సులభం కాదు అరుణా చేయటం. కాని తప్పదు. ఈ వుద్యోగం వూడిపోకుండా వుండాలంటే... నేను జైలుకు వెళ్ళకుండా వుండాలంటే వున్న మార్గం ఒకటే నీవు నా గురించి ఎలా వూహించినా సరే '

'ఏమిటండీ అసలు విషయం చెప్పకుండా చంపుతున్నారు మీరేం చెప్పినా చేయడానికి సిద్ధంగానే వున్నాను కదా.' బాధగా అన్నాను.

'నా జీవితం, పరువు, ప్రతిష్ట, మన పసివాళ్ళ భవిష్యత్తు అన్నీ నీ చేతుల్లోనే వున్నాయి '

ఆశ్చర్యంగా చూశాను నేను.

'అవును అరుణా. ముసుగులో గ్రుద్దులాట ఎందుకు. చెప్పేస్తాను నీవు.... నీవు .. మా ఆఫీసరుతో ... ఒక్కరాత్రి.... గడపాలి.'

'ఛీ'

గ్రాచులో లేచాను.

ఆయనేనా మాటాడింది....

కోపమో, బాధో ... ఆవేశమో నా ఒళ్ళంతా ఒణికిపోసాగింది.

నా గుండెల్లో మంట.

కళ్ళలో నీళ్ళు.

కోపంతో పెదవి కొరుక్కున్నాను. రక్తం చిందింది.

ఒక భర్త.... తన సర్వస్వాన్ని, తన శీలాన్ని, తన రక్షణను అన్నీ తన చేతుల్లో పెట్టిన భార్యతో మాట్లాడాల్సిన మాటలేనా?

'మీకు యిలా మాట్లాడటానికి నోరెలా వస్తోంది? మీ మగతనం ఆ మాట ఎలా అనగలిగింది? ఛీ....ఛీ....

అసహ్యించుకున్నాను ఆయన్ని మొదటిసారిగా.

'నాకు తెలుసు అరుణా యింతగా అసహ్యించుకుంటావని. ఇది ఏ భర్తా తన భార్యని గురించి చేయకూడని ఆలోచన గంటల తరబడి తల బ్రద్దలు కొట్టుకున్నాను సమాధాన పడలేక. ఆ ఆఫీసరుకు ఆడవాళ్ళ విషయంలో బలహీనత వుందని, అది వుపయోగించుకుంటే పని సానుకూలం కావచ్చునని తెలిసింది. ఆయనంతట ఆయన మన యింటికి వస్తానని అన్నప్పుడే నేను యీ పరిస్థితి వూహించాను....'

'వూహించి వుంటే ఎందుకని తీసుకొచ్చారు' విసురుగా అన్నాను

'సావధానంగా ఆలోచించు అరుణా. మన యిబ్బందులు ఆయనకు చెప్పుకున్నాను. 'ఒకసారి మీ యింటికి వచ్చి చూడాలి' అన్నాడు. ఆయన చూడాలనుకున్నది నిన్ను. వూహించాను కానీ నా అభిప్రాయం సరైంది అని నాకు తెలియదు అప్పుడు. తెలిసినా చేయగలిగింది లేదు. ఆయన రాకుండా వుండివుంటే పోలీసులే వచ్చేవారు నా కోసం. నీవు బాగా నచ్చావు ఆయనకి. ఈ విషయంలో నేను ఎంతగా రంపపుకోతకు గురి అవుతున్నానో నీకు తెలియదు అరుణా. నేను నికృష్టున్ని, దౌర్భాగ్యున్ని. నిజమే కాని.... కానీ.... అరుణా! మనకున్న యీ ఒక్క ఆధారం పోయిందంటే మనందరం కుక్క చావు చస్తాం'

'అదే సమయం యిలా నీతిమాలి బ్రతకటం కన్నా' ఆవేశంగా అన్నాను

'ఆవేశపడకు అరుణా! మనలను ఆదుకుందుకు ఎవరూ లేరు. నీకు వుద్యోగం కాదుకదా కనీసం ట్యూషన్లు చెప్పగల చదువు కూడా లేదు. నేను జైలుకి వెళ్ళి కూచుంటే నీ గతేమిటి. మనం యీ లోకంలోకి తీసుకవచ్చిన యీ పసివాళ్ళ బ్రతుకేమిటి? నేను జైలునుండి తిరిగి వచ్చినా నాకు యిక వుద్యోగం దొరకటం కష్టం. ఇవన్నీ ఆలోచించే నేను యీ నిర్ణయానికి వచ్చాను. వచ్చిన ఆపద తప్పుకోగల వుపాయం చూడాలి గానీ యింకా యింకా ఆపదలను కొనితెచ్చుకోటం అవివేకమే. నీ కంత బాధ వుంటే నాకెట్లా వుంటుందో ఆలోచించి చూడు అయనా ఎందుకు తల వొగ్గుతున్నాను? మీ

కోసం  మీ కోసమే కాదా. ఇది ఎంత ఏహ్యమయినదో నాకు తెలుసు. అయినా మనకున్న అవకాశం యిదొక్కటే. దాన్ని మనం వుపయోగించుకోలేక పోతే .'

నా కళ్ళముందు చీకటి.

ఆ చీకట్లో... ఆయన వివరిస్తున్న పరిస్థితులు రూపుదాల్చుకుని వికటాట్టహాసం చేస్తున్నాయి.

'చింకి బట్టలు... చింపిరి తలలు

'అమ్మా .. ఆకలే. ఆకలేస్తోందమ్మా '

'ఏదయినా తినడానికిస్తావా... భిక్ష మెత్తుకోమంటావా... '

'బాబూ, అమ్మా  మూడురోజుల నుంచీ అన్నం లేదు. కొంచెం అన్న ముంజే '

'అయ్యా .. బాబూ  ఒక్క పైసా ధర్మం చేయండి . ఆకలేస్తోంది. ..' గుండెలు చీల్చుతున్న ఆక్రందనలు.

పాలు లేక... అడగటానికి యింకా నోరురాని పసివాడు కళ్ళు తేల వేసేస్తున్నాడు

'ఒక్కసారికి రా ' ఎవడో కోన్‌కిస్కాగాడి చేతిలో పదిరూపాయల నోటు

'ఛీ. ఛీ . ఎంత దౌర్భాగ్యం బ్రతుకు.... నా రక్తం పంచుకుని.... నా ప్రేవులు తెంచుకుని పుట్టిన యీ పసివాళ్ళు నా అసహాయతకు. నా కళ్ళ ముందే చచ్చిపోతే  భగవాన్ .... భరించగలనా.

పోనీ నేనే ఏదయినా తిని చచ్చిపోతే

అప్పుడు మాత్రం యీ పిల్లలు. .

'అయ్యో  నా భర్త.... జైలుపాలయి...

ఈ గడ్డుపరిస్థితిలోంచి బయటపడటానికి యీ ఒక్కసారికి.

ఆయన చెప్పినట్లు చేస్తే...

అసహ్యంతో నా ఒళ్ళు గగుర్పొడిచింది.

నా జీవితం కారుచీకటిని కౌగలించుకోబోతున్నట్లు

నా గుండెలు నిప్పుల గుండంలో పడబోతున్నట్లు . నా బ్రతుకు అంధకారం లోకి పయనిస్తేనే నా కుటుంబానికి వెలుగు రేఖలు

నా మనసు మాడి మసి అయితేనే నా సంసారానికి వసంతం వస్తుంది.

ఓహ్! ఎంత విచిత్ర జీవితం.

'ఏమాలోచించావు అరుణా' ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లు వులిక్కిపడ్డాను.

విశితంగా ఆయన కళ్ళలోకి చూశాను.

ఇంతసేపు నా గుండెల్లో రగిలి, పగిలి అవిరవుతున్న ఆవేదనంతా నా కళ్ళ గుండా జలరూపం ధరించి వెల్లువలా పొంగుతోంది.

ఆయన అలాగే చూస్తున్నారు నా ముఖంలోకి.

నేను కన్నీళ్ళు కారుస్తూనే వున్నాను.

ఎంతసేపయిందో.... నా పెదవులు కదిలాయి.

'నేను ఒప్పుకుంటున్నాను.'

మరువటి రోజు.

'మేమందరం సినిమాకు వెడుతున్నాం.'

మామూలుగా పక్కలు విదిలించి పరుస్తున్న నేను ఆశ్చర్యంగా చూశాను.

'అవును' అన్నట్టు తలవూపారు.

పెద్దపిల్లలు ముగ్గురూ ఆయనచుట్టూ అనుకుని వించుని వున్నారు.

గడియారం కేసి చూశాను. ఎనిమిదిన్నర అయింది.

'యిప్పుడేం సినిమా?'

'సెకండ్ షోకి'

'పిల్లలు విద్రపోరూ? అయినా సెకండ్‌షోకి ఎందుకని ...'

మెరుపులా జ్ఞాపకం వచ్చింది.

ఆ జ్ఞాపకంతో నా వెన్ను భయంతో జవజవ లాడింది.

బేలగా చూశాను అయన కేసి

నేను వద్దనేస్తానేమో, సినిమా ప్రోగ్రాం క్యాన్సిల్ అవుతుందేమో నన్నట్లు పిల్లలు నా కేసి భయంగా చూస్తున్నారు.

వాళ్ల కళ్లలో రాబోతున్న నిద్ర తాలుకు మత్తుని, చూడబోయే సినిమా గురించి కుతూహలం బలవంతంగా వెనక్కి నెడుతోంది.

'వెళ్ళొస్తాం అరుణా'

బయలుదేరారు

నా నోట్లో మాట రాలేదు బొమ్మలా విలబడి వున్నాను.

ఆయనతో ఏదో చెప్పాలని, యీ చర్యను ప్రతిఘటించాలని... ఏదేదో ఏమీ అనలేని బలహీనురాలి నయ్యాను.

గుమ్మం దాటిపోతున్న వాళ్ళని చూస్తుంటే అందరూ కలసి నన్నొంటరిదాన్ని చేసి ఏదో గోతిలో తోసేసి పోతున్నట్టుగా దుఃఖం ముందుకొచ్చింది. అడుగు వీధిలోకి వేసి ఒకసారి వెనక్కి తిరిగి చూశారు ఆయన

ఆ చూపులో ఆవేదనో... అర్థింపో...

'నేనూ వచ్చేస్తాను'

పెదవులు దాటి రాబోయిన మాటలు ఆయన చప్పున వెనక్కి తిరిగి వెళ్ళడంతో లోపలే అణిగిపోయాయి.

వాళ్లు కనబడే వరకూ చూశాను.

తలుపులు మూసి లోపలికి వస్తూంటే పాదాల్లో సన్నని వణుకు

ఎంత వుదాసీనంగా వెళ్లిపోయారు.

దారిద్ర్యం ఆత్మవిశ్వాసాన్ని ఆత్మగౌరవాన్ని కూలదోస్తుంది గాబోలు.

'బాబు' ప్రక్కన పడుకున్నాను.

ఆ పసివాడు నిద్దట్లోనే నా మీద చెయ్యివేసి నవ్వుతున్నాడు

మరొకప్పుడయితే నిద్దర్లో నవ్వేవాడిలో అందచందాలను రెప్పార్పకుండా చూసేదాన్ని.

కాని . కాని... యిప్పుడు నా కళ్ళు ఎదురుగా వున్న మంచం కేసి చూస్తున్నాయి.

ఆ మంచం మీద

మా పరుపు పరిచి వుంది. ఆ పరుపు మా పెళ్ళికి కుట్టించింది. పెద్ద పరుపు. దాని మీద తెల్ల దుప్పటి ..

శుభ్రంగా అప్పుడే తొడిగిన గలేబులతో రెండు దిళ్ళు

పడక చూస్తుంటే ఎవరికయినా యిట్టే పడుకోవాలనిపించేలా వుంది. కాని దాని మీద కొద్దిపేపట్లో నేను అనుభవించబోయే నరకం భర్త కోసం యీ పిల్లలకోసం. యీ సంసారం కోసం యీ పాడు పనికి పూనుకున్న నేను రేపు వుదయం లేవగానే వాళ్ళ ముఖాల్లోకి నిర్మలంగా చూడగలనా?

వాళ్ళు పెరిగి బుద్ధి తెలిశాక తమ తల్లి నీచత్వంతో తాము గట్టెక్కానామని తెలుసుకుంటే తనని చీదరించుకుంటే.

తనేం చేస్తుంది? తనదేం అపరాధం వుంది.

భర్త ఆజ్ఞ లేక అర్థింపు తాను శిరసావహించింది అంతే

అంతేనా

భర్త చెయ్యమంటే మాత్రం ఎంత నీచానికయినా దిగజారిపోవటమేనా? ముఖాభిమానాలకు సంబంధించినంత వరకయినా వ్యక్తిత్వానికి విలువలేదు? విలువలేదా

లేదా...

నా తల ఆలోచనలతో, పరస్పర విరుద్ధభావాలతో పగిలిపోతుందేమో ననిపించింది

నేను యిటువంటి పరిస్థితిలో కొట్టుమిట్టాడుతుంటే ఆయన హాయిగా సినిమాకి

హాయిగా నేనా

ఎంతటి వ్యధకి గురిఅవుతున్నారో ఎంత రంపపుకోత భరిస్తున్నారో ఆ మనసు యింతటి వ్యధని భరించలేక యే క్షణాన అయినా తిరిగి వచ్చేస్తారేమో? యీ పాడుపని వద్దని చెప్పేస్తారేమో .

నిజంగా వచ్చేస్తారా?

అలా జరిగితే ఎంత బావుండును

తలపులు సాగుతూండగానే తలుపులు చప్పుడయ్యాయి.

ఒక్క వుదుటున లేచి నిలబడ్డాను.

ఆయన సినిమానుండి నేను కోరుకుంటున్నట్టుగా తిరిగి వచ్చేసివుంటారా? రెండడుగులు వేశాను.

మళ్ళీ తలుపు చప్పుడు.

యీసారి నా గుండెలమీద రైళ్ళు పరుగెడుతున్నట్లు అనిపించింది వచ్చింది ...వచ్చింది ఆయన కాదు సందేహం లేదు. ఆయనే అయితే 'అరుణా' అని పిలవకుండా తలుపు తట్టరు.

మరి

ఆ వచ్చింది ఆ తలుపు తడుతున్నది

అడుగులు యిక ముందుకు సాగలేదు. నేలకి అంటుకుపోయినట్టు కదలలేదు.

నా కళ్ళముందు చీకటి ముసురుకుంటున్నట్టుగా తలుపు మీది శబ్దం

నా సర్వేంద్రియాలు కూడదీసుకున్నాను.

పాదాలకు బండలు కట్టినట్టు బరువుగా అడుగులో అడుగు.

గడియ తీయబోయిన నా చేతులు వణికాయి.

వణుకుతూనే వాటి కర్తవ్యం నిర్వర్తించాయి.

తలుపులు తెరిచాను 'అవినీతికి'.

ఆ క్షణానే నీతి, నిజాయతీ నిండుకునివున్న నిర్మలమయిన నా హృదయ కవాటాలు బిగించాను.

వెకిలిగా నవ్వుతూ తలుపులు మూస్తున్న ఆ 'పెద్దమనిషి'ని చూసి ఒళ్ళంతా కంపరం పుట్టింది.

నా భుజంమీద చెయ్యి పడింది

ఓ పామో, తేలో నా భుజంమీద పడినట్టు శరీరం జలదరించింది. భయంతో వణికింది.

తల వంచుకున్నాను.

"హౌ బ్యూటిపుల్ యు ఆర్"

ముఖంమీదికి వంగబోగా తప్పుకున్నాను

ఈ పరిస్థితి వూహించిందానికన్నా అసహ్యకరంగా వుంది

ఈ క్షణం కనబడకుండా యిలా మాయమయిపోతే అసంభవం సంభవం కావాలనే తపన.

'నేనన్నది నీకు అర్థం అయిందా? ఇంగ్లీషు తెలుసా?'

తల అడ్డంగా వూపాను.

'నీ వెంత అందంగా వున్నావో తెలుసా' నా భుజాలు రెండూ పట్టుకుని ముఖంలోకి చూస్తూ అన్నాడు.

యీ మాట నేను పుట్టి బుద్ధెరిగాక ఎన్ని వందలసార్లో విన్నాను. మావాళ్ళు అందరూ ఈ మాటే.

వయసు వచ్చేకొద్దీ నన్ను చూసిన ప్రతి ఒక్కరూ అన్నమాటే. అప్పుడంతా గర్వపడ్డాను. నా అందం చూసి నేనే మురిసిపోయాను. పెళ్ళిలో అంతమా ఆయన్ని మించిన అందం నాదని పొగుడుతూంటే పొంగిపోయాను.

నా భర్త నా అందాన్ని వర్ణిస్తూ, ఆస్వాదిస్తూంటే ఎనలేని తృప్తిని పొందాను.

అలాంటిది యిప్పుడు . యీ క్షణం.

అదే మాటలకు నేను అసహ్యించుకుంటున్నాను.

నన్ను . . నన్ను . . నేనే అసహ్యించుకుంటున్నాను.

బురదలో దిగాలి. తప్పదు.

అసహ్యించుకుని లాభంలేదు.

మరో మార్గం లేదు

గదిలోకి ఎట్లా వచ్చానో నాకే తెలియదు.

నిజం చెప్పాలంటే ఒక విధంగా అతను నన్ను మోసుకుని వచ్చాడు. మంచం మీద కూలేశాడు.

నా ఒళ్ళు నా స్వాధీనంలో లేదు

నే చేమవతున్నానో నాకు తెలియటంలేదు

[illegible] మెదులుతూందో, అసలది ఏమైనా ఆలోచించే స్థితిలో వుందో లేదో తెలియలేదు.

'సిగ్గా '

నా గుండె ఝల్లుమంది అతనన్న ఆ మాటకు కాదు. నా భర్తతో నన్ను కలిపి తొలిరోజున మొదటిసారిగా ఆయన నాతో పలికిన మాట.

ఆ మాట విన్న క్షణాన పెరిగిన సిగ్గు, కలిగిన బిడియం, పొందిన పరవశం గుర్తువచ్చింది

'నలుగురు పిల్లల తల్లివి. ఇంకా సిగ్గుపోలేదా ?'

నాకు నవ్వొచ్చింది. కాదు కాదు. నన్ను నేను పొడుచుకు చచ్చిపోవాలన్నంత కోపం. అవమానం.

నలుగురు పిల్లల తల్లివి నాకు సిగ్గేమిటి.

బ్రతుకుతెరువు కోసం పరాయివాడి చేతుల్లో నలగబోయే నాలో యింకా సిగ్గు, అభిమానం మిగిలి వున్నాయా?

'తలెత్తి చూడు.'

.... .... ....

'నీకు ఇష్టం లేకపోతే నాకు అక్కరలేదు. అంతేగాని యిట్లా టైం వృథా చేయటం నాకు నచ్చదు.'

నా మౌనం, స్తబ్దత ఆ మనిషిలోని ఆరాటాన్ని కోపంగా మారుస్తోంది.

'నా ప్రాణంతీసినా యిలాంటి పని యిష్టంగా చేయను' మనసులోనే గొణుక్కున్నాను.

సినిమాకి వెడుతూ ఆయన చూసిన చూపు, ఆ చూపుల్లోని దైన్యం, అర్థింపు, బాధ అన్నీ గుర్తువచ్చాయి.

నా నడుంచుట్టూ బిగుసుకుంటున్న ఆ చేతినుండి కొద్దిగా జరుగుతూ తలెత్తి చూశాను.

ఆ వేళ 'యీయనే మా ఆఫీసరు' అని పరిచయం చేసినప్పుడు కనబడ్డంత దర్పంగా లేడు.

ఆకలి కోసం మొహంవాచిన వాడిలాగా ..

యీ క్షణం కాదంటే ప్రాణం పోయేవాడిలాగా

దేబిరింపు మొహంతో వున్నాడు.

వీడికి త్వరగా పెళ్ళి చేసివుంటే నా అంత కూతురు తప్పకుండా వుండే వుంటుంది నా ఆలోచనలు పుటుక్కున తెగిపోయాయి.

ఇంక నా అంగీకారంకోసం ఎదురు చూడనక్కరలే దనుకున్నట్టుంది

ఎటూ తప్పించుకుపోలేక దొరికిపోయిన లేడిమీద సింహంలా వురికాడు. రతిలో రాక్షసత్వాన్ని ఆనాడే తెలుసుకున్నాను.

తను చేయబోయే వుపకారానికి తగిన ప్రతిఫలం సంపూర్తిగా పొంది తీరాలనేంత కసి అతడిలో కనిపించింది.

వాడి చేతుల్లో నలుగుతున్నా నా చూపులు కాస్త ఎడంగా అవతలి మంచం మీద నిద్రపోతున్న పసివాడినే అంటిపెట్టుకుని వున్నాయి.

కిటికీలోంచి వెన్నెల ఆ పసివాడి ముఖంమీద పడుతోంది.

ఆ వెన్నెల వెలుగులో నవ్వుతున్నాడు.

ఆ నవ్వులోనే మధ్య మధ్య పాలకోసం పెదవులు చప్పరిస్తున్నాడు.

ఆ లేత పెదవులకు అందివ్వవలసిన నా ...

యీ కర్కశుడి చేతుల్లో నలిగి....

నా గుండెల్లో మంట.

ఆ భగవంతుడిని నా యిష్టం వచ్చినట్టు తిట్టుకున్నాను.

ఆ పసివాడు యీ క్షణాన లేస్తే ..

యీ తల్లిని యిలా చూస్తే . . .

వాళ్ళ నాన్ననే వాడు చెయ్యి వేయనీడు నా మీద

'అమ్మ' వాడికి మాత్రమే స్వంతం

ఇప్పుడు యిలా ఎవరో తెలియని వాడి చేతిలో 'అమ్మ'ను చూస్తే

ఏడవలేక నవ్వు వస్తోంది.

వచ్చిన పని అయిపోయింది.

దాహం తీర్చుకుని తృప్తిగా మంచం దిగాడు.

వాడిని చూడాలని లేదు. నేను కళ్ళు తెరవలేదు.

ఆ క్షణాన కుక్క చింపిన విస్తరిలా వున్నాను నేను.

చప్పున నా పెదవులమీద గాటు

ఇంకా తృప్తి తీరినట్టులేదు పాపం. లేకపోతే కొసరు కాబోలు. నా పెదవుల మీద తడి వుప్పగా వుంది.

పైటకొంగుతో అద్దుకోవాలని చూశాను. చీర మంచంకింద వెక్కిరిస్తున్నట్టు వుంది.

వేళ్ళతో అద్ది చూశాను. ఆ తడి ఎర్రగా వుంది.

చిందుతున్న రక్తపు బిందువులతో దాహం తీర్చుకోవాలనుకుంటున్న పిపాసి. వాడు పిపాసి కాదు పిశాచి.

'హౌ స్వీట్ యు అర్ మై డియర్. విష్ టు మీట్ ఎగైన్ '

అ పిశాచి వ్రేళ్ళు చివరిసారిగా నా ఒంటిమీద తలనుండి పాదందాకా ఒక్కసారి నాట్యం చేశాయి.

నాలో స్పందన లేదు.

ఆ క్షణాన నేను శిలని.

ప్రాణం వున్నా శవంలాంటిదాన్నే.

రాక్షసుడు వున్నట్లుండి గంధర్వ రూపంలోకి మారినట్టు అప్పటిదాకా నీచాతి నీచంగా కేమకాశి జరిపిన మానవపిశాచి స్టాండుమీదున్న సూట్లు బూట్లు ధరించి 'పెద్దమనిషి' అనిపించే ఆఫీసరు రూపంలోకి దిగిపోయింది.

వీధి తలుపువరకూ సాగనంపవలసి వచ్చింది.

నా శక్తినంతటినీ కూడగట్టుకుని లేచాను. మంచం దగ్గరగా కుప్పగా పడి వున్న చీరను ఒంటికి చుట్టుకున్నాను.

నా నడుంచుట్టూ చెయ్యివేసి అడుగులు వేశాడు.

శవంలాగా నడిచాను.

వాడి ఒంట్లో వేడిని చల్లార్చి నా గుండెలో మంటలు రేపుతున్నాను.

నా గుండెల్లో రేగుతున్న జ్వాలలు బయటికే వస్తే వాడు మాడి మసి అయిపోతాడు.

కాని . ఇప్పుడవి లోలోపలే నన్నే నన్నే దహిస్తాయి.

తలుపు గడియ తీశాను.

'థాంక్ యూ డార్లింగ్. వుయ్ షల్ మీట్ ఏగైన్'

అంటూ నా బుగ్గలమీద చిటికెలు వేశాడు. తలుపులు తెరిచాడు. ఆవినీతి మెట్లు దిగిందిగదాయని వెంటనే తలుపులు మూశాను. మరుక్షణం నాకు తెలియకుండానే విరగబడి నవ్వాను.

అతనితో కూడా వెళ్ళిపోయిందా అవినీతి? లేదు ..లేదు.....వెళ్ళలేదు యింట్లో ప్రవేశించింది. నేనే తలుపులు తీశాను. లోపలికి పిలిచాను. ఇప్పుడది గాలిలా, ధూళిలా నా గుండెలో, నా శరీరంలో నా రక్తంలో కలిసి పోయింది.

యిక దాన్ని వేరుచేసి బయటికి పంపివేయటం అసాధ్యం

సర్వస్వం కోల్పోయినదానిలా కూలబడిపోయాను బాబు ప్రక్కన. నా కళ్ళల్లోంచి నీరు ధారగా కారిపోతున్నాయి. వాటిని ఆపాలని ప్రయత్నించలేదు.

ఎన్ని కన్నీళ్ళయితే మాత్రం యిక యీ కల్మషాన్ని కడగగలవా. నా గుండె మంటలను ఆర్పగలవా?

'అమ్మా అమ్మా ' బయట పిల్లల కేకలు తలుపు తడుతున్న చప్పుడు

నా చెవులు రిక్కించుకు విన్నాను.

శక్తిని కూడదీసుకుని అడుగులు వేశాను

అవినీతిని ఆహ్వానించటానికి నీతి ఎంత కష్టపడిందో, నీతికీ, స్వచ్ఛతకు తలుపులు తెరవటానికి అవినీతి అంతే ఆలశ్యం చేసింది

కంపిస్తున్న చేతులతో గడియ తీశాను.

బిలబిలమంటూ లోపలికి వురికారు పిల్లలు.

గడపవతల ఆయన.

గడప కివతల నేను.

వణుకుతున్న పెదవులతో ఏ క్షణాన అయినా వెల్లువలా పొంగేస్తుందనేట్లు కంఠంలో సుళ్లు తిరుగుతున్న దుఃఖంతో ఒకసారి ఆయన కళ్ళలోకి చూశాను.

ఆ క్షణాన నా భర్త గుచ్చి గుచ్చి చూసిన ఆ చూపులకి ఆ నేలను చీల్చుకుని భూమిలోకి నేను అలాగే క్రుంగిపోతే బావుండుననిపించింది.

కళ్లు వాల్చుకున్నాను. రెప్పల అంచున వున్న కన్నీటి బిందువులు మా యిద్దరి మధ్య పడ్డాయి.

ఏమని మాట్లాడాలో నాకు తెలియలేదు.

ఏమీ జరగనిదానిలా మామూలుగా 'సినిమా బావుందా' అని అడగటానికి నాకు అవమానం, సిగ్గు, అసహ్యం కలిగాయి.

ఆయనయినా పలుకరించలేదు.

నన్ను దాటుకుని లోపలికి వెళ్ళారు.

ఆయన మౌనం నా గుండెలని చీలుస్తోంది.

పక్కమీదికి చేరుకున్న పిల్లలకు మంచినీళ్లు త్రాగించాను.

సినిమా చూసివస్తే గడగడమని వాగే పిల్లలు, కథ, మాటలు, హాస్యాలు వాళ్ళకు అర్థమయినంతవరకు పదేపదే చెప్పుకునే పిల్లలు అలవాటులేని సెకండ్ షో మూలాన పక్కల మీద చేరగానే నిద్రలోకి జారిపోయారు. ఆయనకి నీళ్ళు యివ్వడానికిగానీ 'త్రాగుతారా' అని అడగటానికి కానీ భయపడ్డాను. నాలో జంకు.

పైగా మాట మాత్రం పలుకరింపులేకుండా పక్కమీదకి చేరి ముఖమయినా కనబడకుండా అవతలికి తిరిగి పడుకున్న వైఖరి నాకు అధైర్యం కలిగించాయి.

పిల్లల మధ్య చోటుచేసుకుని పడుకున్నాను.

నాకు ఆ క్షణాన భోరున ఏడవాలని వుంది.

నన్ను ఓదార్చి, దగ్గరకు తీసుకుని, లాలించి తన గుండెలో పొదువుకోగల అమృతహస్తం కావాలని వుంది.

కాలుతున్న నా గుండెలమీద అమృతపు జల్లులు కురవాలని వుంది.

కాని... కాని....నిశ్శబ్దం మధ్య జారిపోతున్న యీ కన్నీళ్ళు నా ఆవేదనను రూపుమాపగలవా. నన్ను స్వాంతన పరుస్తాయా?




ఆయకు నిద్రపట్టలేదని అశాంతితో బాధపడుతున్నారని. ఆయన కదలికల వల్ల అర్థమయింది

నాకుతెలుసు ఆ సమయంలో ఆ మగవాడి గుండెలు ఎంతగా కాలి పోతున్నాయో ఆ జ్వాలల్లో అతనిలోని మనసు, మమత ఎంత విలవిలలాడి పోతున్నాయో ఆయన పక్కలోకి వెళ్లి పడుకోవాలని, అశాంతితో అలమటించే ఆయన్ని నా కౌగిలో పొదువుకుని లాలించాలనిఅనిపించింది.

శాంతి నాకుంచేగదా అతని అశాంతిని పారద్రోలటానికి

లేచి ఆ పక్కమీదకు వెళ్లాలనుకున్నాను. ధైర్యంచాలలేదు.

నాలోనేను కుమిలిపోతూ ఎంతసేపో అలమటించాను.

ఆ ఆవేదనలో . ఆ అలసటలో.... ఆ మగతలో ఎంతకాలం గడిచిందో.

వులిక్కిపడ్డాను.

నన్ను అనుకుని.. నా వెనకకా.... నా నడుంమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకుని ...

చప్పున తిరిగి ఆయన గుండెల్లో తలదాచుతున్నాను.

అప్పటిదాకా సుళ్లుతిరుగుతున్న దుఃఖం వెల్లువలా పొంగింది. పొంగి పొంగి ప్రవహించింది.

యీ ప్రవాహం ఆయనలో రగుతున్నిజ్వాలని ఆర్పలేదని నాకుతెలుసు. తన

ఓదార్పుకూడా దహించుకుపోతున్న నా మనసునీ, శరీరాన్నీ చల్లబరచలేదని ఆయనకి తెలుసు.

కాని ... కాని....

మా యిద్దరిలోనూ రగిలి మండిన జ్వాలలు ఆ ఆఫీసరుని మాత్రం చల్లబరచ గలిగాయి.

ఆపద తప్పిందని తెలిసింది.

'గడ్డురోజు గడిచిపోయింది' అనుకున్నాను.

కాని మొదలయింది అప్పుడేనని ఆరోజు తెలియలేదు.

ఆ పీడకలని అంతటితో మరిచిపోడానికి ప్రయత్నించాను

మా సంసారం ఒక రంకంగా మళ్ళీ మామూలుగా జరుగుతోంది.

కొద్ది నెలల వ్యవధిలో వాడుకున్న ఆఫీసుడబ్బును కట్టేయ్యాలనే షరతుపై వుద్యోగం నిలిచింది.

ఆ డబ్బును సర్దటంకోసం అదనపు యిబ్బందులు ఎదురయ్యాయి.

అయినా యీసారి విసుక్కోటంలేదు నేను విసిగించటమూ మానేశాను. వున్నంతలో సర్దటం అలవాటు చేసుకున్నాను.

నా తపనంతా ఆ వ్యవధిలో ఆ డబ్బు కట్టేయటం జరిగిపోవాలని

అంత యిబ్బందులకు లోనైనా ఒకపూట పస్తు వుండినా అంత డబ్బును పర్దుతామనే ధైర్యం లేదు.

శ్రమకు తగినంత తిండిలేక, మనసుకు శాంతిలేక నా ఆరోగ్యం నలుగుతూ వచ్చింది.

ఆయనలోకూడా మానసిక వేదన చాలా మార్పుతెచ్చింది.

మా యిబ్బందులు తొలగిపోయి మునుపట్లా మేము కలకల లాడుతూ గడపగల రోజు వస్తుందా అనిపించేది.

ఒకనాడు సాయంత్రం ...

హడావుడిగా వచ్చేరు ఆయన.

అన్నం వారుస్తున్నాను వంటింట్లో.

నా వెనకాతలే నిలబడ్డారు.

తల వెనక్కితిప్పి ఆయకేసి నవ్వుతూ చూశాను.

"ఏమిటో విశేషం. యివ్వాళ పెందలాడే వచ్చేశారు." అన్నాను.

క్షణంసేపు నా కళ్ళలోకి చూశారు.



"నేనూ, పిల్లలూ యివాళ సినిమాకి వెడుతున్నాం."

"అదేం. నేనేంపాపం చేశాను. నాకూ చూడాలనివుంది." అన్నాను.

"లేదు అరుణా. మేము మాత్రమే వెళ్లాలనుకుంటున్నాం. నీవు ఇంట్లోనే వుండు." తలవాల్చుకుని అన్నారు.

"ఆదేం!" నా కంఠంలో ఆశ్చర్యం అనుమానం.

చప్పున నాచేతులు పట్టుకున్నారు

"అరుణా..... అరుణా.... నన్ను క్షమించు నీ ముందు తల బ్రద్దలు కొట్టుకోవాలని వుంది...."

"ఏమయింది? ఆతృతగా అన్నాను.

"ఆవేళ వచ్చిన ఆ ఆఫీసరు నా వుద్యోగం పూడకుండా వుండటానికి ప్రయత్నంచేశాడు. డబ్బు కట్టేయడానికి వ్యవధి యిచ్చాడు...."

"కడుతున్నాంగా."

"ఏం కడుతున్నాం అరుణా. నేను కట్టేడబ్బుతో ఆ మొత్తం పూడ్చాలంటే సంవత్సరాలు పడుతుంది. అందుకని.... అందుకని.... నేను...."

"ఏంచేశారు?"

"ఆ గడువులోగా డబ్బు కట్టేయాలనే తాపత్రయంతో, భయంతో, యిన్నాళ్లు అలవాటులేని పని మొదలుపెట్టాను. అవకాశం వున్నచోటల్లా అందినంతా రెండు చేతులా లంచాలు పట్టాను. ఇంట్లో ఇబ్బందులూ ఆఫీసులో పూడ్చవలసిన లోటు నన్ను పిచ్చివాణ్ణిచేశాయి. నామీద పై అధికారికి చాలా రిపోర్టులు వెళ్లాయి ఎంక్వయిరీకి యిన్‌స్పెక్టరొకతను వచ్చాడు. ఈసారి నాకు వుద్వాసన తప్పదు. అరుణా.... అరుణా.... వుద్యోగం నిలుపుకోడం కోసం ఆవేళ ఏంచేశామో ఇప్పుడు అదే. అదే. చేయాలి తప్పదు అరుణా గత్యంతరంలేదు అరుణా"

నా రెండుచేతులూ పట్టుకుని నా దోసిట్లో ముఖం దాచుకున్నారు.

చివాలున నా చేతులు విడిపించుకున్నాను.

తలెత్తి నా ముఖంలోకి చూస్తూ 'అరుణా.... అన్నారు.

యీ మారు ఆయన ముఖం చూస్తూంటే చెప్పలేని అసహ్యం వేసింది.

'ఛీ యీయన ఒక మనిషేనా. . మగవాడేనా మొగుడేనా... మెట్టు జారడం అనేది జరక్కుండా వుండాలేగాని కాలుజారక మెట్లవెంబడి అలా కిందికి జారిపోవాల్సిందే

"అయితే మీపై ఆఫీసర్లంతా యిలా ఆడవాళ్ళకోసం ఎగబడే వాళ్ళే నంటారా. వాళ్ళకోసం మీలాంటి 'వాళ్ళు యిలా భార్యల్ని సమర్పించుకుంటూ వుంటారా?" నా మాటల్లో ఎంతవ్యంగం ద్యోతకం కావాలో, ఎంత అసహ్యం కనిపించాలో అంతా చూపించాను.

"అలా అనకు అరుణా. అందరూ కాకపోయినా చాలావరకు యిలాగే వుంటారు. కాంతా, కనకాలు ఏ పనినయినా సాధిస్తాయంటారు. కొందరు కనకాన్ని ఆశిస్తారు కాసులరూపం పలకని కేసైయితే కాంతను కాంక్షిస్తారు. మనకు మొదటిది ఎలాగూ లేదు. యిక.... నా కళ్ళలోని తీవ్రతకి కాబోలు పూర్తిచేయలేక తలవాల్చుకున్నారు.

"చూడండి. కష్టాలు, కడగళ్లు అనేవి యీ జీవితాంతమూ వుంటూనే వుంటాయి. అందుకని ప్రతిసారీ యిలా దిగజారి పోవటానికి సిగ్గుగాలేదూ " ఎంతో కోపంగా, అసహ్యంగా-అనబోయినా-నా అసహాయత అభిమానం ఏడుపుని తెప్పించాయి.

'నిజమే అరుణా. సిగ్గుగానే వుంది. మామూలుగా కాదు. నీవు అంటూంటే చచ్చిపోవాలనిపించేంత అవమానంగా వుంది కూడా' విసురుగా వెళ్ళిపోయారు అక్కడినుండి.

'చచ్చిపోవాలని వుందనడం' నన్ను సాధించడానికి వుపయోగించే ఆయుధమా? నా మనసు నన్ను హెచ్చరించింది.

సాధించడానికి మాత్రమే వుపయోగించే ఆయుధం కాదు. సాదించలేకపోతే అలా జరగటం ఖాయం.

ఎవరుగానీ గట్టెక్కడానికి కనిపించే మార్గాలన్నీ మూసుకుపోతే చావే శరణ్యం అనుకోటంలో అసమర్ధత ఏముంది. నిజానికి అందుకు కూడా ఎంతో ధైర్యం కావాలి. ఆయన నిజంగా అలాంటిపనికి సాహసిస్తే...

నా గుండెలు గుబగుబ లాడాయి.

క్షణాల మీద నిశ్చయానికి వచ్చేశాను.

నిశ్చయానికి వచ్చేసిన మరుక్షణం అంత ఏడుపులోనూ నవ్వు వచ్చింది.

ఎంతటి కష్టమయిన పనిగానీ, అసహ్యం కలిగించే కార్యం గానీ మొదటిసారి భయం వేస్తుంది దిగులు కలుగుతుంది ప్రతిఘటించాలనీ అనిపిస్తుంది. కాని ఒకసారి చేసేసిన ఆ పనే మళ్ళీ మళ్ళీ చేయవలసి వస్తే అది అలవాటయిపోతుంది.

శరీరమూ, మనసూ కూడా సహకరిస్తాయి

రాతిబొమ్మలా ఆయన దగ్గరికి నడిచి వెళ్లాను.

నా అంగీకారం తెలిపాను.

అనుకున్నట్టుగానే వాళ్ళ సినిమా ప్రోగ్రాం నెరవేరింది నేను యింట్లోనే వుండిపోయాను ఆశించిన విధంగానే జరిగిపోయింది

రెండురోజుల తరువాత అనాడు....

సాయంత్రంనుండి ఎదురుచూసి యిక రాత్రికూడా అయ్యేసరికి పిల్లలకి అన్నాలు పెట్టేసి పడుకోబెట్టాను

రాత్రి పదిగంటలకు వచ్చారు యింటికి.

ముఖం దీపీటిలా వెలిగిపోతోంది.

ఆ కళ్ళల్లో పెదవుల్లో సంతోషం తొంగి చూస్తోంది

ఆ చేతుల్లో చాలా రోజుల తరువాత పూల పొట్లం

తలుపులు మూసి వెనక్కి తిరగ్గానే

'అరుణా అరుణా కొండలా వచ్చి మీద పడుతుందనుకున్న ఆపద గులకరాయిలా తప్పిపోయింది. ఆ యిన్స్పెక్టరు చాలా మంచివాడిలా వున్నాడు. నా మీద వచ్చినవన్నీ అబద్ధపు రిపోర్టులనీ, కిట్టనివాళ్లు చేసిన పని అనీ పైకి వ్రాసేశాడు. నిజంగా నీకు. 'నీఅందానికి నా జోహార్లు అరుణా' పొట్లంవిప్పి జడలో మాల తురుముతూ అన్నారు.

"నీకు .. నీ అందానికి నా జోహార్లు'

యిదే ...యిదే మాట రెండురోజుల క్రితం తన ఒళ్ళును హూనంచేస్తూ తన అందాన్ని కసితీరా జుర్రుకుంటూ అదే .. ఆయన అంటున్న ఆ 'చాలామంచి ఇన్స్పెక్టరు' అన్నాడు.

కాని . అప్పుడు రాని కోపం, అసహ్యం యిప్పుడు కలుగుతున్నాయి. అతను జోహార్లు అర్పించింది 'నా అందానికి' నిజమే

కాని కాని యిప్పుడు యీయన జోహార్లు అంటున్నది.

నాకు కాదు నా అందానికి కాదు. అది సాధిస్తున్న విజయాలకి.

మాట్లాడలేదు నేను. మౌనంగానే వంటయింట్లోకి నడిచాను.

మా యిద్దరికీ వడ్డించాను.

మొదటి ముద్ద నా నోటికి అందించారు.

క్షణంసేపు తదేకంగా ఆ కళ్ళలోకి చూశాను

వాటిల్లో సంతోషం తప్ప బాధగానీ, అవమానంగానీ కనిపించలేదు. నిర్లక్ష్యంగా పెదవులు విరిచి సన్నని నవ్వు నవ్వి నోరు తెరిచాను

ఆయన చేత్తో అందించింది అన్నం ముద్దనే అయినా విషంలా మింగాను.

నాలోని విర్లిప్తత, మౌనం గమనించారు కాబోలు పలుకరించటానికి యిక ధైర్యంచాలక పోయింది.

భోజనాలు ముగించగానే తను వెళ్ళి పడుకున్నారు

నేను పిల్లలను జరిపి చోటుచేసుకోసాగాను

'యిలారా అరుణా'

వెనక్కు తిరిగి చూశాను.

మెల్లిగా తల ప్రక్కకి తిప్పి చూశాను.

మంచంమీద జరుగుతూ తన ప్రక్కన చోటు చూపిస్తూ పిలుస్తున్నారు.

వ్యతిరేకిస్తున్న మనసుని అధీనంలోకి తెచ్చుకుని అడుగులు వేశాను

అతనికి తగలకుండా అంటనట్టుగా పడుకున్నాను

ఆ చేతులు నా నడుం పట్టుకుని తమవైపు తిప్పుకున్నాయి

బిగిసిపోతున్న కౌగిలి గానీ వెచ్చగా తగులుతున్న వూపిరి గానీ, నా నుదుటి మీద, బుగ్గలమీద, పెదవులమీద తడిచేస్తున్న ముద్రలుగానీ నాలో ఎలాంటి మార్పునూ తేలేకపోయాయి.

నాలో ఆవేశం రావటం లేదు.

వుద్రేకం పుట్టటం లేదు.

కోరికతో ఒళ్ళు దహించటం లేదు.

అవన్నీ లేకపోయినా ఒక్కోరోజు ఆ కౌగిలిలో నా దిగులు తీరేది.

నా మనసులో ఏ మూలో తినేస్తున్నట్లున్న బాధను మరిపించినట్లుండేది.

ఆవేదనతో అలమటించే నా హృదయానికి ఎంతో వుపశాంతి కలిగేది.

కానీ వీటిల్లోనూ ఏ ఒక్కటీ కలుగలేదు నాకు.

పైగా ....

అంతులేని అసహ్యాన్ని కలిగించాయి విపరీతమయిన వేదనకి గురిచేశాయి.

నాకు యిక్కడ, యీ కౌగిలిలో కొన్ని క్షణాల పాటయినా శాంతి దొరికేది. కాని యింక లేదు. అలాంటిచోటు యింక లేదు. నాకు యికనుయీ జీవితానికి శాంతి నేదే లేదు....రాదు....రాదు....

అప్పటినుంచి మరబొమ్మలా మారిపోయాను.

ఎంతో కష్టసాధ్య మనుకున్న కార్యాలు అనుకోకుండా శ్రమ తెలియకుండా తీరిపోతే అవి తీరిన మార్గాలు అపసవ్యమయినవీ, అనుసరించరానివే అయినా మళ్ళీ మళ్ళీ అవే మార్గాలు అనుసరిస్తారు సుఖం రుచి మరిగినవాళ్ళు. యిప్పుడో యింకో క్షణాలోనో మీద పడబోతుందన్న పెద్ద అపద అనుకోని విధంగా తొలగిపోతే తొలగింపచేసిన ఆ శక్తిని మళ్ళీ మళ్ళీ అలాంటి ఆపదలప్పుడు వుపయోగించుకోవాలని చూస్తారు. అది దుష్టశక్తి అయినా సరే.

ఆ వేళ దీపావళి....

పండగలకు కొత్త బట్టలు, పిండివంటలు యివన్నీ మరిచిపోయి చాలా కాలమయింది. ఎప్పుడొస్తున్నాయో, ఎప్పుడు వెళుతున్నాయో ఏయే పండగలు ఎలా చెయ్యాలో, ఏమేం చేసుకోవాలో కూడా ఒక విధంగా మరుపున పడ్డాయనే చెప్పాలి.

వుదయం పదిగంటల వేళ బోలెడన్ని పాకెట్లతో వచ్చారు ఆయన. పిల్లలు ఆశ్చర్యంతో తల మునకలయిపోతూ చుట్టూ పాకెట్లు పరచుకుని ఒక్కొటీ వూడదీస్తున్న వాళ్ళ నాన్న చుట్టూ మూగి ఉన్నారు.

ఆయన ముఖంలో ఆనందం వెల్లి విరుస్తోంది.

నాకూ ఆశ్చర్యంగానూ, మనసుతో ఓ మూల సంతోషం, దాన్ని చంపుతూ యిదంతా ఏమిటనే అనుమానంగానూ తోచింది.

ప్యాకెట్లు ఒకొక్కక్కటే విప్పబడు తున్నాయి.

పిల్లలందరికీ తలా జత రెడీమేడ్ బట్టలు

రెండు పెద్ద పెద్ద ప్యాకెట్ల నిండా పటాసులు.

వాటిని చూసి సంతోషం పట్టలేక చప్పట్లు చరుస్తూ గంతులు వేస్తున్నారు పిల్లలు.

మళ్ళీ ఓ రెండు ప్యాకెట్లు విప్పారు.

ఎప్పుడూ చూడని, పుట్టి బుద్ధి ఎరిగాక తిని ఎరగని స్వీట్లు, తించీ చూడగానే వాళ్ళ నాన్న చేతుల్లోంచి వాటిని లాక్కున్నారు. కలియ పడ్డారు.

ఈ సారి ఆయన చూపు వంటింటి తలుపు నానుకుని వింతుని చూస్తున్న నా మీద పడింది

ఇదంతా చూస్తున్న నాలో ఏమయినా కుతూహలంగానీ మార్పుగానీ కనబడు తోందా గమనించాలన్నట్టుగా నిశితంగా చూశారు.

అలా తోచిన క్షణాన బయటికి ఆ మార్పులేవీ కనబడకుండా మామూలుగా వుండటానికి ప్రయత్నించాను.

'యిదిగో అరుణా యిది నీకు'

దగ్గరగా వచ్చి నా ఎదురుగా నిలబడి పేకెట్ విప్పారు.

చిన్న చిన్న చమ్కీ పువ్వుల తెల్ల సిల్కుచీర కొత్త పెళ్ళి కూతురిలా నవ్వినట్టు మనోహరంగా కనిపించింది.

"తీసుకో"

"ఇదంతా ఏమిటి? ఎక్కడిది? ఎలా తెచ్చారు." అప్పటి దాకా అణచి పెట్టుకున్న ఆశ్చర్యం, అనుమానం, కుతూహలం ప్రశ్నల వర్షం కురిపించాయి.

"అదంతా యిప్పుడు కాదు. ముందు ఆ సంచిలోని సరుకులు తీసుకెళ్ళి అద్భుతమైన నీ పాక నైపుణ్యాన్ని యివాళ మాకు చూపించాలి. వెళ్ళు వెళ్ళు బలే ఆకలిగా వుంది."

నేను అడగాలనుకున్నవి తెలిసిందన్నట్టు చివరి ప్యాకెట్టు విప్పారు.

అందులోంచి చేతుల్లోకి తీసి పట్టుకున్న రెడీమేడ్ బట్టల జత ప్యాంటు, షర్టు.... నా కళ్ళు ఎందుకో చెమర్చాయి.

ఎప్పుడో పెళ్ళయిన కొత్తలో, జీవితం రంగుల హరివిల్లు అనుకున్న రోజుల్లో ధరిస్తూండిన బట్టలు. వాటిల్లో ఆయన్ని ఒక్కసారి వూహించుకున్నాను.

నా విస్మితను యింక ప్రదర్శించలేక పోయాను.

'చాలా బాగున్నాయి' మనస్ఫూర్తిగా అన్నాను.

వంట మొదలు పెట్టాను.

అకాల వర్షంలా యీ నాడు తెచ్చిన సంపద నాలో ప్రశ్నల పరంపరను వృద్ధి చేస్తోంది.

ఒక వైపు ఎంతో ఆనందంగా అనిపించి దాన్ని అంటిపెట్టుకుని ఏదో భయమూ కాసేపు నన్ను పీడించాయి.

ఆ తర్వాత వంట పనిలో మునిగిపోయాను.

నాలుగు రోజులుగా ఆకలితో నక నక లాడే బిచ్చగాడి ముందు పంచభక్ష్య పరమాన్నములతో భోజనపు విస్తరి ప్రత్యక్షమయితే ముందేం తినాలో, తర్వాతేం మొదలెట్టాలో నన్ను వుక్కిరి బిక్కిరికి లోనయినట్లుగా వుంది నా పరిస్థితి.



'రోజూ ఏం చేయాలా వంట' అంటూ వెతుక్కునే నేను ఒక్కసారిగా' నా చుట్టూ అన్ని సరుకులూ చూశాక కూడా 'ఏం చేయాలి' ఏది మొదలెట్టాలి అని వెతికాను. ఆలోచించాను. తత్తర పడ్డాను. ఏ ఒకటి చేస్తామని అనిపించినా వెనువెంటనే యిదవుతే యింకా బావుంటుందేమో, నని ఆశ, ఆతురతల మధ్య ఎలాగో ముగించాను.

భోజనం ముందర పిల్లల కళ్ళు మెరుస్తున్నాయి

వాళ్ళు యిప్పటి వరకూ యిలాంటి భోజనం చూసి ఎరగరు అసలు.

ఆయన లొట్టలు వేసుకుంటూ తింటున్నారు.

ఆయన ముఖంలో యిలాంటి సంతోషం కనిపించి చాలా రోజులయిందనే చెప్పాలి. పిచ్చి పిచ్చి అనుమానాలతో యీ సంతోషం పాడుచేసుకోటం యిష్టం లేక వాళ్ళలో నేనూ కలిసిపోయాను.

ఆ సాయంత్రం అందరం కొత్త బట్టలు కట్టుకున్నాం.

ఆయనలా బజారులోకి వెళ్ళారు.

చీకటి పడుతుండగా కొవ్వొత్తుల ప్యాకెట్ చింపి వెలిగించి వీధి వరండా, మెట్లవెంబడి అలంకరించాను. ముంగిట్లో దీపాల వెలుగు పిల్లల ముఖాల్లో ఆనందపు వెలుగు చూసి నా మనసు చల్లబడినట్లు నా కడుపు నిండిపోయినట్లు అనిపించింది.

ప్రమిదలలోకి నూనె లేక దీపాలు వెలిగించకనే ఎన్ని దీపావళులో వెళ్ళి

పోయాయి ఆ వెళ్ళిన దీపావళులన్నీ ఒక్కసారి కూడ బలుక్కుని వెనక్కి మరలి వచ్చినట్టుగా వుంది యీ దీపావళి నాటి మా లోగిలి.

పటాసులు పేలుస్తూండగా వచ్చారు ఆయన పిల్లలని వదిలి లోపలికి వచ్చాను వెనకబడే నేనూ

"అరుణా"

కొత్త చీరలో ముస్తాబయివున్న నన్ను ఎగాదిగా చూశారు. ఆ చూపు నా గుండె లోతుల్లో ఏ మూలో స్పర్శించింది.

నాకు తెలియకుండానే సిగ్గు పడ్డాను.

నిలబడిపోయాను తల వంచుకుని.

నా వెనగ్గా వచ్చి నిలబడ్డారు.

నా తలలో పువ్వులు తురుముతున్న ఆ వేళ్ళస్పర్శ నా మెడ మీద గిలి గింతలు పెట్టినట్టయింది.

చప్పున తన వేపుకు తిప్పుకున్నారు.

నా నడుం చుట్టూ ఆయన బలమయిన చేతులు బిగుసుకున్నాయి. దగ్గరగా వచ్చేశాను.

నా రెండు చేతులూ హారంలా ఆయన మెడ మీద పెనవేసుకున్నాయి. నా ముఖమంతా కొన్ని క్షణాల పాటు ముద్దులతో తడిసిపోయింది. ఆ ముద్దుల వర్షం ముఖం మించి మెడమీదికి జారి భుజాల మీదికి ప్రాకి మరి కొంచెం క్రిందికి జారి....

"అమ్మా.... అమ్మా....

పిల్లలు పరుగున లోపలికి వచ్చేయటంతో విధిలేనట్టు విడిపోయాము. కొత్త డ్రస్సులో ఠీవిగా, ఆనందంగా, అందంగా... ఆ విశాలమైన ఎదమీద నన్ను ఆ బిగి కౌగిట్లో నన్ను.... వూహించుకొని, ఎన్ని యుగాల తరువాత లభించిన వరంలా పరవశించి పోయాను.

శరీరానికి పుట్టే అనుభవమే కాకుండా మనసులోనూ అనుభూతులు తోడయితేనే తప్ప యిలాంటి పారవశ్యం కలగవేమో ?

ఆ రాత్రి పిల్లలు నిద్రపోయాక, ఆయన నా ఒడిలో పడుకుని వుండగా అడిగాను.

"ఇవాళ ఏమిటి ? అవన్నీ ఎలా తెచ్చారు ?"

"ఒక చోట రావలసి వుండిన డబ్బు వచ్చింది. తెచ్చాను"

"మనకు రావలసిన డబ్బా? ఆశ్చర్యంగా వుంది. మనమే అందరికీ బాకీ పడ్డాం కానీ మనకు బాకీ పడ్డవాళ్ళు ఎవరున్నారు?"

"సామర్థ్యం చేతిలో వుంటే డబ్బు దానంతటదే వెతుక్కుంటూ వస్తుంది."

"మీ మాటలు అర్థం కావటం లేదు."

"ఇప్పుడా అర్థాల గురించి ఏం ఆలోచించకు. రేపు చెబుతాను గానీ యీ రాత్రి వృధా చేయకు. నేనాగలేకున్నాను'"

యింకేం మాట్లాడలేక పోయాను. కొత్తగా పెళ్ళయిన రోజుల్లోని రాత్రులు గుర్తు వచ్చాయి.

తెల్లవారింది.

ఆయన రాత్రి మాట్లాడిన మాటలకు అర్థం ఆఫీసుకి బయలుదేరుతున్నప్పుడు చెప్పారు,

అందంగా అలంకరిస్తున్నప్పుడు పట్టరాని సంతోషంతో చిందులు వేసిన మేక పిల్ల హఠాత్తుగా తన కుత్తుక నరకటానికి కత్తినెత్తిన కసాయివాడి కేసి చూసినట్టు చూశాను.

ఆ మాటలకు అర్థం ఆ వేళ సాయంత్రం ఆయనా, పిల్లలూ సినిమా ప్రోగ్రాం. అయితే అందులో ఒకటే మార్పు.

ఇదివరకూ నా భర్త కోసం.... నా పిల్లల కోసం.... యీ సంసారం కోసం బురదలో కాలు పెట్టాను. కాని అది వూబిలా నన్ను బలితీసుకుంటుందని అనుకోలేదు.

మా వారి సామర్థ్యానికి, పలుకుబడికి గిరాకీ పెరిగినట్టుంది. తన ఫ్రెండట. ఏదో చిక్కులో యిరుక్కున్నాడు. ఆయన బయట పడ్డట్టే తననీ బయటికి లాగమన్నాడు. అందుకు ప్రతిఫలంగా కొంత డబ్బు యీయనకి ముట్టచెప్పాడు.

"ఏం పాపం ఆయనకి మీ లాగా భార్య లేదా?" నా గుండె కాలిపోతోంది.

"లేదు."

"వుందినా అందరూ మీ లాంటి మగవాళ్ళే వుండరు?"

"అరుణా" కోపంగా అరిచారు.

'ఎందుకలా అరుస్తారు? మన సంసారంకోసం, మన పిల్లల బ్రతుకుకోసం, మీకోసం, నాకోసం మీరు చెప్పినట్లు చేశాను కాని యిప్పుడు ఎవరెవరికోసమో యిలా ప్రవర్తించటం ఎందుకు మీకు నీచంగా, అసహ్యంగా అనిపించటం లేదా? అసలు మనమెందుకు చేయాలి.'

'అరుణా. ఎందుకుచేయాలి అంటే అతను డబ్బు యిచ్చాడు. గనుక. మనం తీసుకున్నాం గనుక. విన్నచేసిన ఖర్చంతా ఆ డబ్బులోదే. అతనిచ్చిన దానికి మనం పనిచేసి పెడతాం అంతే '

'అం.... తే.... ఎంత సులభంగా అన్నారు. అసలు మీరెందుకంత నీచంగా ప్రవర్తిస్తున్నారు. ఎవరిదగ్గరో డబ్బుతీసుకుని వాడిపని చేయటంకోసం అద్దమయిన మగవాడి దగ్గరా మీ భార్యను పడుకోబెట్టటం మీకు సిగ్గుగా అనిపించటం లేదూ.... నీచంగా తోచటం లేదూ....

"అరుణా: పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. యిందులో యిప్పుడు కొత్తగా పోయిందేమిటి. విన్న అంత డబ్బు మనందరికీ ఎంత సుఖాన్ని పంచిందో చూశావుగా."

"ఛీ.... యిలాంటి నీచమయిన పనికి ప్రతిఫలంగా ముడుతున్న డబ్బు అని తెలిసివుంటే తాకనయినా తాకేదాన్ని కాదు. మీ రెందుకండీ యిలా అయిపోయారు. ఆపద, అవసరం అని కాళ్లు పట్టుకున్నారు గత్యంతరంలేక మనందరికొరకు నామనసు చంపుకుని యీ శరీరాన్ని వాడాను మీరు యిప్పుడు డబ్బు మరిగి, అది అందించే సుఖాల మత్తులో పడి ఎంత నైచ్యానికి దిగజారుతున్నారో తెలియటం లేదు మనకాడబ్బూ వద్దు నే నాపనీ చేయలేను. మిగిలిన డబ్బు అతనికి యిచ్చేసి ఆ వాడుకున్నది జీతంగాగానే యిచ్చేయండి. ఆ పాపిష్టి డబ్బు మాకు వద్దు." గుండెలు ఎగిసిపడుతుండగా నిష్కర్షగా అన్నాను.

"నాకు కావాలి అరుణా. యింక నేను యీ యిబ్బందులు అనుభవించలేను. నాకూ సుఖపడాలని వుంది. అందుకు కావలసిన డబ్బు సంపాదించాలని వుంది. అయినా నేనే చెబుతున్నపుడు నీకొచ్చిన యిబ్బంది ఏమిటి."

"డబ్బు సంపాదించాలని వుంది. నిజమే. కాని ఆ సంపాదన యిట్లా కాదండి. కష్టపడండి మీ తలలోని తెలివితేటలని, మీ శరీరంలోని బలాన్ని ప్రదర్శించి సంపాదించండి. వద్దనను. కాని యిలా మీ భార్యగా మీరక్షణను కోరివచ్చిన నన్ను, ఒక గృహిణిగా చూడటం మాని పడుపుకత్తెలా నలుగురి దగ్గర పడుకోబెట్టి సంపాదించకండి."

"అయితే యిప్పుడు నీవు పతివ్రతనే అంటావు."

ఆ మాటతో నా కళ్లలో నిప్పులే రాలాయి.

నా ఒళ్లు కోపంతో దహించుకుపోయింది

"మీ లాంటి మగవాడికి భార్యనయిన నేను పతివ్రతగా ఎలావుంటానండి.

అనాడు పాదాలమీదపడి యీ ఒక్కసారికి గట్టెక్కనీ అంటే మీకోసం నన్ను నేను పాడుచేసుకున్నాను. మళ్ళీ మళ్ళీ మీరు నన్ను అలాగే దిగదోసి యిప్పుడు పతివ్రతవా అంటూ ఎగతాళి చేయాటానికి మీకు సిగ్గులేదు. 'నాకు చచ్చిపోవాలని వుంది అరుణా'. అని మీరు అంటే నా ఒడిలోకి తీసుకుని ఓదార్చాను. యీనాడు 'నాకు డబ్బు సంపాదించాలని వుంది' అరుణా అంటూ నన్ను పరాయి మగవాళ్ళ ఒడిలో పడుకోట్టాలని చూస్తున్నారు మీరు. మీరింతగా దిగజారిపోటానికి కారణం ఆ డబ్బేనా. మీకు అదితప్ప మరేమీ అక్కర్లేదా."

"అరుణా! విసిగించకు. నేను డబ్బుతీసుకున్నాను. వాడుకున్నాను. అతని పని చేస్తానన్నాను. అపని జరిపేఅతను యీ రాత్రికి వస్తాడు. అంతే." విసురుగా నన్ను తోసుకుంటూ వెళ్ళిపోయారు.

ఆయన పాదాలు నా గుండెలు నలుగద్రొక్కుతూ వెళ్ళినట్లు విలవిలలాడాను.

నిన్నటి సంతోషం దూదిపింజెలా ఎగిరిపోయింది. క్షణాలమీద అవిరి అయిపోయింది.

నిస్పృహాయత నన్ను విలువుకా ద్రుంగదీసింది. ఎదిరించి నిలబడి పోరాడి ప్రతిగటించ గల శక్తి లేదు నాకు.

రాను రాను అయనకి ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది. మొండితనం వచ్చింది డబ్బురుచి బాగా మరిగారు. ఆ డబ్బు అందిస్తున్న సుఖాలకైపు బాగా తలకెక్కి...

ఒకటికి మూడు సార్లు వదిలేసిన నీతికి యింకా విలువవుంటుందా? అసలు దానికి విలువనేది ఒకటుందనే జ్ఞానం వుండొద్దూ?

ఎవరెవరికో ప్రమోషన్లు యిప్పిస్తానని. కావలసిన చోట్లకి ట్రాన్స్ఫర్‌లు తెప్పించి యిస్తానని. ఎందరో ప్రముఖులు, మరెవరో అఫీసర్లు, యింకెదరో పెద్దమనుషులు తనకు బాగా తెలిసిన వాళ్ళేనని, తను ఒకమాట చెబితే పని జరిగిపోతుందని చెప్పి వాళ్ళదగ్గర వీళ్ళదగ్గర డబ్బు పుచ్చుకోటం అయా పనులు చేయగల పెద్దమనుషులకు ప్రతిఫలంగా నన్ను అర్పించటం ఆయనకి అలవాటుగా మారిపోయింది.

ఎంతగా వ్యతిరేకించినా, ప్రతిఘటించినా ఫలితం లేకపోయింది. దిగజారి పోయిన ఆడదానికి నైతికబలం లేదు.

కళ్ళనీళ్ళతో ఒడిలో పడుకుని తనను ఒడ్డుకు చేర్చటంకోసం ఒకనాడు అర్థించిన అయనే రాను రాను 'ఎవరితే నేం? నలుగురితో పడుకున్న ఆడదానికి ఐదవవాడు కొత్తేమిటి.' అంటూ అసహ్యంగా నిరసనగా మాట్లాడసాగాడు.

ఆయన ఆ మాట అంటున్నపుడు నాకు తల బ్రద్దలు కొట్టుకుని చచ్చిపోవా లనిపించేది.

'భగవంతుడా నాకు చావయినా రానీయవా. బలవంతంగా చావటానికి ధైర్యం లేని పిరికిదాన్ని. ఏ రోగమో, ఏ ప్రమాదమో వచ్చి నాకు తెలియకుండా నన్ను తీసుకుపో అని ప్రార్థించేదాన్ని.

ఒకసారి ఒక పెద్దమనిషి ద్వారా అంటుకున్న జబ్బు నా ప్రాణం మీదికి తెచ్చింది.

హాస్పిటలులో చేర్చారు. అప్పుడు తప్పకుండా చచ్చిపోతానని, యీబాధనుండి విముక్తి పొందుతానని ఆశపడ్డాను.

పూచిక పుల్లయినా మనం కోరితే గగన కుసుమం అవుతుంది.

అలాగే మరణం కూడా మనం కోరితేతేలికగా లభ్యం అయేదికాదు

జీవితాలతో ఆడుకుంటుంది.

భయపడి పరిగెత్తే వారిని తరిమి తరిమి పట్టుకుంటుంది.

తన వెనుక పరుగులు తీస్తూ పొందాలని ప్రయత్నించే వారికి దూరంగా అందకుండా తప్పుకు పోతుంది.

అలాగే నానుండి తప్పుకు పోయింది మృత్యువు.

నా జీవితచక్రం మళ్ళీ తిరగడం మొదలెట్టింది.

ఒక విధమైన నిర్లిప్తతతో యాంత్రికమైన జీవితానికి అలవాటు పడిపో యాను.

మానాభిమానాలకు, నీతి నిజాయితీలకు, ఆత్మాభిమానానికి, ఆత్మగౌరవానికి సమాధి కట్టేశాను.

వీధిలోకి అడుగుపెడితే చాలు శరీరం తూట్లుపడేలా మాటలు.

"నీకేదయినా పని కావాలంటే సుందర్రావుని కలుసుకోవోయ్, క్షణాలమీద పని జరిగిపోతుంది."

"అహా! నేను కూడా కొన్ని అధికారాలయినా చేతులో గల ఒక పెద్ద ఆఫీసరయి వుంటే అమరసౌఖ్యం లభించేది కదా."

తల వంచుకుని రెప్పల చాటున కన్నీళ్ళు దాచుకుని అక్కడినుండి వెళ్ళిపోడం తప్ప నేనేం అనగలను?

"ఏమండీ అరుణగారూ! మీ వారితో చెప్పి యీ విషయం కాస్త చూడ మనండి యీ పని జరిగితే మీ ఋణం వుంచుకోము. మీ ఆయన యిలాంటి వ్యవహారాల్లో చాలా సమర్థుడట కదా."



అంటూ వ్యంగ్య సంభాషణాలతో నన్ను చిత్రవధ చేసే ఆడవాళ్ళ మాటలు అన్నీ భరించి హరాయించుకోగల స్థితికి వచ్చేశాను.

మొదట్లో వాళ్ళ మాటలన్నీ మననం చేసుకుని కుళ్ళికుళ్ళి ఏడ్చేదాన్ని. తర్వాత తర్వాత మొండితనం వచ్చేసింది. బాధపడేదాన్ని కాని కన్నీళ్ళు వచ్చేవి కావు,

బహుశా అవీ అయిపోయాయేమో. కరుడుగట్టుకు పోయాయో మరి

నా గుండెల్లో అగ్నిపర్వతాలున్నాయనీ, అవి అప్పుడప్పుడు సెగలూ, పొగలూ చిమ్మి నన్ను దహిస్తాయిని ఎవరితో చెప్పుకొనేది.

యింట్లో యిప్పుడు యీ వస్తువుంది. యిదిలేదు అన్నమాటే లేదు మార్కెట్ లోకి కొత్తగా వచ్చే ప్రతీ వస్తువూ మా యింట్లోనూ వుంటుంది. బొగ్గులు కొనలేక, కట్టెలు లేక ముళ్ళకంపలు ఏరుకువచ్చి పొయ్యి రాజేసిన నా యింట్లో గ్యాస్‌పొయ్యిలు, వేడినీళ్ళు కాచుకునే హీటర్లు, కుక్కర్లు, గాద్రేజీ బీరువాలు, సోఫాసెట్లు డన్‌లప్ పరుపులు, ఓహ్ గంజి త్రాగటమంటే అది అమృతమే అనిపించిన యింట్లో యిప్పుడెన్నిరకాల అమృతాలో.

ఫ్రీజ్‌పండా అవే.

వంటయిల్లంతా స్టీలు సామాన్ల తళతళలు.

బీరువాలనిండా తలుపుతీస్తే జారిపడేట్టు బట్టలు.

మ్యాచింగ్ డ్రస్సులు నాటికి మ్యాచయ్యే ఆభరణాలు.

నాకేం తక్కువ. ఏం తక్కువ.

ఏం లేదు . ఏం లేదు. అయినా నా మనసు బాధగ మూలుగుతోంది. నా హృదయం ఏడుస్తోంది.

ఎందరికోలేనివి ఎన్నో నా దగ్గర వున్నాయి. కాని వుండితీరవలసిన శీలం లేదు ఏ సంపదకూడా సాటి రాలేని నీతి నా దగ్గర లేదు.

యింత డబ్బు, యిన్ని నగలు, యింతింత సంపద నా దగ్గర మూలుగుతున్నా మంటగలిసిన శీలాన్ని, చేజేతులా కోల్పోయిన నీతిని, పరువును కొనలేని దరిద్రురాలిని. యింకింత సంపాదించినా వాటిని కొనలేని దారిద్ర్యం నన్ను అంటిపెట్టుకునే వుంటుంది.

"అరుణా! నీవు యీ రోజు సినిమాకి వెళ్లాలి.

"అదేం ప్లేటు మారిందే."

"అవును అతను యింటికి రాడట."

"సినిమాహాల్లో సరసం చేస్తాడంటనా."

"అరుణా! చాలా పొగరుగా మాట్లాడుతున్నావు."

"ఇందులో పొగరేం వుంది. యింటికి రాడు. నేను సినిమాకి వెళ్లాలి. సినిమా చూడ్డానికి తోడుండేవాలు. డబ్బు యిచ్చేస్తాడటనా?"

"నీ వ్యంగ్యం చాలించు. హద్దుమీరుతున్నావు సినిమా నుంచి నేరుగా హోటల్‌కు తీసుకు వెడతాడు. యిప్పుడర్థం అయిందా పిల్లల్ని నేను చూసుకుంటాను,"

ఇట్లా కొందరితో నేను బయటకు వెళ్ళవలసివచ్చేది.

ఇదీ ఒకందుకు మేలేఅయింది

పిల్లలు పెరుగుతున్నారు. పెద్దవాళ్ళవుతున్నారు. వాళ్లకు ఊహతెలుస్తోంది. యింటికి వస్తున్నవాళ్లు ఎవరో? ఎందుకు వస్తున్నారో యిలాంటి ఆరాలు తీయడానికి ప్రయత్నిస్తున్నారు.

వాళ్ల చిన్న చిన్న బుర్రల్లో సవాలక్ష ప్రశ్నలు వుదయిస్తున్నాయి.

ఎవరెవరితోనో వాళ్లు విడిచిచేసిన బంగళాలకు వెళ్ళవలసి వచ్చేది. వాళ్ళ కార్లలో విహారాలకు, వాళ్ళతో విజాసాలకు తిరిగేదాన్ని.

యిట్లా నా జీవితం విచ్చలవిడిగా మారిపోయింది.

నా గురించి, యిలా పాడయిపోయిన నా జీవితం గురించి ఆలోచించడానికి గానీ, పిల్లల గురించి విచారించటానికి కానీ నాకు తీరిక, ఓపిక లేకుండా పోయింది.

ఏ అర్ధరాత్రో....

ఎక్కడికీ వెళ్ళవలసిన అవసరం లేనపుడు....

నా నలుగురి పిల్లల మధ్యా చోటుచేసుకుని పడుకున్నపుడు....

బిగించివేసిన నా హృదయ కవాటాలు తెరవడానికి ప్రయత్నించేదాని. భయం వేసేది.

నా హృదయపు అట్టడుగు పొరల్లో దాగిపోయిన మనసు, మమత, మార్దవం, నీతి, నిజాయితీ, అన్నీ కలగా పులగంగా బయట పడి నన్ను చిత్రవధ చేసేవి.

నాకు తెలియకుండానే ఆ క్షణంలో కళ్ళల్లోంచి ధారగా నీళ్ళు కారేవి. అవి బుగ్గల మీదుగా జారి చెవులు, మెడ తడుపుకుంటూ పోతుంటే తుడుచుకునేదాన్ని కాదు.

కరువు తీరేలా, నా గుండెల బరువు కరిగిపోయేలా భోరున ఏడవాలని పించేది. కాని ఏడ్చేదాన్ని కాదు.

నాలో యింకా ఆ మాత్రం కన్నీళ్ళు కార్పించగల మార్దవం మిగిలి వున్నందుకు ఎంతో ఆనందించేదాన్ని.

* * *

ఆ వేళ...

పద్మ స్కూలు నుంచి ఏడుస్తూ వచ్చింది.

"ఏం జరిగింది? ఎందుకే అలా ఏడుస్తున్నావు?"

నాలో ఏదో కంగారు. పిల్లల ముందు నా గురించి ఎవరయినా ఏమయినా అని వుంటారా?

అది పలకలేదు.

"చెప్పు పద్మా . ఏం జరిగింది"

నోటితో జవాబు చెప్పలేదు. చూపించింది.

అర్థమయింది.

పద్మ పెద్దమనిషయింది.

నా గుండె లెందుకో గుబ గుబ లాడాయి.

పిల్ల ఎదిగింది. పెళ్ళీడు వచ్చిందన్నమాట.

కాని నేను .. నేను.... నన్ను.... చూసి యీ పిల్లని ఎవరయినా చేసుకుంటారా?

తల్లి యిలాంటిదంటే పిల్లను నమ్ముతారా.

నాలో నిర్వచించలేని భయం, పిచ్చి పిచ్చి ఆలోచనలు మొదలయ్యాయి.

"అరుణా మహాబలిపురం పిక్నిక్ వెళ్ళాలి"

"నాకు తీరదు" తిరిగి చూడకుండానే అన్నాను.

"అదేం ప్రోగ్రాం ఫిక్స్ చేశాను"

"నాకు తీరదు. అన్నాను"

"నీకు మతి పోయిందా ?"

"యిప్పటి దాకా పోయిన మతి యిప్పుడిప్పుడే వస్తోంది."

"పిచ్చిగా మాట్లాడకు. అవతల నేను పెద్దమనిషితో ప్రోగ్రాం ఫిక్స్‌చేసి చెప్పివస్తే.

"పెద్ద .. మ .. ని ...షి" మీకు బుద్ధుందా అసలు"

విస్వేరబోయి చూశారు. నన్ను నేను సంబాళించుకున్నాను.

"అవతల పెద్ద మ న .. షు .. ల సంగతి వదలి యింట్లో పెద్దమనిషి అయిన పిల్లని గురించి కాసేపు ఆలోచించండి."

"పద్మను గురించి ఆలోచించటానికి ఏంవుంది ?"

"పిల్ల పెద్దదయింది యిక వాళ్ళకి అన్ని విషయాలూ తెలుస్తాయి. తల్లి యిలాంటిదని తెలిస్తే వాళ్ళ బ్రతుకు యేమవుతుంది. పోట కూటి కోసం దిగజారాం. డబ్బు కాపీనం కొద్దీ మీరు. మీ మాటని ఎదిరించలేని నేను నీచాతి నీచమయిన జీవితం గడుపుతున్నాం. పెద్దవాళ్ళవుతున్న ఆ పిల్లల ముందు యిక తలెత్తుకోలేం. వాళ్లూ బయట తలెత్తి తిరగలేరు. యిక యిలా జరగ టానికి వీలులేదు. మీ సంపాదనలు, మీ చాకచక్యాలు యిక మానేసి మీ వుద్యోగం కుదురుగా చేసుకోండి. పిల్లలకి తల్లిగా నా బాధ్యత నేను నిర్వర్తిస్తాను అంతే" తెగేసి చెప్పాను.

నా మొండి తనానికి, నా తెగువకు ఆశ్చర్యపోయారు. చిరాకు పడ్డారు. బెదిరించారు. అర్థించారు నేను వినలేదు.

చివరకు దెబ్బలు తిన్నాను.

మీరు కొట్టినా, చంపినా సరే యిక నేను వినను, అన్నాను.

"అరుణా. యీ సారికి విను. డబ్బు కూడా తీసుకున్నాను."

"వాడి ముఖాన కొట్టిరండి" ఖచ్చితంగా చెప్పేశాను.

నయంగానూ, భయంగానూ కూడా తాయశక్తులా ప్రయత్నించి విసిగిపోయి 'చూస్తాను' అంటూ బయటికి వెళ్ళడానికి బయలుదేరారు.

"యిదిగో యింటికే పంపారో అరిచి. అల్లరి చేసి వాణ్ని మిమ్మల్ని కూడా బయటికి గెంటుతాను జాగ్రత్త" బెదిరించాను.




దాంతో చేసేది లేక మానేశారు.

నాతో మాటలు మానేశారు

అయినా ఫరవాలేదు

మామూలు గృహిణిగా, నా పిల్లలకు తల్లిగా మసలడమే నా ప్రస్తుత కర్తవ్యం.

నా జీవితం పరిస్థితుల ప్రాబల్యంతో గాడి తప్పి ఉండొచ్చు.

అపవిత్రంగానే నేను బ్రతుకు గడిపి వుండొచ్చు

నేను మలిన శరీరనే కావచ్చు.

అయినా అయినా .

నేను నా పిల్లలకు తల్లి ని

ఇప్పుడు నేను ఎంత ప్రయత్నించినా కోల్పోయిన శీలాన్ని పవిత్రం చేసుకోలేను. మునుపటి నైర్మల్యం నాకు లేదు తెచ్చుకోలేను.

అయినా నా పిల్లలు నేను యిలాంటి దారుణ పరిస్థితులకు లొంగిపోయట్లు కాకుండా ధైర్యంగా పెంచాలి అసలు అటువంటి అవసరాలు రాకుండా చూడాలి. వాళ్ళ జీవితాలు స్వచ్ఛంగా వెలగాలి. వాటిపైన ఎలాంటి నీడలు పడకూడదు. కల్మషపూరితమయిన యీ గాలి వాళ్ళని స్పర్శించనయినా కూడదు. యిక మీదట యిదే నా ధ్యేయం అని నిశ్చయించుకున్నాను

ఆయన నాతో మాట్లాడటంలేదు కాని నా మాటలతో ప్రవర్తన మాత్రం మారినట్టే కనిపించింది

మామూలుగా వుద్యోగం చూసుకోసాగారు.

పీడకలలా గతాన్ని మరచిపోయి మా సంసారంలో ఆనందం తెచ్చుకోవాలని పించింది

నేనే ఆయనతో మాటలు కలిపాను.

మొదట్లో కోపంగానూ, అలిగినట్లు వుండిపోయినా కొన్నాళ్ళకి మామూలుగా కలసిపోయారు

మళ్ళీ యింట్లో నవ్వులు, పిల్లలతో ఆటలు. నా కొంగు పుచ్చుకుని తిరగ టాలు మొదలయ్యాయి. యిట్లాగే యీ నవ్వుల నదిలో నా జీవితపు పడవ సాగి పోతుందనుకున్నాను.

చాలా రోజుల తర్వాత ఒకనాడు

అలసి నిద్రకు ఒరిగిన నా ప్రక్కకు చేరారు. సంసారం విషయాలు. పిల్లల చదువులు, వాళ్ళ అభివృద్ధి ఏవేవో మాట్లాడారు.

"అరుణా! కాదనకు చాలా మంచి ఛాన్సు ఒకటి వచ్చింది.

"ఛీ!" అంటూ త్రాచులా లేచాను అతని చేతులు విడిపించుకుని.

యీయన మారలేదు ... మారలేదు మారరనుకుని భ్రమించాను.

నా ఆశల పూల పడవ తెగిపోయింది.

నాకు పట్టరాని దుఃఖం వచ్చింది.

ముఖాన్ని దోసిట్లో దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాను.

నా ఏడుపును ఆపలేదు

వుధృతం తగ్గేదాకా ఆయన మాట్లాడలేదు.

ఎరుపెక్కిన కళ్ళతో, పూడుకుపోతున్న కంఠంతో అడిగాను నేనే.

"ఇంక మీరు మారరా. మన జీవితాలు యిలా గడవవలసిందేనా. యిన్నాళ్ళ నేను చెప్పిందంతా చెవిటి ముందు శంఖం వూదినట్టే అయిందా, డబ్బు పిచ్చి విషంలా మీ నరనరానికి పట్టిపోయినట్టువుంది. యింక అది మనల్ని బ్రతకని వ్వదు. ఆ విషానికి విరుగుడు లేదు అవునా . అవునా . చెప్పండి"

ఆయన భుజాలు పట్టుకుని వూపుతూ ఆవేశంగా అరిచాను.

"అరుణా పిచ్చిగా అరవకు. నేను చెప్పేది సాంతం విను. ఈ సారి వచ్చిన పని సామాన్యమైంది కాదు. పదివేలు ఒక్కసారిగా కళ్ళ చూడొచ్చు. పై అధికారితో మాట్లాడి యీ పని జరిగేట్లు చూస్తే పదివేలు యిస్తానన్నాడు. సరే నన్నాను. ఆలోచించు అరుణా. ఒక్కసారిగా పదివేలంటే మాటలు కాదు. ఒకే ఒక్కరోజు ... ఒక్కరాత్రి నీవు అతనితో .."

"అతను అంగీకరించకపోతే. . "

"తప్పక ఒప్పుకుంటాడు అరుణా. వాడు ... వాడు.... ఎలాంటి వాడంటే ఆడకుక్క అయినా సరే చొంగలు కార్చుకుంటూ చూస్తాడు. అట్లాంటిది నీలాంటి అందమైన ఆడది, అప్సరస, వాడి ఒడిలో చేరి శృంగారం ఒలికిస్తే ... నైపుణ్యం ప్రదర్శిస్తే వాడితో అవునని అనిపించటానికి .....

ఎంత సిగ్గులేని మాటలు.

తన భార్యను పరాయి మగవాడి కౌగిలిలో వూహించుకోటంలో యీ భర్తను యింతగా ఆనందింపజేస్తున్నది ఆ పాడు డబ్బే కదూ.

"నిజం అరుణా. నీవు ముందు 'వూ' అను, యీ పని తప్పక జరుగుతుంది. యీ ఒక్కసారికి కాదనకు అరుణా యింకోసారి యిలా అడిగితే నీ ఇష్టం వచ్చిన శిక్షవేయి. యిప్పుడు మాత్రం ఒప్పుతో అరుణా పదివేలు మన పద్మకు పెళ్ళి చేసేయ్యవచ్చు అరుణా ...అరుణా....చేతులు పట్టుకుని బ్రతిమాలు తున్నారు

ఎండా వానా కలసి వచ్చినట్టు నాకు నవ్వు, ఏడుపు రెండూ వచ్చాయి.

తల్లి మానాన్ని అమ్మిన డబ్బు పెట్టి కూతురి పెళ్ళి.

ఏం వింత ఆహా విరగబడి నవ్వాను ఏడుపుతో వచ్చిన కళ్ళనీళ్ళు పగలబడి నవ్వడంతో రెట్టింపు అయ్యాయి.

నన్ను నేను సంబాళించుకోటానికి కాసేపు పట్టింది.

"పిచ్చి పిచ్చి వేషాలు వేయకండి. యింక యిలా జరగకూడదని, జరగనివ్వ నని ఎప్పుడో చెప్పాను. మీరిలా అడగకూడదు. నేను చెయ్యకూడదు. పెరుగుతున్న బిడ్డల ముందు గౌరవనీయుడయిన తండ్రిగా నిలబడడానికి ప్రయత్నించండి. మీ మర్యాదలు దక్కించుకుని మా మర్యాదలు కాపాడండి. అంతే" విసురుగా వెళ్ళిపోయాను అక్కడినుండి

నిప్పులు కక్కుతున్నట్టు చూశారు నావేపు.

"అరుణా" గొంతు చించుకుని అరచిన అరుపుకు గదిగుమ్మం దగ్గర ఆగి పోయాను.

"మొండిగా మాట్లాడకు. ఆలోచించి మాట్లాడు, పది వేలంటే మాటలుకాదు "

"పాతికవేలు అయినా సరే నా జవాబు యిదే "

యింకొక్క క్షణం అక్కడ నిలబడలేదు నేను.

ఆ రాత్రికి యిక వంటింట్లోంచి బయటికే రాలేదు.

వుదయం లేచాక మా మధ్య మళ్లా ప్రచ్ఛన్న యుద్ధం మొదలయింది.

అతను పలుకరించలేదు. నేనూ పలకలేదు.

యిలా మౌనంగా వుండడమే మంచిదనిపించింది.

మౌనంగానే భోజనం వడ్డించాను.

వులుకూ పలుకూ లేకుండా మాట్లాడకుండానే తిని లేచి ఆఫీసుకి వెళ్ళిపోయారు.

పిల్లలు స్కూళ్లకు వెళ్లిపోయారు.

ఎక్కడ కూర్చున్నా, పడుకున్నా మనసుని తినేసే ఆలోచనలు

గుండెల్లో ఆవేదన.

యీ ఒడిదుడుకుల ప్రయాణం ఎన్నాళ్ళు జరుగుతుంది? ఎలా సాగుతుంది.

యీ ఆలోచనలకి దారి తెన్నూ లేదు.

మనిషికి కావలసిందేమిటో తెలుసుకోకుండా వెర్రి పరుగులు తీస్తున్న ఆయన్ని మళ్ళించడం ఎలా.

ఇలా మలుపులు తిరిగిపోతున్న నా జీవితానికి గమ్యం ఏమిటి?

సముద్రంలో అలల లాగా మనసులో ఆలోచనలు, తలలో ప్రశ్నలు అల్లకల్లోలంగా చెలరేగుతున్నాయి.

వీటి బారినుండి తప్పించుకోటానికి పని మొదలుపెట్టాను.

చేసిందే చేసి, సర్దిందే సర్ది సాయంత్రం పిల్లలు వచ్చేదాకా ఎలాగో గడిపాను.

పద్మ స్నేహితురాలిని అడిగి నోట్సు తెచ్చుకోవాలంటూ వెళ్ళింది

పిల్లలు ముగ్గుర్నీ చుట్టూ కూర్చోబెట్టుకుని కబుర్లు చెబుతున్నాను పెరట్లో తోటలో కూచుని.

ఆఫీసునుండి ఆయన రావడం కనిపించింది.

పిల్లల్ని మాట్లాడుతూండమని నేను లోపలికి వెళ్ళాను.

అప్పుడే కనిపించింది మావారితో కూడా మరో అతను రావటం.

చప్పున లోపలికి వెళ్ళిపోబోయాను.

"అరుణా కిన్న నేను చెప్పానే వీరిని గురించే. సార్ మా ఆవిడ అరుణ" పరిచయం చేస్తున్నారు నవ్వుతూ.

ఆ కొన్ని క్షణాలు ముళ్ళ మీదున్నట్టు అనిపించింది.

'నమస్తే' అన్నాడు. తలెత్తి చూశాను.

"నమస్కారం" మర్యాదకి చేతులు జోడించాను. పెదవులు కదిలాయి కానీ శబ్దం బయటికి రాలేదు

తలెత్తి చూసిన ఆ ఒకక్షణంలోనూ గ్రహించాను నన్నో కొరుక్కుతినేలా చూస్తున్నాడని.

ఇంకొక్క క్షణం నిలబడలేదు నేను.

గబగబా వంటింట్లోకి వచ్చి నేలమీద కూలబడి పోయాను గోడనానుకుని.

'అంతగా చెప్పినా ఎందుకు యింటికి తీసుకు వచ్చినట్టు?'

'వివక ఏం చేస్తుందిలే అని ధైర్యమా?

"ఇంటికే తీసుకు వచ్చేస్తే అరిచి గోల చేయలేదులే" అనా, ఇన్నాళ్ళు చేయలేనిది యిప్పుడేం చేయగలదులే" అనే విబ్బరమా?

ఏ ధైర్యంతో తీసుకు వచ్చారు? నే నిప్పుడేం చేయాలి?

నా తల బ్రద్దలవుతుందేమోననేట్లు మెప్పి తీసుకుంది.

కోపంతో ఆవేశంతో నా ఒళ్ళు అదురుతోంది.

"అరుణా" హాలులోంచి కేక.

నేను పలకలేదు. పలకనవి తెలిసే వుంటుంది.

'బిస్కెట్లు, కాఫీ పట్టుకురా' మళ్ళీ అర్డరు.

'పనిలో వున్నాను వచ్చి తీసుకు వెళ్ళండి' కావాలనే విసురుగా అన్నాను.

లోపలికి వచ్చారు.

'తీసుకురమ్మని పిలుస్తుంటే కాస్తంతయినా మర్యాద లేకుండా జవాబు చెప్తావేం. అవతల పరాయి వాళ్ళుండగా' కోపంగా అన్నారు.

'మర్యాదస్తుల దగ్గిర ఎలా మసలాలో నాకు తెలుసు' ఇక్కడ గౌరవాలు, మర్యాదలు సభ్యత పాటించవలసిన పెద్దమనుషు లెవరూ లేరనీ తెలుసు."

"హద్దుమీరి వాగకు. ఆయనకి వినబడుతుంది."

"వినబడితే మరీ మంచిది." విసురుగా అన్నాను.

"అరుణా ఆవేశపడకు నా మాట విను. ఈ ఒక్కసారికి అంగీకరించు. నిన్ను చూసేవరికి జావగారిపోతున్నాడు. యిక అతడి ఒడిలోనే వాలావంటే....

"ఛీ మీరూ ఒక మగవాడేనా" మనసులో చాలా రోజులుగా తొలుసు యటికి రావాలని పదేపదే ప్రయత్నించిన మాట ఆ క్షణం వచ్చేసింది.

"లక్షసార్లు చెప్పాను. యింక యిలా జరగదు జరగటానికి వీలులేదు. మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండి. మర్యాదగా అతడిని బయటికి పంపండి. మీరు పంపలేకపోతే నేనే పంపిస్తాను."

అడుగు ముందుకు వేశాను.

ఛీ....నీవు మనిషివి కాదు." అంటూ

కాఫీ కప్పులు పట్టుకుని వెళ్ళిపోయారు.

బాణం దెబ్బతిన్న పిట్టలా గిలగిల లాడింది నా మనసు.

అవును....అవును....నేను మనిషిని కాదు....నేను మనిషిని కాదు. ఏనాడు నేను మనసు చంపుకున్నానో ఆ నాడే నేను మనిషిగా చచ్చిపోయాను. శిలగా మారిపోయాను. చివరకు నేను 'మనీ' సంపాయించే 'షి' గా మారిపోయాను.

గుండెలో విపరీతమయిన బాధ. గోడ కానుకుని కళ్ళు మూసుకుని కూలబడి పోయాను

హాల్లోంచి వాళ్ళ మాటలేవో వినపడుతున్నాయి. ఫలాన అని తెలియటం లేదు. అసలు ఆ మాటలమీద ధ్యాసలేదు నాకు.

నాకోసం చాలాసేపుగా పెరట్లో ఎదురు చూసిన పిల్లలు లోపలికి వచ్చారు.

వాళ్ళని పరిచయం చేస్తున్నారు ఆయన

పిల్లల్ని సంకరిస్తున్నాడు ఆ మృగం.

"మా పెద్దమ్మాయి పేరు పద్మ

యీ మాటలు విని చివ్వున లేచి గుమ్మం దగ్గరకు వచ్చి చూశాను.

పద్మ ఇప్పుడే వచ్చింది.

'నమస్తే' అంటోంది చేతులు జోడించి.

ఏం చదువుతున్నావు బొంగురు గొంతు అడుగుతోంది.

వాడి నోరయితే మాట్లాడుతోంది కానీ వాడి కళ్లు ఆ పిల్లని తింటున్నట్టు చూస్తున్నాయి. బట్టలు వలిచి చూస్తునట్లున్న ఆ చూపులు నా ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్టనిపించింది.

'నైన్త్ క్లాసండీ'

'గుడ్. నీ పేరు పద్మ అన్నావు కదూ, చాలా అందంగా యిప్పుడే వికసిస్తున్న పద్మంలా వున్నావు' అని అచ్చం వాళ్ళ అమ్మలా వుంది కదూ అంటూ ఆయనకేసి చూశాడు.

ఆయన పొంగి పోతున్నారు. చిరునవ్వుతో తల వూపారు.

నా తలమీద నిప్పులు పోసినట్టు అనిపించింది.

'పద్మా! యిలా రా' గావుకేక పెట్టాను.

పరుగెత్తుకొంటూ లోపలికి వచ్చింది.



కోపంతో రుసరుస లాడుతున్న నా ముఖంకేసి ఆశ్చర్యంగా చూసింది.

'ఏమ్మా! ఎందుకంతలా కేక పెట్టావు'

ఛెళ్లుమని బుగ్గమీద ఒక్క చరుపు చరిచాను.

'అమ్మా' అంటూ బుగ్గ తుడుముకుంది.

నా గుండెలు ఎగిసి పడుతున్నాయి.

'ఎదిగిన పిల్లలు. పరాయి మగవాడిముందు నిలబడి అంతసేపు మాట లేమిటీ?'

నాన్నగారు....పరిచయం చేస్తుంటే....

దాని కంఠంలో దుఃఖం పొంగుతోంది. దాని కళ్ళలో గిర్రున తిరిగిన కన్నీళ్లు కందిన బుగ్గలమీదుగా జారిపడ్డాయి.

ఆ జారుతున్న కన్నీళ్ళను చూసేసరికి వాటితోపాటు అప్పటిదాకా రెగుతున్న కోపం, పొంగుతున్న ఆవేశం చప్పున జారిపోయాయి.

'పద్మా'

అంటూ నా గుండెలకు అదుముకున్నాను

నా గుండెల్లో కరుడుగట్టిన దుఃఖం కరుగుతోంది. కరిగి కరిగి ప్రవహిస్తోంది.

అది బయటకు రావడానికి మరో మనిషికో పంచుకోటానికి అవకాశం వచ్చే వరికి వెల్లువలా పొంగుతోంది

ఎప్పుడొచ్చారో ఏమో పిల్లలు తెల్లముఖం వేసుకుని మా వేపే చూస్తున్నారు.

హాలులో మాట్లాడుతూండిన వాళ్ళిద్దరూ ఎప్పుడు లేచి వెళ్ళిపోయారో గమనించనే లేదు

వెక్కుతూనే ఒకోక్కముద్దా తింటున్న పద్మని చూసి నా కడుపులో దేవినట్లయింది

ఆ దుఃఖంలో అన్నం దిగటం లేదు దానికి.

నన్ను నేను నిందించుకున్నాను.

నా ఆవేశానికి, అర్థంలేని ఆగ్రహానికి నాపై నాకే కోపం వచ్చింది.

దానికేం తెలుసు?

అది ఏం అపరాధం చేసిందని నేను అంతలా కొట్టాను?

పద్మ పక్కనే పడుకుని అది నిద్రపోయేదాకా దానిమీద చెయ్యి వేసుకుని ఒళ్ళు నిమురుతూ వుండిపోయాను.

ఆ రాత్రి చాలా పొద్దుపోయాక వచ్చారు ఆయన

రాగానే వచ్చి పడక సర్దుకొని పడుకున్నారు.

'భోజనానికి లేవండి' అన్నాను.

"నాకు అక్కరలేదు."

మళ్ళీ అడగలేదు నేను.

ఆ రాత్రి కళ్ళు మూతలు పడలేదు నాకు.

పద్మన్న ఆ మనిషిని మళ్ళీ ఎందుకు తీసుకు వచ్చారనిగానీ, ఏం మాట్లాడారని గానీ అడిగే ఓపిక, వినే సహనం లేకపోయాయి.

ఆ ప్రపంచమే వద్దనుకున్నాను

మరునటిరోజు సాయంత్రం దాకా మామూలుగా గడిచిపోయింది.

ఇద్దరం బద్ధశత్రువుల్లా వున్నామే కాని బాహ్యాభర్తలుగా అనిపించటం లేదు.

అయినా నా ప్రాణానికి హాయిగానే అనిపించినట్లయింది.

ఆ వేళ సాయంత్రం దీపాలు పెట్టాక వంట మొదలుపెట్టాను.

కూర వేయిస్తున్నాను.

పిల్లలు హాల్లో తలో మూలకి కూర్చుని చదువుకుంటున్నారు.

ఆయన బయటనుంచి గబగబా వచ్చారు.

చెప్పుల చప్పుడు వినిపించినా నేను తొంగి చూడలేదు.

కాని నా చెవులు అక్కడి శబ్దాంకేసే కేంద్రీకృతమయి వున్నాయి.

"పద్మా ఆయన పిలిచారు "

నా చెవులు రిక్కించాను.

"చప్పున ముస్తాబు చేసుకుని తయారవు. ఒక చోటికి తీసుకువెడతాను." అంటున్నారు

వంటింట్లోంచి మెరుపులా వచ్చాను.

"ఎక్కడికి ఎంత మామూలుగా, సౌమ్యంగా అడగాలని ప్రయత్నించినా నా కంఠం కరుకుగానే పలికింది.

"పనుంది. ఇప్పుడే వచ్చేస్తాం" ఆయన గొంతులో ఆత్రుత ఎక్కడో వెళ్ళడానికి ఆలశ్యమయి పోతోందన్న తొందర.

"ఏమిటా పని?"

"బజారులో కొంచెం పని వుంది . "

"చూడండి నాకూ వంటయిపోయింది. నేనూ పిల్లలు కూడా వస్తాం పదండి."

కసిగా కలబడుతున్నట్లున్న మా యిద్దరికేసి చూస్తూ పిల్లలు అలాగే విలబడి పోయారు.

'పద్మా! నీకేం చెప్పాను. త్వరగా బట్టలు మార్చుకుని తయారుకా ఆయనలో అసహనం.

నా కాళ్ళకింద నిప్పులు పోసినట్టయింది

"లేవండ్రా పిల్లలూ, అందరూ చెప్పులు వేసుకోండి బయలుదేరుదాం." వున్న పళంగా అర్లే ఆ చీరతోనే, నేనూ సిద్ధమయి చెప్పులు తొడుక్కున్నాను.

మింగేసేలా చూస్తున్నారు నావేపు.

"అరుణా! నేను పద్మను తీసుకు వెడుతున్నానని చెప్పాను మిమ్మల్నికాదు."

"మేమూ వస్తున్నాము. దాన్ని ఒక్కతేనే తీసుకువెళ్ళటానికి వీలులేదని నేనూ చెప్పాను "

"మతిగాని పోయిందా నీకు?"

"యింకా పోలేదు. మీ దయవల్ల యికమీద పోవచ్చు."

'ఛీ' అన్నారు.

నా ముఖాన వుమ్మినట్టు బాధపడ్డాను. అయినా నేను విరమించలేదు. కొన్ని క్షణాలు ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయారు.

పిల్లల ముందు యిలా కొట్లాడుకోటం నాకూ అసహ్యంగానే వుంది. కాని పరిస్థితి తీవ్రంగా వుంది.

ఆయన నెమ్మదిగా లేచి గదిలోకి వెళ్ళారు.

పిల్లల్ని చదువుకోండని సైగచేసి నేను అలా గుమ్మం దగ్గరే నిలబడ్డాను. పిల్లలు అయోమయంగా పుస్తకాలు తెరిచారు.

"అరుణా! యిలారా" గదిలోంచి పిలుపు.

లోపలికి వెళ్ళాను. తలుపులు మూశారు.

"ఎందుకలా మొండికెత్తుతావ్" అన్నారు.

బుస్సున కోపం పొంగింది. అయినా అతి ప్రయత్నం మీద నిగ్రహించు కున్నారు

'మీరు పద్మ నెందుకు బయటకి తీసుకు వెళ్ళాలనుకున్నారు? ఎక్కడికి"

"వూరికేనే. అలా బజార్లోకి...."

"బుకాయించొద్దు. యీ వేళప్పుడు ఆ పిల్లని తీసుకుని అలా బజార్లోకి వెళ్ళాల్సిన అవసరం ఏమిటి? చంటిపాప ఏడుస్తూంటే షికారు తీసుకు వెడతారు. ఎడపిల్లలు సరదా పడితే బజారులో అలా తిప్పుకొస్తారు. కాని పద్మ చంటిదీ కాదు ఎడపిల్లా కాదు. ఎదిగిన ఆడపిల్ల. ఆ పిల్లని తీసుకుని చీకటి పడ్డాక యిప్పుడేం పనుందని బయట. మీరు నిజంగా సరదానే పడుతుంటే అందరం వెడదాం పదండి"

"అరుణా. యిన్ని మాటలెందుకు. పద్మను నేను ట్రావెలర్స్ బంగళాకు తీసుకు వెడుతున్నాను" ఎంత నిబ్బరంగా చెప్పాలని ప్రయత్నించినా ఆయన కంఠం వణికింది.

"ఏమన్నారు" అర్థం అయీ కానట్టుంది. లీలగా అనుమానంగా తోస్తున్నది. నమ్మలేకుండా వున్నాను.

"పద్మను ట్రావెలర్స్ బంగళాకు ఆ పెద్దమనిషి దగ్గరకు తీసుకు వెడుతున్నాను."

నా తల మీద పిడుగు పడినట్టు నా ఒళ్ళు దహించుకు పోతున్నట్టు అనిపించసాగింది.



"ఎందుకు" అడగటం కాదు అది. అరిచినట్లే వుంది.

"అరుణా! వూరికే గొంతు చించుకుని అరవకు. ఎంతగానో నిన్ను ఒప్పించాలనీ, యీ ఒక్కసారికీ నీ అంగీకారంతో, నీ సహాయంతో ఆ పదివేలూ తీసుకోవాలని ప్రయత్నించాను. బ్రతిమాలాను. కాళ్ళు పట్టుకున్నాను. ఎన్ని చేసినా నీవు వినలేదు."

"వినలేదని.... ...."

"నేను చెబుతున్నది కాస్త సావధానంగా వినడానికి ప్రయత్నం చెయ్యి. నీవు మొండికేశావు. తంతే గార్లె బుట్టలో పడ్డట్టు అవకాశం తన్నుకు వచ్చింది. అరుణా! సాయంత్రం వచ్చినతను ఒట్టి అధికారే కాదు. లక్షాధికారి కూడా. నిన్ను చూసి మోజుపడ్డాడు. జావగారి పోయాడు. నీనేమో కాదంటే కాదన్నావు. నేను ఎంత నీరుగారి పోయానో. అయినా అదృష్టం నా వైపు వుంది. అతనికి పెళ్ళీడు కొచ్చిన పిల్లలంటే బలే యిష్టంట. అందులోనూ కొత్తగా పెద్దమనిషి అయిందన్న పిల్లంటే పడిఛస్తాడుట అసలతను పద్మను చూసేసరికే..."

"మీరు మనుషులా? రాక్షసులా" ఆయన షర్టుకాలరు గట్టిగా పట్టుకుని గుంజాను. గొంతు పిసికి చంపాలన్నంత ఆవేశం వచ్చింది. పసిపిల్లంటే పడి చచ్చే ఆ కామపిశాచి రూపం గుర్తుకొచ్చింది ఏభై ఏళ్ళుంటాయి. బట్టతల. బొజ్జతో ఏనుగు గున్నలా వున్నాడు. వాడికి... వాడికి...

"ఆ ముసలి ముండాకొడుక్కి పాలుగారే పసిడి బొమ్మలు కావాలంటనా. వాడు 'నీ కూతుర్ని పంపించు' అంటే వాడి గొంతుపిసికి చంపిరాకుండా. ముక్కు

కసిగా అంటున్నారు. నా మీద కక్ష సాధిస్తూ అంటున్నారు.

"వీల్లేదు" కంఠనాళలు తెగేలా అరిచాను.

మీరు పద్మను తీసుకెళ్ళటానికి వీల్లేదు" అతని షర్టు పట్టుకొని గుంజాను.

"అరుణా! వదులు ముందు పద్మను తీసుకు వెళ్లాలి. తప్పదు. నేను మాట యిచ్చాను డబ్బు కూడా తీసుకున్నాను."

"ఛీ చండాలుడా . నీవే కన్న తండ్రివిరా ఎంత పాపం చేసుకుని నీ కడుపున పుట్టారురా

ఏడుస్తూ ముఖం బాదుకోసాగాను

ఆయన వెళ్ళబోయారు పాదాలు పట్టుకున్నాను.

"ఏమండీ... ఒక్కసారి ఆలోచించండి. ఒక మగవాడిగా, ఒక ఆడదానికి మగనిగా మీరు మీ ధర్మం, మీ కర్తవ్యము నిర్వహించలేదు కనీసం యిప్పుడు - ఒక కన్న తండ్రిగా నయినా మిమ్మల్ని మీరు నిలుపుకోండి."

నా కన్నీళ్ళతో ఆ పాదాలు కడగసాగాను.

"అరుణా ! వూరికే విసిగించకు. ఈ పని జరిగితీరాలి నీవు ఏడ్చినా మొత్తుకున్నా సరే" దృఢనిశ్చయం కనబడుతోంది మాటల్లో.

చివ్వున పైకి లేచాను. దుఃఖంలో! కోపంలో, ఆవేశంలో నా మాట తడబడుతోంది. నా గుండెలు ఎగసెగసి పడుతున్నాయి

"నా గొంతులో ప్రాణం వుండగా దాన్ని తీసుకు వెళ్ళడానికి వీల్లేదు."

"నీ ప్రాణం పోయినా సరే పద్మను తీసుకు వెళ్ళక తప్పదు."

అంత మూర్ఖంగా మాట్లాడొద్దు ఒక్కసారి బాగా ఆలోచించి చూడండి- అది పసిపిల్ల వాడు కామ పిశాచి అయినా లక్షణంగా పెళ్ళిచేసి మొగుడి వెంట పంపవలసిన కూతురిని . . .

"ఇప్పుడు మాత్రం ఏమయింది అరుణా ! ఒకసారి వచ్చి వెళ్ళినంత మాత్రాన పెళ్ళి కాకూడదనీ, అత్తవారింటికీ పంపకూడదనీ వుందా ! ఆ డబ్బుతోనే దాని పెళ్ళి చేసేస్తే సరి "

"ఛీ ఎంతకి తెగించారు ఎంత సులభంగా అంటున్నారు" యిక యీ మనిషిని మార్చడం యీ జన్మలో అయ్యే పని కాదు. ఆయనది గుండె కాదు అది నల్లరాతి బండ. దాని మీద కాసులు పడితేనే గలగలలు వినబడతాయి కాని కన్నీళ్లు పడితే నిశ్శబ్దంగా జారిపోతాయి. కన్నీళ్లతో తడవదు. కరగదు.

నా ఆలోచనలకి భంగం కలిగిస్తూ ఆయన తీస్తున్న తలుపు చప్పుడు వినిపించింది. యిక పద్మను తీసుకు వెళ్ళిపోతారు.

"ఓయి భగవంతుడా ఇప్పుడేం దారి... నాకేది దిక్కు" రివ్వున వెళ్ళి ఆయన చెయ్యి పుచ్చుకు లాగాను.

"అరుణా ! పూరికే విసిగిస్తూ ఆలస్యం చేయకు అవతల టైం అయింది" విడిపించుకుని వెళ్ళబోయారు

"సరే మీ యిష్ట ప్రకారమే జరగనివ్వండి నేను మిమ్మల్ని అడ్డు పెట్టలేనని తెలిసిపోయింది. అయితే యివాళ మాత్రం వద్దు దయచేసి యీ మాటయినా వినండి"

"ఏం యివాళ ఎందుకని వద్దు ఇప్పుడే తీసుకొస్తానని చెప్పి వచ్చాను"

"నిజమే. మీకు తెలియదు గనుక అలా చెప్పి వచ్చారు కాని అది పద్మ జ్వరంతో బాధపడుతుంది మూడు రోజులుగా. యివ్వాళ రేపు కుదరదు. ఎల్లుండి తప్పకుండా తీసుకు వస్తానని చెప్పిరండి. ఈలోగా నేను దానికి ఆ మాట యీ మాట చెప్పి కొంత భయం పోగొడతాను. లేకపోతే పసిపిల్ల ఒక్కసారిగా మీదపడితే బెదరవచ్చు కూడా సరేనా ? ఈ మాట నయినా ఒప్పుకోండి"

నా మాటలు విని కొన్ని క్షణాలు ఆలోచించారు

"నిజమే అరుణా. యిప్పుడు తీసుకు వెళ్ళినా బావుండదు నీవు చెప్పినట్టే చేద్దాం. ఆ మాటే చెప్పివస్తాను" విసవిసా బయటికి వెళ్ళిపోయారు.

ఈ పోట్లాట, గందరగోళం అర్థం కాకపోయినా మా యిద్దరి మధ్య ఏదో పెద్ద యుద్ధం జరిగిందని పిల్లలకు తెలిసిపోయినట్టుంది బిక్కముఖాలు వేసుకుని కూచుని వున్నారు

వాళ్ళకి అన్నాలు పెట్టేసి పక్కలు పరిచేశాను

పద్మని చూస్తూంటే నా గుండె తరుక్కుపోతోంది

యిప్పుడు వెళ్ళిన యీయన యిప్పుడిప్పుడే యింటికి వస్తారనే ఆశలేదు. యింకాసేపు రాకుండా వుంటేనే బావుండు ననిపించింది ఆ ముఖం చూడాలని లేదు ఆయనతో మాట్లాడాలంటేనే, ఆ మనిషి సాన్నిహిత్యాన్ని భరించాలంటేనే కష్టంగా వుంది. అసహ్యంగా వుంది నరరూప రాక్షసుడిగా మా శ్రీమే నాకళ్ళకు కనబడుచున్నారు అంత బాధలోనూ, ఆవేశంలోనూ నాకు మగత కమ్మేసింది

బాగా నిద్ర పట్టేసింది.

ఎప్పుడో అర్థరాత్రి తలుపు తట్టారు

కష్టం మీద వెళ్ళి తీశాను

ఆయన్ని చూస్తూంటే, సాయంత్రం ఆయనన్న మాటలు గుర్తుకొచ్చి అసహ్యం వేస్తోంది






భోజనానికి రమ్మని కూడా పిలవాలనిపించలేదు.

మాట్లాడకుండా లోపలికి వడిచాను

నా భుజం మీద చెయ్యి వేశారు.

"అరుణా నా కోసం ఆయనెంతగా ఎదురు చూస్తుండినాడో తెలుసా. నేనీ మాట చెప్పేసరికి పాపం హతాశుడయిపోయాడు అయినా ఎల్లుండే కదా ఒక్క రోజు మధ్యలో అని ఒప్పుకున్నాడు అసలు " ఏదో చెబుతూనే వున్నారు

నా చెవులు వినడం మానేశాయి

'ఒక్క రోజే కదా మధ్యలో' నా గుండెను తొలుస్తోంది యీ మాట.

'ఆ ఒక్క రోజు' గడిచిపోతే

నా బిడ్డ .. నా కన్నకూతురు ఆ పులి పంజాలో యిరుక్కుని గిలగిల లాడవలసిందేనా?

"ఏమిటి అరుణా మాట్లాడవు "

"అబ్బే ఏంలేదు యివాళ చాలా అలసటగా వుంది. నిద్ర వస్తోంది."

"సరే రేపు మాట్లాడుకుందాం వెళ్ళి పడుకో."

వచ్చి పిల్లల మధ్య పడుకున్నాను

క్షణాల మీద నిద్రలో మునిగిపోయారు ఆయన

'నాకేనా యీ బాధ?'

ఆయన కే బాధ లేదా

'వుంటే అలా హాయిగా నిద్ర పోగలుగుతారా?

నా గుండెల్లో రగులుతున్న సెగలూ పొగలూ ఆర్పేందుకు గానీ, నా కన్నీరు తుడిచేందుకు కానీ, నన్ను ఓదార్చేందుకు కానీ ఏదేవుడూ దిగిరాడు

నా మనసూ, శరీరమూ కూడా విలువునా దహించుకు పోతున్న యీ జ్వాలల మధ్య నాకు నిద్ర ఎలా పడుతుంది

ఈ రోజుకి గండం గడిచింది

కాని కాని రేపు

కంటిమీద రెప్ప వేయకుండానే తెల్లారిపోయింది

తనకు ముంచుకువస్తున్న ఆపద గురించి సూచనగానయినా తెలియని పద్మ లేడికూనలా గెంతుతోంది చిలుకలా మాట్లాడుతోంది కోయిలలా పాటలు పాడుకుంటోంది.

ఇవన్నీ కలలా కరిపోతాయని, తన బ్రతుకు నిర్జీవమైపోతుందనీ ఆ పిల్లకి తెలియటంలేదు

తెలిసిన నేను చిత్రవధ అనుభవిస్తున్నాను

ఎట్లా తిరుగుతున్నానో, యింట్లో పని ఎట్లా చేశానో నాకే తెలియటం లేదు. ఏ పనిచేస్తున్నా ముల్లులా పొడుస్తున్న బాధ

ఏంచేయాలి? ఏంచేయాలి ఆ పసిపిల్ల పాడైపోతుంటే చూస్తూవూరుకోనా? నేను భరించగలనా?

ఆలోచనల తీవ్రతతో నా మస్తిష్కం వేడెక్కిపోయింది. ఏ క్షణాన అయినా తల పగిలిపోతుందేమో, యీ గుండె బ్రద్దలయి పోతుందేమో, ననిపించేట్లు విపరీతమయిన బాధకు లోనయాను

రోజంతా మరెందులోనూ ఎలాంటి మార్పూలేకుండా గడిచిపోయింది ఆవేళ రాత్రి పదిగంటలయినా యింటికి రాలేదు ఆయన

చిన్న పిల్లలమీద చేతులువేసుకుని వాళ్ల మధ్య పడుకున్న నేను తదేకంగా పద్మకేసే చూడసాగాను

మరునటిరోజు పరీక్షదో వుందని హాల్లో కూర్చుని దీక్షగా చదువుకుంటోంది. ఆ పిల్లని చూస్తున్నకొద్దీ నా దుఃఖం ఆగటంలేదు.

నా కడుపులో మండుతున్న మంటలకు, నా గుండెల్లో ఆవేదన కరిగి మరిగి ఆవిరైపోయి కళ్లలోకివచ్చి, అక్కడ చల్లబడి కన్నీళ్లుగా కురుస్తోంది

నాలో పేలుతున్న అగ్ని పర్వతాల ధ్వనినీ, నేను పొందుతున్న యీ హింసనీ ఎరిగినవాళ్లు ఎవరు?

ఎవరితో చెప్పుకోగలను?

ఎవరితో చెప్పుకుంటే తీరుతుంది?

పద్మ పైట పక్కకు తొలగింది

తొలగిన పైటను సర్దుకుని సరిగ్గా వేసుకోటంకూడా యింకారాని పసిపిల్ల. కసికాయలాంటి ఆ లేత పరువాన్ని, మొగ్గలాంటి ఆ పసితనాన్ని, ఆ పిశాచి కరుకు కసాయి చేతుల్లో

'అబ్బ' వూహించంలేక పోయాను

నా గుండెల్లో నొప్పి వస్తుంది

ఆ వూహే నేను భరించలేక పోతున్నాను

వూహే అంత భయంకరమైతే వాస్తవాన్ని తట్టుకోటం ఎలా?

మొగ్గలాంటి పిల్ల బలవంతగా రేకులు విప్పదీయ బడితే

రేకులు రాలిపోయి తొడిమ విరిగిపోయి

జీవచ్ఛవంలా అది తిరిగివస్తే దానిముఖం కన్నతల్లిగా నేనెలా చూసేది? ఏమని ఆ పసిదాన్ని ఓదార్చేది?

'భగవంతుడా ఏ కన్నతల్లికీ యిటువంటి శిక్షను విధించకు తండ్రీ' చేతుల్లో ముఖం కప్పుకుని కుళ్లి కుళ్లి ఏడ్చాను.

పద్మ లైటార్పేసి పడుకుందుకు వచ్చింది.

వెక్కిళ్లు ఆపుకున్నాను.

పెదాలు బిగబట్టి దుఃఖాన్ని లోలోపలే అనుచుకున్నాను

'అమ్మా కాస్త జరగవూ.'

మీద చెయ్యివేసి చప్పున వెనక్కి లాక్కుంది.

"అమ్మా ... నీ ఒళ్ళేమిటి యిలా కాలిపోతోంది. జ్వరం వచ్చినట్టుంది." నుదుటి మీదా, చంపల మీదా చేతులువేసి చూస్తూ అంది.

'పద్మా ....' దాని చేతులు పట్టుకున్నాను.

యీ ఒళ్ళే కాదమ్మా.... యీ గుండెలు, యీ మనసు, యీ కడుపుకూడా కాలిపోతోంది తల్లీ' అని చెప్పి దానిఒళ్లో పడుకుని భోరున ఏడవాలనుకున్నాను.

కాని... ఆ పిల్లకేం అర్థమవుతుంది. నా బాధను అర్థంచేసుకుని దాన్ని రూపుమాపగల శక్తి ఆ పిల్లకి ఎక్కడిది?

ప్రక్కకు జరిగాను.

నా మీద చేతులువేసుని ప్రక్కనే పడుకుంది.

దాని నడుంమీద నేనూ చేయి వేశాను.

మెత్తగా పువ్వులా వుంది దాని ఒళ్లు

క్షణంలో నిద్రలోకి జారిపోయింది అది.

ఆ పసిదాని ముఖంలోకే చూస్తూ వుండిపోయాను.

నా చేతులు ఆ పిల్ల తలనీ, ముంగురులనీ, చెంపలనీ, భుజాలనీ ప్రేమగా, ఆప్యాయతగా స్పర్శిస్తున్నాయి.

రేపు రాత్రికి.... రేపు రాత్రికి....

యీ పిల్ల ఆ రాక్షసుడి ప్రక్కన.... నలిగిపోయి.... వదలిపోయి....

అసలు.... వాడి చేతుల్లో పడ్డాక.... యిది ప్రాణాలతో వుంటుందా పులి నోటికి చిక్కిన లేడిపిల్లలా గిలగిల కొట్టుకుంటుందో ఏమో ?

'అమ్మా.... అమ్మా.... అని యీ దౌర్భాగ్యురాలయిన తల్లికోసం ఏడుస్తుందా ? తనని రక్షించమని కనిపించని భగవంతుడిని పిలుస్తుందా ?

భయంతో దీని గుండె ఆగిపోదుకదా....

పదే పదే నా కళ్ల ముందు ఆ దారుణమైన దృశ్యం వివిధ రూపాలుగా కనబడుతోంది.

వూహించకుండా వుండలేక పోతున్నాను

భయంకరమైన ఆ వూహాలను భరించలేక పోతున్నాను

వీల్లేదు.... వీల్లేదు .. యిలా జరగడానికి వీల్లేదు....

అయితే.... ఏంచేయటం.... ఎలా తప్పించం....

ఎక్కడికయినా పంపించేస్తే...

ఎక్కడికి.... ఎక్కడికి... ఎవరున్నారని...

యీ విశాల ప్రపంచంలో యిలాంటి లేడిపిల్లలకోసం ఎన్ని పులులు కాపువేసి వుంటాయో.

అభం శుభం తెలియని యీ పిల్ల ఏమవుతుంది. వీశ్శేమయినా అయితే నేను భరించలేను. కాదు .. అలాకాదు .... మరోమార్గం చూడాలి. వెంటనే.... వెంటనే....ఈ రాత్రి తెల్లవారకుండానే ...రేపనేది తిరిగి రాకముందే....

యీ పాపకూపం నుంచి తప్పుకోవాలి.

యీ ఘోరాలన్నీ చూడగలిగే మనస్థయిర్యం నాకు లేదు.

మొగ్గగా నే చిదికిపోయిన నా బిడ్డకి నేను రోజూ కళ్ళారా చూస్తూ బ్రతకలేను.

ఇన్నాళ్ళు నేను యీ తప్పుడు పనులు చేసింది, యింత మానసిక క్షోభని



అనుభవించిందీ యీ కన్నబిడ్డల బ్రతుకుకోసం....వాళ్ళ బంగారు భవిష్యత్తు కోసం....

కాని .... కాని .... యిప్పుడు నా కళ్ళముందే వాళ్ళ బ్రతుకు బద్దలవుతుంటే వాళ్ళ జీవితపుబాట ప్రమాదుల్లోకి తీసుకువెళుతూంటే భరించే శక్తి నాకులేదు.

ఇప్పటికే తూట్లుపడి చితికిపోయి వున్న యీ గుండెలు జరగబోయే దారుణాలు భరించలేవు.

ఆ శక్తి యిప్పుడు నాకు లేదు.

ఆ సహసం పోయి కూడా చాల కాలమయింది.

ఈ ఘోరం చూడకుండా వుండాలంటే ఒక్కటే మార్గం....

అవును. బాగా ఆలోచించాను. వికితంగా....పదే పదే అదొక్కటే.

నాకు కనబడిన మార్గం. వేరే గత్యంతరం లేదు.

ఇప్పుడే యీ క్షణాన్నే యింత విషమేదయినా మింగేస్తే..

యీ పాపకూపం నుండి క్షణాలమీద తప్పుకోవచ్చు.

యీ ఘోరాలన్నీ చూడాల్సిన బాధ వుండదు.

నా గుండె దిటవు చేసుకున్నాను. నేను తీసుకున్న నిర్ణయం సరైంది అనే అనిపించింది. ఆయన యింకా యింటికి రాలేదు.

వచ్చేలోగా నిర్ణయం అమలు జరిగిపోవాలి. ఆలశ్యమయితే కుదరకపోవచ్చు.

పక్కమీది నుండి దిగాలున లేవబోయాను. సాధ్యంకాలేదు.

జ్వరం బాగా వచ్చినట్లు వుంది. ఒళ్ళంతా ఒకటే నొప్పులు.



యీ మాత్రలు మింగేసి నా దారి నేను చూసుకుంటే నేను ప్రేక్షకురాలిగా వుండే దుస్థితి తప్పవచ్చు కాని ఆ నాటకం మాత్రం ముగిసిపోదు

ఆ ఘోరం జరక్కుండా ఆగిపోదు. మరి....మరి.... నేను వాళ్ళకు చేయ గలిగింది ఏం లేదా? ఏం చేయలేనా?

ఆ పులి నోటికి చిక్కకుండా ఏం చేస్తే నా బిడ్డ బయటపడుతుంది.

యీ దారుణాన్ని ఎలా తపిప్పించేది. నాలాగా నా పద్మకూడా చెడిపోవలసిం దేనా? ఆ రాక్షసుడి చేతుల్లో ఆ పసిపిల్ల నలిగిపో వలసిందేనా? వాడి కబంధ హస్తాల్లో దాని ప్రాణాలే పోతే....!

మెరుపులాంటి ఆలోచన వచ్చింది నాకు. నన్ను నేనే అభినందించుకున్నాను.

ఆ పాడు బ్రతుకువెళ్ళదీయడం కన్నా చావే నయం

దారుణమయిన హింసకు గురికావటం కన్న క్షణాలమీద ప్రాణం పోగొట్టు కోడం మంచిది.

నా గుండె నిబ్బరం నాకే ఆశ్చర్యం కలిగించి.

'పద్మని నాతోపాటు తీసుకుపోవాలి. ఈ విషం ఈ యిద్దరి ప్రాణాలూ ఒకసారి హరిస్తుంది. వేల రూపాయలకోసం ఆయన కంటున్న కలలు సమూలంగా బూడిదయిపోవాలి అదే ఆయనకి తగినశాస్తి. అదే మాకు శరణ్యం.

నిద్రలోవున్న పద్మనిలేపి మాత్రలు చేతికిస్తే నివాలక్ష ప్రశ్నలు వేయమా? గబగబా వంటయింట్లోకి వెళ్లాను. స్టౌవెలిగించి నీళ్ళు పడేశాను.

ఒక కప్పు బోర్నవిటా కలిపాను.

తీసుకువచ్చి టేబిలుమీద పెట్టి నిద్రమాత్రలు పొడిచేయడానికి సాధనకోసం చూస్తూ పద్మకేసి మళ్లీ ఒకసారి చూశాను.

అమాయకంగా నిద్రపోతోంది. ఆ ముఖం ఎంత నిర్మలంగా, ఎంత ప్రశాంతంగా ఎంత కళగా వుంది.

రేపు వుదయానికి ఆ లేతశరీరం నాతోపాటు నిర్జీవమయి వుంటుంది.

అయినా ఫరవాలేదు. రేపు రాత్రిదాకా అది బ్రతికివుంటే మాత్రం బ్రతుకంతా జీవచ్ఛవం లాగానే గడపాల్సి వస్తుందది.

మాత్రలు పొడిచేశాను.

పిల్లలు కదిలినట్లయింది. చప్పున వాటిని అక్కడే వదిలేసి మంచందగ్గరగా వచ్చాను.

ఏ క్షణంలో నయినా ఆయన వచ్చేస్తారేమోనని భయంగానూ, ఆత్రంగానూ వుంది. ఆయనొచ్చేస్తే యిక నా ప్రయత్నం సాగదు.

కదిలి అలాగే సర్దుకుని పడుకున్నారు పిల్లలు.

పద్మ మెడమీదుగా తన చెయ్యి చుట్టి పడుకుంది. తర్వాత పిల్ల 'వుమ' యిద్దరూ ఒక్కలాగే వున్నారు. సంవత్సరమే తేడా. యిదీ యివాళో.... రేపో ఎదుగుతుంది....

యీ మాట స్ఫురించగానే నా గుండె కొన్ని క్షణాలపాటు ఆగి పోయినట్టయింది.

నా ప్రతిరూపాలు నా కళ్ళముందు వెక్కిరిస్తున్నట్లు కనిపించాయి. ఇవాళ పద్మ.... రేపు వుమ.... ఆ తరువాత మధ.

వీళ్ళు ముగ్గురూ ఆడపిల్లలు పెరుగుతారు... ఎదుగుతారు...

తరువాత....

ఇవాళ నేను పద్మని యీ వుచ్చులో పడకుండా తప్పిస్తున్నాను. నేను తప్పుకుంటాను. ఆ తరువాత యీ యిద్దరు ఆడపిల్లలు....

ఆ తండ్రి చేతుల్లో వీళ్ళకు మాత్రం ఆ దుస్థితి కలగదని నమ్మకం ఏమిటి? వీళ్ళని ఎవరు తప్పించ గలరు?

ధన దాహంతో కొట్టుకు చస్తున్న ఆ తండ్రి వీళ్ళని మాత్రం సొమ్ము చేసుకోకుండా వుంటాడా?

వీళ్ళ జీవితాలూ నలుగురి చేతుల్లో పడి నలుగుతూ దుర్భరం కావలసిందేనా?

హఠాత్తుగా వచ్చిన ఆలోచనంతో, ప్రశ్నలతో నాకు పిచ్చి పట్టినట్టయింది.

మరి యిప్పుడేమిటి మార్గం? ఏం చేస్తే యీ సమస్య తీరుతుంది. ఏదో ఒకటి త్వరగా నిర్ణయించుకోవాలి. అమలు జరిపేయాలి. ఏ మాత్రం ఆలశ్యం కూడదు.

సముద్రం లోని సుడి గుండాలులా నా ఆలోచనలు అక్కడి కక్కడే తిరుగుతూ బయట పడలేక నా మనసు అల్లకల్లోలమై పోయింది. వ్యవధి లేదు. నా ఆలోచనలు ఒక కొలిక్కి రావటం లేదు. ఎంత తొందరగా నిర్ణయం తీసుకుంటే అంత మంచిది.

ఏమని.... ఏమని...

తల ఒక్కసారి విదిలించాను. కల్లోల పడుతున్న ఆలోచనలను, ఒకమూలకు నెట్టాను రెండు క్షణాలు శాంతంగా ఆలోచించాను.

అంతే... నా సమస్యకి పరిష్కారం లభించింది.

అది సరైందా? కాదా... అంటూ చర్చించుకునే వ్యవధి లేదు యింక.

నేనూ, పద్మ మాత్రం తాగితే చాలదు.

అందరికీ తలా కాస్త విషం యిచ్చేస్తే వాళ్ళకి బాధలుండవు.

తనకీ వీళ్ళ గురించిన వేదన వుండదు. తృప్తిగా చావొచ్చును.

ఆయనొక్కడే ఆ డబ్బుతో స్నానం చేయనీ, ఆ డబ్బునే భోంచేయనీ, ఆ డబ్బుతోనే నిద్రపోయి, ఆ డబ్బుతోనే సమాధి పేర్చుకోనీ.

పద్మని లేపటం మానేశాను. ముందు అందరికీ యిచ్చేలా బోర్న్విటా తయారు చెయ్యాలి. యీ పది మాత్రలూ చాలవు. కొత్తగా యీ మధ్యే కోటలో ఎలుకలు చంపడానికని కొన్న మందు గుర్తుకొచ్చింది.

ఆ మందే ప్రస్తుతం మా అందరి పాలిటి వరం.

మందు పొట్లమూ, నూరిన మాత్రల పొడి పట్టుకుని నేరుగా వంట యింట్లోకి వెళ్లాను. అప్పటికే కలిపివుంచిన కప్పులోని బోర్న్విటా చప్పచల్లారి వుంది. స్టౌ అంటించి నీళ్లు పాలు కలిపి స్టౌమీద పెట్టాను.

ఎలుకల మందు, నిద్రమాత్రల పొడి అక్కడున్న డైనింగ్ టేబులు మీద పెట్టాను.

నీళ్ళు కాగేదాకా అక్కడే నిలబడే శక్తి లేకపోయింది. నా పాదాలతో డైనింగ్ టేబిలు ముందున్న కుర్చీలో కూర్చున్నాను. తల టేబిలు మీదకి వాల్చి కళ్ళు మూసుకున్నాను.

యిప్పుడు నా కళ్ళలో తడి అయినా లేదు ఎందుకో నాకే ఆశ్చర్యం

వేసింది. వరుసగా పిల్లలందరికీ విషం యివ్వడానికి సిద్ధపడిన నా గుండెధైర్యం నాకే వింతగా వుంది.

పరిస్థితులు మనిషిని రాయిగా మారుస్తాయేమో.

నేనిప్పుడు రాయినే.

నా మనసు మరుభూమిలా ఎండి బీటయి వారిపోయింది

ఎంతకీ నీళ్ల కాగటం లేదనిపించింది. కాదు.... అవి కాగుతున్నాయి నాకే తొందర ఏ క్షణంలో నయినా ఆయన వచ్చేస్తారేమోనని ఒకవైపు, ఆలశ్యం జరిగితే ఏ క్షణం లోనయినా యీ గుండెస్థయిర్యం జారిపోతే, మమతానురాగాలు నా చేత యీ పని చేయించలేక ఆపేస్తే ఆ తరువాత జారిపోయిన యీ క్షణాల గురించి జీవితమంతా గడపవలసి వస్తుంది. నామనసు మారిపోకముందే, ఆయన వచ్చేయక ముందే యీ పని జరిగిపోవాలి.... జరిగిపోవాలి

లేచి స్టౌ ముందుకు వచ్చాను. నీళ్ళు మరగటానికి సిద్ధమవుతున్నాయి. పొగలు చిమ్ముతున్నాయి నా హృదయమూ అలాగే అగ్గి చిమ్ముతోంది. బోర్నవిటా చక్కెర. కప్పులు తెచ్చి స్టౌ దగ్గరగా పెట్టుకున్నాను. నా ఒంట్లో శక్తిలేనట్టు బరువంతా పాదాల్లోకి వచ్చేసినట్టు నిలబడటానికి చేతకావటం లేదు.

ఒంట్లో శక్తి నంతటికి కూడదీసుకుని అలాగే నిల్చున్నాను

నీళ్ళు మరుగుతున్నాయి గిన్నెలో. 'సల సల'మని మరుగుతున్న వాటిని చూస్తుంటే నా ఒంట్లో రక్తం అంతకన్న తక్కువేమీ మరగటం లేదు అని పించింది

గిన్నె దించబోయాను.

ఆ నీళ్ళల్లో ఎవరిదో తెలియని కొత్తముఖం కనిపించినట్టయింది నాకు.

ఎవరు.... ఎవరు .... ఎవరు .... ....

అలాగే మరుగుతున్న నీటికేసే చూస్తున్నాను. ఆ ముఖం నేనెప్పుడూ చూడ లేదు అయినా జాలిగా దీనంగా కనిపిస్తోంది, ఇలాంటి ముఖం నాకు పరిచయ మున్న వాళ్ళలో ఎవరికీ లేదే....

తదేకంగా కొన్ని క్షణాలు చూస్తూండిపోయాను.

మెరుపులా తట్టింది నా బుర్రకి. అవును. యిప్పుడు తెలిసింది. ఎవరో కాదు. నాలాంటి.... సరిగ్గా నాలాంటి ఒక అభాగ్యురాలు పేరూ, వూరూ, నాకూ తెలియదు, ముఖ పరిచయం కూడా లేదు మరి.... ఎవరయితేనేం నాలాంటి ఒక ఆడది. నాలాంటి ఒక అభాగ్యురాలు.

నేను నా పిల్లలు చచ్చిపోతే మాత్రమేం?

ఆయన డబ్బు సంపాదనకి మార్గాలే వుండవా? మనుషులే దొరకరా? ఈ దేశంలో రెండు పూట్లా కడుపునిండా భోజనం దొరుకుతుందంటే చాలు కాటికి పోయే వాడికి కూడా కాళ్లు కడిగి కన్యాదానం చేసే దౌర్భాగ్యులయిన తల్లి దండ్రులు ఎందరో వున్నారు.

మా వారి లాళ్ళు మాత్రం ఆ అదృష్టానికి నోచుకుని వుండవూ అందంగా .. ఎర్రగా బుర్రగా లావుగా దర్పంగా వున్న ఆయనకి 'కో' అంటే కోటిమంది వస్తారు పిల్ల నిస్తామని. ఆ కోటిమందిలో ఓ అభాగ్యురాలు యీయన చేత పురిత్రాడు తగిలించుకుంటుంది. ఆ పిల్లే ఆ భాగ్యురాలే దీనంగా నాకేసి చూస్తున్నట్లు అనిపించింది బహుశా యీ సంగతి నా మనసు మారు మూలల్లో ఎక్కడో మెదిలి వుంటుంది యీ గందరగోళంలో వెనక్కి పోయి యిప్పుడు చప్పున కళ్ళముందు మెదిలింది.

ఆ పురిత్రాడు తగిలించగానే యీయనకి ఆ ఆడదానిమీద సర్వాధికారాలు వస్తాయి. ఆ అధికారానికి లొంగి యీ యింటికి వస్తుంది ఆ అధికారానికి లొంగి నాలాగే యిలాగే చేతులు మారుతు ది నాలాగే బ్రతుకు బండలు చేసు కుంటుంది. మనసు ముక్కలు చేసుకుంటుంది. దానికీ పిల్లలు పుడితే వాళ్ళనీ యిలాగే యిలాగే యిలాగే వద్దు వద్దు కాదు.... యిలా జరక్కూడదు. భగవంతుడా ఏమిటి దారి? క్షణ క్షణానికి మారిపోతున్న నా మనసు ఎక్కడికి జారుతోంది యీ ఆలోచనలకు యీ సమస్యలకి అంతమే లేదా? ప్రతిసారీ యిలా ఏదో ఒక మార్పేమిటి? యింతకీ యిప్పుడు నేను తీసుకున్న నిర్ణయం అమలు పరుస్తానా లేదా!

ఎవరో, ఎప్పుడో యీ యింటికి రాబోయే నిర్భాగ్యురాలిని గురించి బాకెందుకు అనిపించింది క్షణం

మరు క్షణంలో 'వద్దు వద్దు భగవంతుడా.. మా ప్రాణాలు తీసేసు కోడమే గాక మరో ఆడదాని మెడకు పురి తగిలించి ఆమె జీవితం బలిచేయటం జరుగుతుంది. యిన్ని పాపాలు ఎలా మూట కట్టుకుని పోయేది.

అయితే యిప్పుడేమిటి దారి?

యీ అకృత్యాలని ఆపటం ఎలా?.... ఎలా... ఎలా..

నా తల సమ్మెటలతో కొడుతున్నట్టు, నా గుండెల మీద రైళ్ళు పరుగెడు తున్నట్టు నాకు దిక్కు తెలియకుండా పోయింది.

యిప్పుడో, యింకో క్షణంలోనో ఆయన వచ్చేస్తారు. ఈ సమస్యలకు పరిష్కారం వెదకటానికి ఎంతో వ్యవధి లేదు. యిప్పుడే యిప్పుడే యీ క్షణంలోనే తేలిపోవాలి.

వున్నట్లుండి నా బుర్రలో ఎదో మెదిలింది. నా ఒల్లు ఝల్లుమంది.

నా ఒంట్లో రక్తం గడ్డ కట్టుకు పోయినట్టు కొంతసేపు అలాగే నిలబడి పోయాను.

యిప్పుడు నా తలనిండా ఆలోచనలు లేవు. నా మనసు గజిబిజి పరుస్తున్న ఆందోళనలు లేవు. ఒక్కటే. ఒక్కటే తోస్తోంది నా మనసుకీ, మెదడుకీ కూడా.

అవును.... అదొక్కటే సరైన పరిష్కారం అదొక్కటే సరైన పరిష్కారం. నా గుండెల్లో మంట.... నా నరనరాల్లో ఆవేశం.. అయినా.. అయినా యింకేం ఆలోచించ లేదు నేను. యిక యీ ఆలోచనలు ముందుకు సాగేకొద్దీ నేనీ పని చేయలేను. ఈ గుండె యిప్పుడే బండగా వున్నప్పుడే యీ పని జరిగి పోవాలి. నిదానిస్తే యీ ధైర్యం జారిపోవచ్చు. ఏ బంధమో నన్ను జావకారి పోయేలా చేయొచ్చు. అలా జావకారి పోవడానికి వీల్లేదు. యీ నిర్ణయం సరైనదే.... యీ పరిష్కారం సవ్యమైనదే

నా ఒంట్లో సర్వశక్తులూ కూడా తీసుకున్నాను నాలో మొండితనమే నన్ను నిలబెడుతోంది నడిపిస్తోంది.

యింకేం ఆలోచించలేదు నేను.

ఎలుకల మందు తీసుకెళ్ళి అలమారులో దాచేశాను.

తిరిగి వంటింట్లోకి రాబోతుండగా నా కాళ్ళు పట్టేసినట్టు ఆగిపోయాయి.

"అ....రుణా " బయట పిలుపు. తలుపు మీద మునివ్రేళ్ళ చప్పుడు.

నా ధైర్యం నీరుగారి పోతోందా . ఆ పిలుపు తనని బంధిస్తుందా లేదు లేదు యింక తనకదీ బంధించలేరు.

వినవిసా వంటిట్లోకి నడిచాను'

గిన్నెలో నీళ్ళు వగానికి పైగా యిగిరిపోయాయి. గబగబ గిన్నె దింపాను. ఒక కప్పు నిండుకూ బోర్నీవిటా కలిపాను. పొగలు కక్కుతోంది. మాత్రలు పొడిచేసిన పొట్లం అందుకుని విప్పి మొత్తం అందులోకి కుమ్మరించేను.

ప్రక్కనే చేసి చాల సేపయినా బోర్నీవిటా చప్ప చల్లారివుంది.

"అరుణా అరుణా" యీసారి అసహనంగా గట్టిగా పిలిచే పిలుపుతో బాటు తలుపు బాదిన చప్పుడు.







"వస్తున్నా." గబగబ వెళ్ళి తలుపులు తీశాను. నా నుదురంతా చెమటలు పట్టి వుంది. అసలు ఒళ్ళంతా చెమటలు కక్కుతోంది.

బాగా త్రాగి వచ్చినట్టున్నారు. తూలుతున్నారు కూడా.

"తలుపులు బాదుతున్నా ఏమిటా మొద్దు నిద్ర? తీయడానికి యింత ఆలస్యమా?" నోట్లోంచి ముద్దుగా వస్తోంది మాట.

"నెంత ఆలస్యంగా వచ్చినా ఫరవాలేదు కాని నేను తలుపులు తీయడం మాత్రం క్షణం ఆలస్యం కాకూడదు.

టైము చూశాను- మూడయింది ఇంకో రెండుగంటల్లో తెల్లవారుతుంది.

"వంటింట్లో లైటు వెలుగుతోందేమిటి?"

"అదా అది నాకే. తల నొప్పితో నిద్ర పట్టకపోతేనూ టాబ్లెటు ఏదయినా వేసుకుని వేడివేడిగా బోర్నవిటా త్రాగితే తగ్గుతుందేమోనని కలుపుకుందామని వెళ్ళాను. యింతలో మీరు తలుపు తట్టారు. ఎట్లాగూ సమయానికి వచ్చేరు కదా అని మీకు కూడా యివ్వొచ్చునని మరో గ్లాసు నీళ్ళు పడేసి వచ్చాను. అందుకే ఆలాశ్యమయి పోయింది"

"వెరీ గుడ్ అరుణా! అందుకే నువ్వంటే నువ్వంటే నాకెంతో యిది."

ఆయన్ని పట్టుకుని గదిలోకి తీసుకువెళ్ళాను.

బూట్లు, విప్పాను. పైట కొంగు తీసుకొని ముఖమంతా తుడిచాను. మంచం మీద పడుకున్నారు

"నిద్రపోకండి. క్షణంలో తెస్తాను." వంటింట్లోకి పరుగెత్తాను. చప్పు చల్లారిన బోర్న్‌విటా ఒక చేతిలో పొగలు కక్కుతున్నది మరో చేతిలో పట్టుకున్నాను.

నా గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి.

నా ఒళ్లంతా చెమటతో తడిసి ముద్దయింది.

పాదాల్లోకి శక్తిని కూడదీసుకుని అడుగులో అడుగు వేసుకుంటూ గదిలోకి వచ్చాను.

త్రాగిన మత్తులో నిద్రలోకి జారిపోయారేమో కళ్లు తెరవకుండా అలాగే పడుకొని వున్నారు

ఆ ముఖం చూస్తూంటే పరుగెత్తుకెళ్ళి ఆ బోర్న్‌విటా నేలపాలు చేసేయాలనిపించింది

కాని నా చూపులు పిల్లల మంచంకేసి తిరిగిన క్షణంలో మళ్ళీ నిబ్బరం తెచ్చుకున్నాను.

పద్మనీ, పిల్లలనీ చూస్తూంటే యిక ఏమాత్రం ఆలశ్యం చేయకూడదనిపించింది.

"ఏమండీ" పిలిచాను.

పలకలేదు కప్పులు రెండూ ప్రక్కన పెట్టి తట్టిలేపాను

చటుక్కున లేచి కూర్చున్నారు. మత్తుగా నా కళ్లల్లోకి చూశారు.

'బోర్న్‌విటా తెచ్చాను' పొగలు గ్రక్కుతున్న కప్పు అందించాను కప్పు పట్టుకున్న నా చేతులు వణుకుతున్నాయి.

"థాంక్‌యూ అరుణా" అంటూ అందుకున్నారు. 'నీవూ త్రాగేయి.'

చల్లారిపోయిన కప్పుని చేతిలోకి తీసుకున్నాను.

ఆయన కప్పుని పెదాలముందు పెట్టుకుని నావేపు చూశారు. సంచలించి పోయాను ఒక్క విసురున ఆ కప్పు లాగేయాలనిపించింది కాని నేను నిగ్రహించుకున్నాను. నా మనసును కుదుట పరచుకున్నాను.

రుచీ, పచీ తెలియని ఆ మైకంలో గుటగుటమని త్రాగేశారు.

'థ్యాంక్‌యూ అరుణా థ్యాంక్‌యూ యిక పడుకోమంటావా. గుడ్‌నైట్ అరుణా' అంటూ మంచంమీద వెల్లకిలా పడుకున్నారు.

'గుడ్‌బై' మనసులోనే అనుకున్నాను. నా పెదవులు అదురుతున్నాయి. నా కాళ్ళు వణుకుతున్నాయి. నాకడుపులోంచి దుఃఖం పొంగిపొంగి వస్తోంది. వెల్లువలా ముంచుకొస్తూ వుంది.

కన్నీటి తెరలని చీల్చుకుని, నాకళ్ళు యింతింతచేసుకుని ఆయన్ని తలనుండి పాదాలదాకా కరువుతీరేలా చూసుకున్నాను

పెళ్ళినాడు యీ రూపంచూసి ఎంత మురిసిపోయాను. కార్యంరోజు బలమైన అచేల్లో ఒదిగిపోయి ఎంత సిగ్గుపడ్డాను. కొత్తగా కాపరంపెట్టాక. ఏదో ఒక సామెతతో ఆఫీసుకి వంగనామాలు పెడుతూ నాకొంగు పుచ్చుకుని వెనకాలే తిరుగుతూంటే ఎంత పొంగిపోయాను

మొదటిసారి నెల తప్పిందని నేను చెప్పినపుడు ఆయన కళ్ళలో కొంటెతనం పాప పుట్టినపుడు ఆ ముఖంలో తండ్రి నయ్యాననే గర్వం .. ఇవన్నీ సినిమా రీలులా నా కళ్ళముందు తిరగసాగాయి.

పాలకుండ వంటి మా సంసారంలో విషబి దువులు చిలికాయి.

డబ్బుకీ ప్రేమానురాగాలు కొనేశక్తి లేకపోయినా వాటిని నాశనం చేయగల సామర్థ్యంమాత్రం పుష్కలంగా వుంది

ఏ దురదృష్ట ఘడిలో ఆసన్నమయ్యాయోగానీ పాలకుండ పగిలిపోయింది. పాలు నేల పాలయ్యాయి. మీ జీవితాలు చెల్లా చెదరయి పోయాయి.

కరడు గట్టిన నా గుండె ద్రవిస్తోంది నీళ్ళు కమ్మి మసక బారుతున్న కళ్ళని మరీ మరీ తుడుచుకుని ఆయన్ని చూసుకున్నాను యింక లేవరు. ఆ కళ్ళ తెరవరు. ఆ నోటితో అరుణా అని పిలవరు.

నాకు ఏకోషం తన్నుకు వస్తోంది. ఎన్ని చేసినా ఆయన నా భర్త.

ఆయన గుండెల మీద తల వాల్చుకుని వెక్కి వెక్కి ఏడ్చాను.

యిన్నాళ్లూ కడుపులో దాచుకున్న బాధంతా కరిగిపోయేలా ఏడ్చాను.

ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయాను.

* * *

"అబ్బా" అంటూ తల పట్టుకుని కూలబడిపోయింది అరుణ.

అప్పటిదాకా ఆమె చెబుతున్నదంతా కళ్ళముందు జరుగుతున్నట్లుగా భ్రమిస్తూ మంత్రముగ్ధులై వింటున్న జనం ఒక్కసారి పులిక్కిపడ్డారు.

శ్రోతల్లో కలకలం.

పోలీసులు అరుణ ముఖం మీద నీళ్ళు చల్లారు. ఆయాసంతో రొప్పుతోంది అరుణ. కొన్ని క్షణాలు మాట్లాడలేక పోయింది.

ఆమె గుండెలు ఎగసి పడుతున్నాయి. ఆమె కళ్ళల్లోంచి నీళ్ళు కాలువలు కట్టి ప్రవహిస్తున్నాయి.




యింకా ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది అరుణ. దగ్గు తెర వచ్చింది.

ఆమె నోట్లోంచి వచ్చే ప్రతి మాటా విని తీరాలనే కుతూహలంతో జనం అంతా చెవులు రిక్కించుకుని విశ్శబ్దంగా చూస్తున్నారు.

తనని తాను సంభాళించుకుంది అరుణ.

లేచి నిలబడబోయింది, సాధ్యం కాలేదు.

"ఫరవాలేదు కూర్చునే చెప్పమ్మా" జడ్జి అన్నారు.

కృతజ్ఞతగా చూసింది అరుణ. కాని అతి ప్రయత్నం మీద లేచి నిలబడి కోర్టు హాలంతా ఒక్కసారి కలియచూసింది.

"ఇదీ కథ. ఇదే యీ నేరస్థురాలి జీవితం. భర్తకు విషం యిచ్చి చంపిన భార్యని చూడాలని మీరందరూ వచ్చారు కదూ " నవ్వింది అరుణ. గుండెలు చీల్చుకుని వస్తున్న దుఃఖపు తెర ఆ నవ్వు.

"మీ అందరి దృష్టిలో నేను హంతకురాలిని. మామూలు హంతకురాలిని కాదు. తాళికట్టిన భర్తకు చేజేతులా స్వయంగా విషం యిచ్చి చంపిన రాక్షసిని. నిజమే . కాని ఒక్కసారి ఆలోచించి చూడండి. ఒక ఆడది, నలుగురు బిడ్డల తల్లి తన భర్తని ఎందుకు చంపుతుంది? తన పిల్లలని తండ్రిలేని వారిగా ఎందుకు చేస్తుంది?

నేనూ ఒక మామూలు ఆడదాన్నే. రాక్షసిని కాదు. కన్నె వయసులో ఎన్నో

కలలు కన్నాను. నీ కలల పంట యితనే అంటూ నాకు భర్తని తెచ్చారు. కోటి ఆశలతో, శతకోటి కోరికలతో నా భర్తతో కాపురానికి వచ్చాను. నా జీవితం నందన వనం అవుతుందని, మా సంసారం మూడు పూలూ, ఆరు కాయలూ అవుతుందని ఆశించాను కాని వేరుకే పురుగుపట్టి నా 'జీవన కల యిన్ని వంకరలు తిరుగుతుందని చివరకు యిలా నేలకూలి పోతుందని అనుకోలేదు నన్ను శిక్షించవద్దని కోరను. ఒక మనిషిని చంపడం నేరమే. అందుకు శిక్ష పడాల్సిందే కాని చంపడం కన్న క్రూరమయిన హింసలు ఎన్నో వున్నాయి. కాని అవి కళ్ళకు కనబడవు. కోర్టులకు ఎక్కవు. శిక్షకు నిలబడవు నా భర్త లాంటి మగవాళ్ళు మా జీవితాలని యిలా బలి తీసుకున్న లాంటి పెద్దమనుషులూ మీలోనూ ఎందరో వుండొచ్చు. ఒక్కసారి మీరు అలాంటి అకృత్యాలకి పాలు పడేముందు నన్ను, నా కథను జ్ఞప్తికి తెచ్చుకోండి. మీ చేతుల్లో అధికారా లున్నాయని, వాటి కోసం ఆడవాళ్ళని బలి తీసుకోవద్దు. అలా కోరేముందు మీ తల్లిని, మీ చెల్లిని, మీ పాపలను తలుచుకోండి మీరా పని చేయలేరు. సంఘం లోంచి ఏరి పారేయ వలసిన చీడ పురుగులుగా తయారు కావద్దు. నా లాంటి హంతకులను తయారు చేయొద్దు." ఆయాసంతో ఒక్కసారి వూపిరి పీల్చు తుంది అరుణ. ఆసక్తితో వింటున్నారు అందరూ

"ఇక నేను చెప్పవలసిందేమీ లేదు. కట్టుకున్న భర్తను చంపిన రాక్షసిగా కాక, ఎటువంటి పరిస్థితులలో ఆయనకి విషమిచ్చి, నా పసుపు కుంకుమలు నా చేత్తో నేనే నిర్దాక్షిణ్యంగా తుడిచేసుకో వలసి వచ్చిందో మీలో మీరు మననం చేసుకుని ఆలోచించి చూడండి. మీలో ఏ ఒక్కరి కంట్లో యీ అభాగ్యురాలి కోసం ఒక్క కన్నీటి బొట్టు రాలినా వారికి నేను కృతజ్ఞురాలిని. యింతే నేను చెప్పేది."

* * *

వెక్కిళ్ళు వినిపించి వెనక్కి తిరిగి చూశాడు మోహన్.

పద్మ ఎప్పుడు లేచి వచ్చిందో చూడనేలేదు. తన వెనకే నిలబడి తనతో పాటు చదివిందన్న మాట.

చప్పున లేచి నిలబడి గుండెలకు అదుముకున్నాడు పద్మని. ఆమె దుఃఖాన్ని ఆపలేదు. ఏడవనిచ్చాడు. ఏడ్చేస్తే భారం తీరిపోతుందని అతనికి తెలుసు.

"పద్మా యిలా చూడు."

కళ్ళెత్తి చూసింది. కొత్త పెళ్ళికూతురు. అందులోనూ శోభనం పెళ్ళి కూతురు. ముఖాన కల్యాణపు బొట్టు, కళ్లకు కాటుక, బుగ్గన చుక్క — కరిగి పోయి వున్నాయి. చెరిగిపోయి వున్నాయి.

ఆ ముఖం చూస్తూంటే ప్రేమతో పాటు జాలి ముంచుకొచ్చింది మోహన్‌కి.

"చూడు పెళ్ళి కూతురివి అలా ఏడవకూడదు. మీ అమ్మ కోసమేనా? ఆమే కాదు పద్మా, అలాంటి పరిస్థితులలో ఏ ఆడదయినా ఆ పనే చేస్తుంది. నీవేం బెంగ పెట్టుకోకు. మీ అమ్మ త్వరలోనే విడుదలయి వస్తుంది. ఆమెకి మనం వున్నాం."

పద్మ కళ్ళు ఆశ్చర్యంతో చూస్తున్నాయి. తల నిమురుతూ లాలనగా అన్నాడు.

"ప్రేమ పంచితే ప్రాణం యిస్తుంది పద్మా ఆడది. పగబడితే ప్రాణం తీస్తుంది కూడా. పిల్లల కోసం అలమటించిన తల్లిగా మీ అమ్మ ఆ పని చేసింది. మీరు జైలో శరణాలయంలో చేర్చబడ్డారు కదూ, పద్మా! విన్నా నా కోపమే పువ్వులా కాపాడిందేమో మీ అమ్మ" ఆమెకు నా కృతజ్ఞతలు తెలుపుకోవాలి. అంతేకాదు. రేపే మనం వెళ్ళి నీ చెల్లెళ్ళని, తమ్ముణ్ని తీసుకొస్తాం. యిప్పుడు వాళ్ళు అనాధలు కారు. వాళ్ళకి అక్కా బావా వున్నారు, సరేనా...."

అతడి కౌగిలిలోంచి జారిపోయి పాదాలు చుట్టేసుకుంది పద్మ. కన్నీళ్ళతో అతడి పాదాలు కడుగుతోంది.

మోహన్ కళ్లు చెమర్చాయి. రెప్పల అంచుకు జారిన కన్నీళ్ళ తడి బొట్లు బొట్లుగా పద్మ తల మీద పడుతున్నాయి

ఒక మగవాడి వల్ల చెదిరిపోయిన జీవితాలు, మసిబారిన బ్రతుకులు మరో మగవాడి మూలాన ఒకచోట చేరబోతున్నాయి. వెలుగులు చిమ్మ బోతున్నాయి. ఆ వెలుగులు అ క్షణమే యిల్లంతా, ఒళ్ళంతా, మనసంతా ఆక్రమించుకున్నట్టు వాళ్ళిద్దరూ అలాగే ఆ అనుభూతిలోనే ఎంతసేపో వుండిపోయారు.






మెయిన్ బజారులో వొసందు మొదట్లో వున్న షాపు ముందున్న బోర్డు — "వైసీ టైలర్స్" ప్రొ॥ వై. చిన్నారావు - చూసి రిక్షా దిగి డబ్బులిచ్చేను. అద్దాల బీరువాల్లో బయటకు కనపడేటట్లు వరుసగా ఫాంట్లు, షర్టులూ హేంగర్స్‌కి వేలాడదీయబడ్డాయి సాయంకాలం కాస్త చల్లబడ్డదేమో కష్టమర్స్‌తో లోపల రష్‌గా వుంది లోపలకు అడుగు పెట్టి అంతా కలియచూసేను. ఓ అర డజను కుట్టుమిషన్లు జోరుగా తిరుగుతూ కోలాహలం చేస్తున్నాయి ఆ హాలు లాంటి గదిలో మధ్యలో సగం కుట్టిన కొత్తబట్టలు ముందువేసుకుని పన్నెండేళ్ళు దాటని వో నలుగురు కుర్రాళ్ళు చేతితో కుడుతున్నారు. అందులో వో కుర్రాడ్ని పిలిచి చిన్నారావులేడా అని అడిగేను. హాలుకి ఆనుకునివున్న సందులాంటి మార్గము చూపించి అటు వెళ్ళమన్నాడు ఆ మార్గము చివర రెండు చిన్నగదులు వొకదానివెనుక వొకటి వున్నాయి. ముందుగదిలో వొకసోఫా, నాలుగైదు కుర్చీలు, వొక గాడ్రెజ్ టేబిలూ వున్నాయి టేబిల్ వెనక కుర్చీలో చిన్నారావు కూర్చుని, వో కుర్రాడు టేపుతో కష్టమరు కొలతలు తీసుకుంటుంటే నోట్ చేసుకుంటున్నాడు. మధ్యమధ్య కొలతలు తీసేకుర్రాడికి యేవో డైరెక్షన్స్ యిస్తున్నాడు. వీళ్ళుకాక గదిలో యింకా కొంతమంది కూర్చుని వున్నారు. వెనుక

గదిలో యెత్తుగావున్న టేబిల్స్ ముందు నుంచుని యిద్దరు గుడ్డలుకత్తిరిస్తున్నారు. చిన్నా నా రాకను గమనించడానికి పది నిమిషాలుపట్టింది. చూడగానే అమాంతం లేచొచ్చి నన్ను కౌగలించుకున్నంత పనిచేసాడు. కుశల ప్రశ్నలయ్యాక వో కుర్రాణ్ని పిలిచి నాతోపాటు అక్కడున్న కస్టమర్స్‌కి గోల్డ్ స్పాట్ తెప్పించి యిచ్చేడు. నాతో ఆవీయివీ మాట్లాడు తూనే తనపని తను చేసుకుంటున్నాడు. కొంత మంది కొలతలు యివ్వడాని కొస్తుంటే కొంత మంది డబ్బిచ్చి కుట్టిన గుడ్డలు తీసికెళ్ళడానికి వస్తుండ డంతో వాడితో మాట్లాడం కష్టమని పించింది.

ఓ అరగంట తరువాత "మా సేవుగా క్షణం తీరిక దొరకడంలేదు. అసలే పెళ్ళిళ్ళ సీజను. పెళ్ళిచేసికుని నాల్రో జుల్లో వొచ్చేస్తానన్న మా అసిస్టెంటు గాడు పదిరోజులై నా పెళ్ళాన్నొదిలి రాలేక పోతున్నాడు. ఇంటికెళ్ళి అన్నం ముందు కూర్చునేటప్పటికి రోజూ అర్ధరాత్రి దాటి పోతుంది" అని నాకూ, కస్టమర్స్‌కి కలిపిచెప్పినట్టు చెప్పేడు.

కాస్త ఖాళీ దొరికిందరువాత నన్ను తీసుకుని బయట హాల్లోకి వొచ్చి వో కుర్రాడ్ని పిలిచేడు. "సత్యం! నాతో పెట్టుకూర్చుంటే లాభంలేదు కాని ప్రొద్దున్నే ఎప్పుడు బయలుదేరావో యేమిటో, యింటికెళ్ళి స్నానంచేసి భోజనంకూడ కానిచ్చి రెస్టుతీసుకో ఈ రోజు తొందరగా షాపు కట్టేసి పదింటి కల్లా వొచ్చేస్తాను." అని నాతోచెప్పి "ఒరేయ్ శివా! అయ్యగారిని యింటికి తీసికెళ్ళి స్నానం భోజనం చూడమన్నా నని అమ్మగారితో చెప్పు." అని కుర్రాడికి చెప్పి వో రిక్షా పిలిచేడు.

వాడొచ్చేవరకూ అక్కడ ... ర్చో డానికి నా కభ్యంతరంలేదని చెప్పేను కాని వాడు వినకుండా నన్ను రిక్షా యెక్కించాడు.

వాళ్ళిల్లు అట్టహాసంగా లేకపోయినా పొందికగావుంది. చిన్నాభార్య సౌభాగ్యం ముందు నన్ను గుర్తుపట్టలేదు కాని చిన్నాతో నా పరిచయం గుర్తుతేగానే తన మతిమరుపుకు యెంతో బాధపడింది. మా ఆవిడ సరళ గురించి, పిల్లలగురించి వివరాలు తెలుసుకుంది. వాళ్ళ కుటుంబ విశేషాలు కూడ చెప్పింది. రెండేళ్ళ క్రితం చౌకలో వొస్తే ఆ యిల్లు కొను క్కున్నారట. పెద్దబ్బాయి కూడ వాళ్ళ నాన్నతోనే వుండి యీ మధ్యే వేరే షాపు పెట్టేడట. వాడిపని బాగానే వుందట. రెండోవాడికి చదువు మీద శ్రద్ధ యెక్కువట' ఈ యేడు ఇంట రయిపోయాక యింజనీరింగు చదివిం చాలని అనుకుంటున్నారట. మూడోది అమ్మాయి సినిమాలు తప్ప యేమీ అక్కర్లేదట. టెన్త్ చదువుతుందట. నే వెళ్ళేసరికి ఆడపిల్ల వొక్కత్తేవుంది.

మగపిల్లలు యింటిలో లేరు పెద్దాడికి మంచి సంబంధంవొస్తే యీ సంవత్స రంలో పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారని కూడ చెప్పింది.

స్నానంచేసేక చిన్నా వొచ్చేవరకూ ఆగుతానన్నా వినకుండా ఆలశ్యమయి పోతుందంటూ నాకు భోజనం వడ్డించింది. తరువాత సెపరేట్ గా వీధివైపున్న గదిలో పక్కవేసి "కాసేపు పడుకోండి. ఆయనొస్తే ఆ ముచ్చటా యీ ముచ్చటా చెబుతూ తెల్లార్లూ వొదిలిపెట్టరు" అని చెప్పి లోపల పని చూసికోడానికి వెళ్ళి పోయింది చిన్నా భార్య.

మంచమీద పడుకుని చిన్నా జీవితంలో వొచ్చిన మార్పు చూస్తే తెలియని ఆనందం గుండెలనిండా నిండిపోయింది. ఎందుకో నా కొంచెం గర్వంగా కూడ వుంది

ఆ రోజు నాకు బాగా గుర్తు.

తెల్లవారు ఝామున నాలుగింటికి మాయింటి తలుపులు దబ దబా చప్పుడవుతుంటే శుభ్రమైన నిద్ర చెడ గొట్టినందుకు విసుక్కుంటూ బద్ధకంగా తలుపు తీసాను. చెదిరిపోయిన క్రాపుతో యెర్రబడిన కళ్ళతో రాత్రంతా నిద్ర లేనట్టు నీరసంగా చిన్నా నిలబడి వున్నాడు యెదురుగా. ముందు రోజు సాయంకాలం మా ఆఫీసు విడిచిపెట్టే టయిమ్‌కి నాదగ్గర కొచ్చేడు. అదీ యిదీ మాట్లాడుకుంటూ కాస్సేపు బజారులో తిరిగి విడిపోయాం. మరీ తెల్లవార కుండానే రావడం వింతగానే వుంది. వాడి వాలకం చూస్తే కొంచెం భయం వేసింది

"ఏవిటి.... ఏమైందిరా? అలా వున్నావేం? రాత్రంతా నిద్రపోలేదా? ఆత్రుతగా అడిగేను.

"సత్యం. వెరీ సారీరా! యింత పొద్దున్నే డిస్టర్బ్ చేస్తున్నందుకు యేమీ అనుకోకు. షర్టువేసుకుని వొస్తే వొక్క ఐదు నిముషాలు అలా బయటకు వెళ్దాం. నీతో కాస్త ముఖ్య విషయం మాట్లాడాలి." అన్నాడు.

ఆ మాట్లాడేది యిక్కడే కూర్చుని మాట్లాడకూడదా అనాలనుకున్న వాడినల్లా వాడి మొహం చూసి మౌనంగా షర్టు తొడుక్కుని శ్రీమతిని తలుపేసు కోమని బయటకు నడిచేను. ఆశ్చర్యంతో కూడిన విసుగును ప్రదర్శించింది సరళ తలుపు వేసుకుంటూ.

ఐదు నిముషాలు మౌనంగా నడిచి వీధి చివర అప్పుడే తెరిచిన హోటల్లో వోమూల కూర్చున్నాం. రెండు టీ ఆర్డరిచ్చి వాడి మొహంలోకి చూసాను విషయమేవిటో చెప్పమన్నట్టు.

సత్యం! ఇలా యేపనీ లేకుండా అందరితో ఛీ అనిపించుకుంటూ యింక బ్రతకలేను. అందుకే వో నిశ్చయానికి వొచ్చేను. నాలుగేళ్ళనుంచీ చూస్తూనే వున్నావుగా. ఇక వుద్యోగం రావడ

మనేది కలలో మాట. ఏదేనా వ్యాపారం చెయ్యాలన్నా చేతిలో పైసలేనిది యెలా కుదురుతుంది. మరింకేం చెయ్యగలను. సినిమాల్లో చూపించినట్టు బి. ఏ. డిగ్రీ చేతితో పట్టుకుని రిక్షాలు తొక్కలేను లేకపోతే బరువులు మొయ్యలేను. అందుకే బాగా ఆలోచించి నాకు సాధ్య మయ్యింది నేను త్వరగా నేర్చుకో గలిగింది టైలరింగని నిర్ణయానికొచ్చేను. నా ఆలోచన చెప్తే అందరూ నవ్వుతారని తెలుసు. అందుకే యెవ్వరికీ, ఆఖరుకి మా అమ్మకి కూడ చెప్పనిలేదు. నా కాళ్ళమీద నేను నిలబడి నప్పుడే చెబుతాను. దీనికంతకూ యిన్స్పిరేషన్ జగన్నాధరావుగారిని నువ్వు గుర్తించే వుంటావు. ఇన్నాళ్లూ యెంత అజ్ఞానంలో వున్నానో ఆయన మాటలు విన్నాకే తెలిసింది. ఇప్పుడు నా కాలాన్ని వృధా చేయదల్చుకోలేదు. ఈ వృత్తిద్వారా నన్ను నమ్ముకున్న వాళ్ళకు వో పూటైనా తిండిపెట్ట గలననిపిస్తుంది" అని యేమంటావ్ అన్నట్టు కొన్ని క్షణాలు నావంక చూసాడు.

వాడి మాటలు వింటూ యేంచెప్పాలో తెలియక పొగలు కక్కుతున్న టీ వొంక చూస్తూ కూర్చున్నాను

"నువ్వు యింతవరకూ నీ శక్తికిమించి సహాయం చేసావ్. మన స్నేహాన్ని యీ డబ్బు చెడగొట్టకుండా చూసేవు నువ్వే నాకు ధైర్యం చెప్పి, ఆర్థికంగా సహాయం చెయ్యకపోతే నిరాశతో నా కెప్పుడో పిచ్చెక్కి పోయుండేది. ఇంతవరకూ నేను నీకు అదనపు భారంగానే వుంటూ వొచ్చేను. ఇప్పుడుకూడ యింకొంత భారం నీమీద మోపడం నాకిష్టంలేదు. కాని నేను అసమర్థుణ్ణిరా. నా అసహాయతకు మన్నించు." అంటూ నా చేయి నొక్కేడు. వాడి కళ్ళల్లో చివుక్కున నీరు చిమ్మింది. ఆ పరిస్థితికి నాకూ విపరీతమైన బాధకలిగింది. మాటలు రాక వూరుకున్నాను.

ఈ రోజే మద్రాసు వెళ్దామనుకుంటు న్నాను. అక్కడ వో టైలర్‌కి మన టైలర్ అప్పారావు లెటర్ యిస్తాన న్నాడు. నేనెవరో తెలియని మనుషుల మధ్య ధైర్యంగా క్రొత్తజీవితం ప్రారం భిస్తాను. పని నేర్చుకోవాలంటే కనీసం నాలుగైదు నెలలన్నా అక్కడ వుండాలి. వెళ్ళడానికి, వెళ్ళింతరువాత వేరే దారి చూసుకునే వరకూ కనీసం వో వంద రూపాయిలన్నా కావాలి. అవి నువ్వే సర్దాలి, అక్కడ కెళ్ళింతరువాత నా తిప్పలు నేను పడతాను. మరీ కష్టమైతే నువ్వు నెలకోయాభై అన్నా పంపించాలి ఆ అవసరం రాదనుకో. ఇలా సిగ్గు విడిచి అడుగుతున్నానని తిట్టుకుంటు న్నావా? నీ కొచ్చే జీతం డబ్బులతో నీ బ్రతుకీడ్చడమే కష్టమనీ, వదినకు మందులకూ డాక్టర్ ఫీజులకూ అదనంగా యీ నాలుగు నెలలు ఖర్చులుంటాయని




నాకు తెలుసు. యెందుకడుగుతున్నా నంటే.... కష్టమయినా నాకీసహాయంచేసే సహృదయం కలవాడివి నువ్వొక్కడివే. నాయీ క్రొత్త జీవితం నీ చేతుల్లోనేవుంది." అని యెంతో బాధపడుతూ చెప్పేడూ.

వాడి నిర్ణయానికి నాకు చాలా సంతోషం వేసింది. ఎలాగైనా వాడికి యీ సహాయం చెయ్యాలనిపించింది. కాని నామీద పెట్టిన ఆర్థికభారం మొయ్యడం కష్టమనిపించింది. స్నేహితుడికి చేసింది చెప్పుకోకూడదుగాని వాడికి నేను నెల నెలా అంతో యింతో సర్దుతూనే వున్నాను. అందుగురించి మా ఆవిడకూ, నాకూ యీమధ్య భేదాభిప్రాయా లేర్పడ్డం తన్మూలంగా చిన్న చిన్న కలతలు రావడం కూడా జరిగింది. అదీ కాక సరళకిప్పుడు ఆరోనెల. చిన్నా అన్నట్టు డాక్టరుకి చూపిస్తే నీరసంగా వున్నదంటూ మందులు రాసిచ్చి రెగులర్‌గా వాడమంది. నెలనెలా వొచ్చి పరీక్ష చేయించుకొమ్మంది. వీటికోసం కొంత అప్పు చేయాల్సొచ్చింది. చేతి కొచ్చే జీతంలో నూటపాతిక 'పాలి టెక్నిక్ కోర్సు చదువుతున్న తమ్ముడికి నెలనెలా పంపించాలి. చిన్నాకి ప్రస్తుతం వంద సర్దడం మాట అటుంచి నెల నెలా పంపించేది నా తరం కాదనే చెప్పాలి.

ఉపయోగపడని ఆలోచనలు వూపిరి సలపకుండా ముసురుతుంటే యేం మాట్లాడలేకపోయాను. నా మౌనాన్ని వాడు యెలా అర్థంచేసుకున్నాడో గాని "సారీరా బ్రదర్. ప్రొద్దున్నే నిన్ను యిలా యిరకాటంలో పెట్టినందుకు మన్నించు. ఈ నాలుగేళ్లూ యెందుకూ పనికిరాకుండా గడిపినందువల్ల జగన్నాధ రావుగారి మాటలతో వుత్తేజితుడినై యేదో సాధించేయాలనుకుని వెనకా ముందూ ఆలోచించకుండా యిలా వొచ్చే సేను. అందువల్ల నీ యిబ్బందుల్ని ఆలోచించలేక పోయాను. నీ తంతే యెవరు మాత్రం సహాయం చెయ్య గలరు. ఈ విషయం మర్చిపో నేను

యెక్కడైనా యితరత్రా దొరుకుతుం దేమో ట్రై చేస్తాను. అంతగా యెక్కడా దొరక్కపోతే అప్పుడే యేదో ఆలో చిద్దాం." అంటూ లేచాడు.

ఆ మాత్రం సహాయం ఆ పరస్థితిలో వున్న చిన్నాకు చెయ్యకపోతే మా అనుబంధానికి విలువలేదనిపించింది బిల్లు చెల్లించి బయటకొచ్చేక రోడ్డుమీద నడుస్తూ ఆ డబ్బు నేను సర్దుతానని, వాడిని వర్రీ అవ్వొద్దని చెప్పినపుడు వాడి మొహంలో తిరిగొచ్చిన కాంతి చూసి నాకూ ఆనందమయ్యింది నన్ను కౌగిలించుకున్నంత పని చేసాడు.

చిన్నాని అంతగా ఉత్తేజపరిచిన జగన్నాధరావుగారు గుర్తు కొచ్చేరు. ఆయన ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి గాంచిన యిండస్ట్రియలిస్టూ, వ్యాపారవేత్తాను. కొన్ని కోట్లకు అధిపతి. నాలుగు రోజుల క్రిందట లోకల్ క్లబ్‌లో ఆయనకు సన్మానం చేసారు. అదేమీ సినిమాస్టార్పుకి గాని, రాజకీయవేత్తల గ్గాని జరగబోయే సన్మానం కాదు కాబట్టి ముందు నేను వెళ్లాలనుకోలేదు. కాని సన్మాన సంఘంలో నా మిత్రుడొకడు మెంబరు కావడం వల్ల నన్ను రమ్మని మరీమరీ కోరినందువలన ఆ రోజు సాయంకాలం బయలుదేరాను. సరిగ్గా అదేసమయానికిచిన్నామాయింటికొచ్చేడు. ఆ రోజు వాడి మూడ్ అసలేం బాగా లేదు. ఇంటిదగ్గర వాళ్ళ అమ్మకు, ఆవిడకు పెద్ద పోట్లాట యే కారణమూ లేకుండానే జరిగిందట. ఇద్దరూ కలిసి వొకరిమీద వొకరు వీడికి ఫిర్యాదు చేసుకున్నారట. ఎటు మాట్లాడితే యేం జరుగుతుందో అని వీడు మాట్లాడక పోయేసరికి వీడి అసమర్ధతని యిద్దరూ యెత్తి చూపేరట యింట్లో వుండలేక నా దగ్గరకొచ్చేడు ఆ ఆలోచనలనుండి వాడి దృష్టి మళ్ళిద్దామని నాతో తీసుకు వెళ్ళేను.

సినిమాలు కూడ టైముకి ప్రారంభిం చని మా వూరిలో ఆ రోజు సభ చెప్పిన టైమ కే మొదలైంది. ఆ మాటే ప్రక్కన కూర్చున్నాయనతో అంటే సింప్లిసిటీ, పంక్చువాలిటీ జగన్నాధరావు గారి ఐదు, ఆరు ప్రాణాలని జోక్ చేసాడు.

ఆ పెద్దమనిషిని చూస్తే యేమీ యింప్రెసివ్‌గా లేదు. ఫలానా అని చెప్పి ఆయన ఆస్తి వివరాలు చెబితేనే గాని చాలామంది ఆయన్ని గుర్తించ లేరు. నాకు ఆశ్చర్యం వేసినది యింకో కటుంది. సన్మానం అన్నారు గాని వొక్క దండకూడ ఆయనకు వెయ్య లేదు. సన్మాన సంఘం తరపున వో చిన్నపాపతో వొక గులాబీ పువ్వు యిప్పించేరు. అది తీసికుని ముందు టేబిల్‌మీదున్న ఫ్లవర్‌వాజ్‌లో వుంచేరు దండలవీ వేస్తే అనవసరమైన ఖర్చు అని కోప్పడతారట. పురప్రముఖు

లంతా ఆయన త్యాగవిరతినీ, కార్య దీక్షనూ, నిరాడంబరత్వాన్నీ యెదాపెడా శోషోచ్చేవరకూ పొగిడేరు. చివరగా ఆయన కృతజ్ఞత తెలుపుకుంటూ, "ఇంతవరకూ మీకు తెలిసినవే వొకటికి పదిసార్లు విన్నారు. అదంతా మర్చి పోండి. దానివల్ల యెవరికీ యెటువంటి యిబ్బందీ వుండదు. కాని యిప్పుడు మీకు వొక కథ చెప్తాను. అది విని దాంట్లో యేమైనా పనికొచ్చేదుంటే గుర్తుంచుకోండి." అంటూ కథ మొదలు పెట్టేరాయన.

"అనగా అనగా మీ వూరు లాంటిదే వొక వూరు. అందులో యిరవై యేళ్ళు నిండిన వో కుర్రాడు. బరువూ, బాధ్య తలు మోసే వయసు కాదది. జీవితం వో రంగుల కలలాంటిదని ఆ కలల్లో యేది కావాలని కోరుకుంటే అది వొస్తుందని అపోహ పడే వయసే కాని, చూచుకుని నడవకపోతే బాటలోని తుమ్మముళ్ళు కాళ్ల చీరేసి కుదేస్తాయనీ. వాలు చూచుకుని ప్రయాణం చెయ్యక పోతే దూరం తగ్గకపోగా వెనక్కి కూడ పోవలసి వొస్తుందని పాపం అతని కింకా తెలియదు. హఠాత్తుగా తండ్రి పోవడంతో వొక్కసారి కల లన్నీ చెదిరిపోయాయి. ఆశలన్నీ ఆవిరై పోయాయి. బాధ్యతలు కొండచిలువ ల్లాగా వూపిరి సలపకుండా పెనవేసుకో వడం మొదలైంది. తండ్రి చేసిన అప్పులమీద వడ్డీలు వొళ్ళు పెంచేసు కుంటున్నాయ్. ఇంట్లో యెదిగికూచున్న తోబుట్టువుకి పెళ్ళి చేయాలంటే కట్న మియ్యాలి కట్నమివ్వాలంటే కట్నం తెచ్చుకోడం తప్ప మరో మార్గంలేదు. కట్నంతోపాటు వొచ్చిన పెళ్ళాం కోర్కె లనూ తెచ్చింది. కోర్కెలు పిల్లల్ని యిచ్చేయి ఒక సమస్యను పరిష్కరించ బోతే పరికొన్ని సమస్యలు యెదు రయ్యాయి. తెలియకుండానే బరువు పెరిగిపోయింది మధ్యలో ఆగిపోయిన ఆ చదువుకే యేదో పెద్ద వుద్యోగం వొచ్చేస్తుందని ఆశ. ఇంకా పైకి చదువుకున్నవాళ్ళే. కటకట పడుతున్నా రని తెలియని అమాయకత్వం అతనిది. ఎదురు చూడ్డంలో థ్రిల్ పోయింది. నెమ్మది నెమ్మదిగా పరిస్థితులు ఆకళింపు లోకి వొస్తున్నాయి. ఎటు చూసినా పెను చీకటి తప్ప గుడ్డివెలుగు కూడ కనిపిం చడం లేదు రెండు పూటలా తిండి తినడమే గగనమయ్యింది సరిగ్గా ఆ సమయంలోనే భార్యకు ఎబార్షన్ చెయ్యాల్సొచ్చింది. చెయ్యకపోతే ప్రాణాపాయమని డాక్టర్లు చెప్పేరు డబ్బు కావాలి. ఎవరిస్తారు? పరిష్కారం కనపడలేదు. కాని బలహీనమైన క్షణంలో అందరికీ యింతంత విషమిచ్చి తనూ తాగి యీ బాధలనుండి శాశ్వతంగా విముక్తి పొందాలనుకున్నాడు. గాని వెంటనే మనస్సు మేల్కొంది. తన

ఆలోచనలకు సిగ్గుపడ్డాడు. ఆ సమయం లోనే లోకంలో యింకా మంచితనం మిగులుకుపోలేదనడానికి నిదర్శనంగా వొకప్పుడు వాళ్ళింట్లో పనిచేసే మనిషి యాభై రూపాయిలు పర్ది అతని భార్య ప్రాణం కాపాడింది.

అప్పుడే అతనికి తెలిసొచ్చింది. బంధు ప్రీతి లంచగొండితనం యీ దేశంలో పూర్తిగా రూపుమాసినా, పెరిగిపోతున్న జనాభా వో అందరికీ వుద్యోగాలు రావడం చాల కష్టమని కష్టపడితే తిండికి లోటులేకుండా వుండటానికి అనేక మార్గాలున్నాయని తెలుసుకున్నాడు. భార్య కోలుకున్నాక పుట్టింటికి పంపించి తల్లిని తమ్ముళ్ళనూ మేనమామకు అప్పజెప్పి రైలెక్కాడు. అది వెళ్ళినంత దూరం టిక్కెట్ లేకుండానే ప్రయాణం చేసాడు. రైలు దిగింతరువాత నాలుగురోజులు తిండి లేకుండానే గడిపేడు. వారం తిరిగేసరికి వొక హోటల్లో క్లీనరుగా పని సంపాదించేడు. పనిమీద శ్రద్ధ చూపుతూ, చుట్టూ పరిస్థితులను అర్ధంచేసుకుంటూ సర్వర్‌గా మారి కొంతకాలానికి ఆ హోటల్లోనే క్లర్కుగా అవతారం యెత్తి మూడేళ్ళకు వొచిన్న హోటల్‌కి ప్రొప్రయిటర్ అయ్యాడు అక్కడితో ఆగలేదు కృషితో పాటు అదృష్టం కలిసొచ్చింది. నాలుగువాదుల్లో వ్యాపారాన్ని విస్తృత పరిచేడు ... పరకు వాణిజ్య వేత్తగా మారేడు. అంతడబ్బు గడించడంలో అతను స్మగులింగు కావి, బ్లాక్ మార్కెటింగు కావి, యితర అక్రమాలు గాని చెయ్యలేదు. అప్పటినుంటి ఇప్పటి వరకూ తను తెలిసి చేసిన తప్పల్లా టికెట్ లేకుండా ప్రయాణం చేయడమే. రైల్వేవారు అందుకు శిక్షగా అతన్ని రైల్వేబోర్డ్ మెంబరుగా నియమించేరు. అది వేరే విషయమనుకోండి. ఇంతకూ ఆ వ్యక్తి యెవరోకాదు మీ యెదురుగా వున్న జగన్నాధరావే"

"ఇంతా యెందుకు చెప్పేనంటే.... నేటి యువకుల్లో నిరాశ, యే పని చెయ్యాలన్నా వెనుకంజ వేసే మనస్తత్వమూ పెరిగిపోతున్నాయి. బాధ్యతలు నిర్వర్తించడానికి అస్సలు ముందుకు రాలేకపోతున్నారు. నా జీవితాన్ని పరిశీలించి కొందరైనా యువకులు కార్యాదీక్షపరులై తమ జీవితాన్ని సుఖమయం చేసుకుంటే నాకు యీ రోజు జరిగిన సన్మానానికి నిజమైన ఫలితం దక్కిందనుకుంటాను." అంటూ ముగించేరాయన.

అక్కడనుండి వొచ్చేటప్పుడు చిన్న ఆలోచనలో పడ్డాడు. ఆయన జీవితంతో తన జీవితం పోల్చుకుంటున్నాడేమో. నిజానికి కూడా చాలా పోలికలున్నాయేమో అనిపించింది.

మేం యిద్దరం యెలిమెంటరీ స్కూలు దగ్గరనుండి కాలేజీవదిలిపెట్టేవరకు కలిసే చదువుతున్నాం పరీక్షల ముందు మా

యింటిదగ్గరే టీలు తాగుతూ తెల్లవార్లూ పుస్తకాలు ముందేసుకూర్చుని కబుర్లు చెప్పుకునే వాళ్ళం. మా స్నేహం పెరగడానికి మరో కారణం మా మధ్య వున్న ఆర్థిక సమానత్వం కావచ్చు. మధ్య తరగతి క్రింద అంచులు పట్టుకు వేళ్లాడుతున్న కుటుంబాలు మావి. నా అదృష్టం కొద్దీ చదువైన సంవత్సరానికే తన కూతుర్ని నాకు కట్టబెట్టి, మా వూళ్ళోనే వుద్యోగం యిప్పించాడు మా మేనమామ. ఆ తరువాత నాన్న రిటైరయ్యాక అమ్మతో అన్నయ్య దగ్గర కెళ్ళిపోయారు. తమ్ముడి బాధ్యత నామీద పడింది. ఆ విధంగా బాధ్యతలు పంచేసుకుని వో పరిధిలో కాలం వెళ్ళబుచ్చుతున్నాను.

కాని చిన్నా జీవితం వ్యతిరేకంగా తయారయింది. పెళ్ళి పెళ్ళంటూ వొత్తిడి చేసే పెద్దలమాట కాదనలేక చదువవ్వగానే పెళ్ళి చేసుకున్నాడు. ఇంటిలో పెళ్ళికెదిగిన చెల్లెళ్ళు, పైకి రావలసిన తమ్ముళ్ళు వున్నారు. ఎదిగొచ్చిన కొడుకు యేదో వుద్యోగం చేసి కాస్త చేదోడు వాదోడుగా వుంటాడనుకుంటే వీడికి కనుచూపు మేరలో అది వొచ్చే అవకాశం కనపడ్డం లేదాయె. పోనీ ప్రయత్న లోపమా అనుకుంటే అదేమి కాదు. తెలిసిన వాళ్ళనూ, తెలియని వాళ్ళనూ కలుసుకుని వుద్యోగంకోసం అర్థించేడు. అందరూ చూద్దామన్నవాళ్ళే కాని సహాయం చేసినవాళ్ళు యెవరూ కనపడలేదు. డబ్బు పెట్టి కొనుక్కునే స్తోమతు లేకపోయినా వో సారి వెయ్యి రూపాయలు అప్పుచేసి యెవడి చేతిలోనో పెట్టి చేతులు కాల్చుకున్నాడు

చిన్నా వొక్కడే అయితే పరిస్థితి కొంతలో కొంత మెరుగ్గా వుండేదేమో! పెళ్ళాం కాపురానికి రావడంతో వొకరికి యిద్దరయ్యారు. ముసలాయన మీద భారం. ఇంట్లో వాళ్ళకు కూడా చిన్నా మీద ఆశ సన్నగిల్లింది. వీడి అసమర్థత వల్లే వుద్యోగం రాలేదని అనుకోజూసారు కాని దేశ పరిస్థితులిలా వున్నాయని నమ్మలేకపోయారు. ఎవరైనా సాయంలో యేదేనా అంటే తన అసమర్థతను వేలెత్తి చూపిస్తున్నారని గోరంతలు కొండంతలుగా వూహించి బాధపడేవాడు. చిన్నా తల్లి కొడుకును యేమీ అనలేక తేరగా కూర్చుని తింటున్నావని కోడల్ని సాధించేది. ఆవిడేమో వీడి దగ్గర మొత్తుకుని యేడ్చేది. ఓసారి అత్త కోడళ్ళ మధ్య పెద్ద గొడవ జరిగి చిన్నా పెళ్ళం నూతిలో దూకేస్తే యిరుగు పొరుగు బయటకు తీసి ప్రాణాలు దక్కించేరు. ఈ విధంగా వీడికి మనశ్శాంతి మరీ కరువయ్యింది. దాంతో కొంత కాలం భార్యను పుట్టింటికి పంపించేడు. పెళ్ళిచేసి వో అయ్యచేతికో పిల్లను పెట్టింతరువాత ఆడపిల్లను వాళ్ళు మాత్రం యెంత కాలం వుంచుకోగలరు? అదీకాక కట్నంగా యిచ్చిన డబ్బు చిన్నా వాళ్ళ యింటి ఖర్చులకు

వాడేసి కూతురిని పుట్టింటికి తన్ని తగి లేసేంవి వాళ్ళ కోపం అందుకే వో మంచి రోజు చూసి కూతురిని అత్తింట దిగబెట్టి వెళ్ళిపోయారు మళ్ళీ గొడవ మామూలే

నాకు ఖాళీ వున్నప్పుడల్లా నా దగ్గర కొచ్చి గడిపేవాడు చిన్నా. నాదగ్గరున్నంది వున్నపుడు యెటువంటి అరమరిక లేకుండా డబ్బు తీసుకునేవాడు నా పెళ్లైన కొత్తల్లో వాడి పరిస్థితికి మా ఆవిడ యెంతో సానుభూతి చూపించేది. కాని కాలం గడిచే కొద్దీ మా స్నేహం, నా దగ్గర డబ్బులు తీసుకోవడం ఆవిడకు అంతగా నచ్చలేదు నా ఆర్థిక పరిస్థితి గుర్తుచేసూ ఆ విషయం వొకటి రెండు సార్లు స్పష్టంగానే చెప్పింది.

అందుకే చిన్నా డబ్బుఅడిగిన విషయం సంగతి చప్పలేదు ఆఫీసులో యివ్వగలిగిన వొకరిద్దరు కొలీగ్స్ని డబ్బు విషయం అడిగేను కానీ వాళ్ళు సారీ చెప్పి సారో సీనులో నటించేసేరు. సాయంకాలం ఆఫీసునుంచి వొస్తూ పెళ్లైం తరువాత అత్తగారింటికి వెళ్ళినప్పుడు మా మామ పెట్టిన వుంగరం తాకట్టు పెట్టి చిన్నాకు వంద రూపాయలు యిచ్చేను ఆ రాత్రే వాడు ట్రైన్ యెక్కి మద్రాసు వెళ్లిపోయాడు తరు పాత వుంగరం గురించి మా ఆవిడకూ నాకూ పెద్ద ఘర్షణ జరిగి వో పది రోజులు యెడమొహం పెడ మొహంగా వున్నాం

చిన్నా వెళ్ళంతరువాత వుత్తరాలు రాస్తుండేవాడు. ఒకనెల మాత్రం కొంత డబ్బు పంపినట్టు గుర్తు అర్నెల్లతరువాత మా వూరొచ్చి బెజవాడలో సెటిలవ్వా లనుకొంటున్నటు చెప్పి ఫామిలీని తీసి కెళ్ళిపోయాడు.

కొన్నేళ్ళు వుత్తరాల ద్వారా స్నేహాన్ని కాపాడుకొంటూ వొచ్చేం కాని, వుద్యోగరీత్యా వో రెండు మెట్లు పైకెక్కడంతో రోజంతా ఆఫీసునే అంటి పెట్టుకుని వుండాల్సొచ్చేది తీరిక వోపిక లేక వుత్తరాలు రాయడం కూడ మానేసాను అదీగాక యీ మధ్య చాలా వూళ్ళు తిరగాల్సొచ్చింది. ఇంటిలో కూడా అబ్బాయికోసం నాలుగుసార్లు చూసి లాభంలేక ఆపరేషన్ చేయించు కోవాల్సి వచ్చింది ఆడపిల్లల తండ్రిగా బాధ్యతలు పెరిగి వేరే ఆలోచనలకు అవకాశమే లేకపోయింది ఈ యిరవై యేళ్లల్లోనూ గుట్టు చప్పుడు కాకుండా సంసారం యీడ్చుకొచ్చేనే కాని పెద్దగా వెనకేసింది యేమీలేదు అప్పుడప్పుడు యెదిగొస్తున్న పిల్లల పెళ్ళిళ్ల గుర్తుకు తెచ్చి తను భయపడి నన్ను భయపెడు తుంటుంది మా ఆవిడ. గుడ్డిలో మెల్ల యేమిటంటే పిల్లలు శ్రద్ధగా చదువు కుంటున్నారు పెద్దమ్మాయి బి ఏస్సీ పరీక్షలు రాస్తే రెండో అమ్మాయి ఎం.బి బియ్యేస్ మూడో సంవత్సరంలో వుంది మూడు నాలుగు హైస్కూలులో వున్నారు

తల్లి పోలికలు రావడంవల్ల పిల్లలు బాగుంటారు. అందుకే అమ్మాయి చదివిన కాలేజీలోనే లెక్చరరుగా పనిచేస్తున్న సుబ్రహ్మణ్యం అనే కుర్రాడు యిష్టపడి పెళ్లిచేసుకుంటానంటె మంచి సంబంధం అని ఒప్పుకున్నాం. వెనక పెద్దలు, అసలు కట్నం తీసుకోకపోవడం చిన్నతనమని చెప్పి పదివేలు అడిగేరు పెళ్ళి ఖర్చులూ అవీ యివీ కలసి పదిహేను దాటుతుందని లెక్కేసుకున్నాం. పి.ఎఫ్. మీదా, యిన్సూరెన్సుమీద లోను తీస్తే పన్నెండు వేలదాకా వొచ్చింది మిగిలింది యెలా పూడ్చుకోవాలా అని తలక్రిందులవుతుంటే చిన్నా హఠాత్తుగా గుర్తొచ్చేడు. అందుకే యీ రోజీ ప్రయాణం.

చిన్నా ఇంటి కొచ్చేక రాత్రంతా నిద్ర పోకుండా చిన్నప్పటి కబురులు యెన్నెన్నో చెప్పుకున్నాం. డబ్బు అడగటానికి మొహమాటపడ్డాను కాని యేలా గమనించేడో నా అవసరం, అమ్మాయి పెళ్ళి విషయం చెప్పగానే "డబ్బు యే మాత్రం కూడ బెట్టావ్ ?" అంటూ వివరాలడిగి అసలు విషయం నాచేత యధాలాపంగా చెప్పించేడు కాసేపు ఆలోచించి వొ పదిహేను రోజుల్లో తనే స్వయంగా వొచ్చి ఆ డబ్బు సర్దుతానన్నాడు. ఆ మాట వినగానే నా గుండెలమీద బరువు తొలిగిపోయింది. ఆ రోజుకి వుండపొమ్మని యెంత బలవంత పెట్టినా చిన్నాగాడు చేస్తానన్న సహాయం గురించి మా ఆవిడకు చెపితేనే గాని ఆగలేననిపించి బయలుదేరాను.



# చరిత్రా, పురాణమూ

ఒక జాతి ముందుకు పోవటానికి తోడ్పడేది చరిత్రా, పురాణామా? ఈ ప్రశ్నకు పురాణమే అని సమాధానం ఇచ్చే స్థితిలో ఉన్నవాళ్ళు బహుశా భార తీయులే అయి ఉంటారు. వాస్తవ చరిత్ర లిఖిత రూపాలలో నిక్షేపించటం ఇతర ప్రాచ్య దేశాల వారికి తెలిసినట్టు భారతీయులకు తెలీదు. అందుచేత ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. మన తొలి సంస్కృతిని పాశ్చాత్యులు మన వైదిక సాహిత్యంలో చూస్తే, మన సంస్కృతిని మధ్య ఆసియా వాసులు మన గణితం లోనూ, ఖగోళశాస్త్రంలోనూ, వైద్యశాస్త్రం ములోనూ చూస్తే, మన మటుకు దాన్ని రామాయణంలో చూస్తున్నాం. ప్రపంచా నికి చూపించటానికి గర్వపడుతున్నాం.

మన జీవితానికి ఉపకరించే సత్యా లన్నీ రామాయణంలో ఉన్నట్టు ఆధునిక పౌరాణికులు హోరెత్తేటట్టు ప్రచారం చేస్తున్నారు. చరిత్ర నుంచి ఫలాని విష యాలు మనం నేర్చుకోవాలని గట్టిగా ప్రచారం చేసే వాళ్ళు లేరు. మన భవి ష్యత్తంతా రామాయణం మీద ఆధారపడి ఉంటుండగా మళ్ళీ చరిత్ర దేనికి?

ఇంతకన్న చిత్రం ఏమిటంటే మనం ఆ పురాణాలను ఉన్నవి ఉన్నట్టుగా ఉండనీయటం లేదు. మన సంస్కృతికి పరాకాష్ఠ అయినరామాయణం మూడింత లకు పెంచారు. సీతా కల్యాణమూ, శివ ధనుర్భంగమూ, కుశలవుల కథా, శంబూక వధా అన్నీ రామాయణ ప్రక్షి ప్తాలలో ఉన్నవే. ప్రక్షిప్తాలు కాని రామాయణ భాగాలను కూడా మన పౌరా ణికులూ, ఔత్సాహికులూ మార్చారు. ఆ విధంగా రాముడికి మిత్రుడిగా చెప్పబడ్డ గుహుడు రాముడి భక్తుడయాడు. శబరి ఇంకో భక్తురాలయింది. అక్కడక్కడా సామాన్య మానవుడి దౌర్బల్యాలు బాహా టంగా ప్రదర్శించే రాముడు ఉన్నట్టుండి దేవుడయి పోతూంటాడు!

పురాణ సంస్కృతి మన సంస్కృతికి పునాది అయినా రాజకీయ కారణాలవల్ల మనం కొంతవరకు చరిత్రను గురించి కూడా తోడవటం అవసర మవుతుంది. కాని అందువల్ల కలిగే ఇబ్బందిని దాట టానికి మన పురాణాలకు చేసిన మర్యాదే చరిత్రకు కూడా చేస్తుంటాం— దాన్ని మన పురాణ సంస్కృతికి అనుకూలంగా కూర్చుతూ ఉంటాం. అప్పుడు పురాణా లకూ, చరిత్రకూ అట్టే తేడా ఉండనవ సరం లేదు.

అయితే నాగరిక ప్రపంచంలో చరి

కొడవటిగంటి కుటుంబరావు

త్రలో గల అస్పష్టతను సాధ్యమైనంతగా తగ్గించటానికి అనేక రకాల పరిశోధనలు జరుగుతున్నాయి. అందుకు ఆర్కియాలజీ కొంతవరకు ఉపయోగపడుతున్నది. ఆంత్రోపాలజీ కూడా ఉపయోగపడుతున్నది. ఆర్యులు అనే వాళ్ళు ఎవరు? వాళ్ళకూ సింధు నాగరికతకూ గల సంబంధం ఎటువంటిది? ఇలాటి సవాలక్ష ప్రశ్నలకు సమాధానాలు వెతుకుతున్నారు ఈ పరిశోధనలలో చరిత్ర శాస్త్రవేత్తలకు మన పురాణాలు కూడా ఉపయోగపడటం గమనించదగినది. ఎందుకంటే పురాణాలు తోచీతోచనివాళ్ళు రాసిన కల్పనలు కావు అందులో చరిత్రకు సంబంధించిన సత్యాలు దొరికే అవకాశం ఉన్నది. ఆర్కియాలజీ త్రవ్వకాలు పురాణాలలో ఉండే అంశాలను ఋజువు చేస్తే వాటిని చరిత్ర క్రింద ఆమోదించవచ్చు.

ఇది ఇతర దేశాలవాళ్ళ (శాస్త్రీయ) దృక్పథం మన పురాణ దృక్పథం అది కాదు భీష్ముడు యుద్ధంలో పడిపోయినప్పుడు అంపశయ్య ఎక్కడ ఉన్నదీ నిరూపించిన వారికి లక్ష రూపాయలు! కృష్ణుడు అర్జునుడికి గీత బోధించినది ఎక్కడో ఋజువు చేసిన వారికి లక్ష! ఈ లక్షలు భోజరాజులాగా విసిరివేసే వాళ్ళకు భగవద్గీత ప్రక్షిప్తమై ఉండవచ్చునన్న అనుమానం కూడా లేదు. వాళ్ళు గీతను గురించి డి.డి. కోసాంబీ రాసినదీ చదివి ఉండరు — లేక చదివి కోసాంబీ అజ్ఞానానికి విచారించారో! కాని మన దేశంలో శాస్త్రీయ దృక్పథంతో చరిత్రను విశ్లేషించిన ఆద్యుడు కోసంబీ అని ఈనాటి చరిత్రకారులు, మంత్రాలు తంత్రులూ కాదు! — ఒప్పుకొంటున్నారు.

రాజకీయాలలో తలలు మార్చగల ఘటకులు కూడా చరిత్ర దగ్గరికి వచ్చేసరికి వేలిగా ప్రవర్తిస్తారు కళా సామర్థ్యం గల వాళ్ళు కూడా అదే ధోరణిలో ఉండటం ఆశ్చర్యం లేదు. యధా రాజా. తథా ప్రజా.

ఎటునుంచి వస్తున్నామో తెలిస్తే తప్ప ఎటు పోవాలో తెలిదు. దిక్కు తెలియని వాడికి గమ్యం ఉండదు. నిర్దిష్టమైన భవిష్యత్తుకోసం కృషిచేసే వాళ్ళకు గతం తెలియాలి. అయితే గతం గురించి పురాణ సంస్కృతి కలిగించే అభిప్రాయాలు ఒకొక్కసారి తప్పుదారి పట్టించేవిగా ఉంటాయి. పైగా వాటిని మనం మార్చేస్తున్నాం. రామాయణంలో ఏడంతస్తుల మేడలున్నాయి, కాని హరప్పా నాగరికత అంతరించిన తరవాత వెయ్యేళ్ళకు గాని మన దేశంలో నగరం లాటిది లేదు ఈ ఏడంతస్తుల మేడలు [ప్రక్షిప్తమైన భాగం యివే అయినా] రామాయణ కాలం నాటి సంస్కృతికి చెందినవా? రామాయణం రాసిన నాటి సంస్కృతికి చెందినవా? ఇవాళ తీసిన

సినిమాలలో మన సీతమ్మవారిచేత నైలాన్ చీరలు కట్టించవచ్చు. అంత మాత్రాన ఆకాలంలో నైలాన్ చీరలున్నా యనాలేం కదా!

"ఎందుకు అనకండి ఆ కాలములో లేనిదేదీ ఈ కాలంలో లేదు" ట్రాక్టర్లు అణువు బాంబులూ, ట్రాన్సిస్టరూ, రేడారూ వేదకాలం నాడే ఉన్నాయి" అని వాదించటం మన పురాణ సంస్కృతి అవలంబించే ధోరణి.

చారిత్రిక దృష్టిలో మానవ జీవితం పురోగమిస్తున్నది. మూడు నాల్గు శతాబ్దాల నాటి మహారాజులకు మహారాణులకూ లేని సౌకర్యాలూ ఈనాటి మామూలు మనుషుల కున్నాయి. మంచి రహదార్లు, వేగంగా నడిచే వాహనాలు, సినిమాలు, రేడియోలు, టీవీలు—! విక్టోరియా రాణి మొదటిసారి రైలు ఎక్కి రైలు పదిహేను మైళ్ళ వేగంతో పోతే, "Not so fast, Guard. Not so fast!" అన్నదిట! నూరేళ్ళు తిరగ లేదు; ఆవిడ వారసురాలు ఎలిజబెత్ కావాలంటే 15 వందల మైళ్ళ వేగంతో పోయే విమానంలో ప్రయాణించగలదు!

ఆర్థికంగా కూడా ఒకొక్కప్పుడు పది చదరపు మైళ్ళకు ఒకడు బతకటం దుర్లభంగా ఉండేది ఈనాడు చదరపుమైలుకు అనేక వందలు జీవనం గడుపగల్గుగుతున్నారు. సగటు ఆయుర్దాయం పెరుగుతున్నది. కొద్ది దశాబ్దాల క్రితం చికిత్స లేని ప్రమాదకర వ్యాధులకు ఈనాడు నమ్మకమైన మందు లున్నాయి. "క్షయ మామూలు జ్వరం కన్నా ప్రమాదం కాదు" అని ఈనాటి వైద్యులు అనగలుగుతున్నారు

"ఇటీవలి కాలంతో పోల్చి ఏం లాభం? కృతయుగం నాడు జీవితం ఇంతకన్నాకూడా బాగుండేది!" అంటుంది పురాణ సంస్కృతి. దాని దృష్టిలో మానవుడు రాను రాను దిగనాశిల్లి పోతున్నాడు గదా!

నిజమే అనుకుందాం. కాని మనం కిందటి తరానికి పుట్టి, కిందటి తరంనాటి పరిస్థితులతో సంఘర్షణ పడుతున్నాం గాని సప్తర్షి సంతానం కాము గద. మనకు ప్రత్యక్షంగా కనిపిస్తున్నది పురోగమనమూ, దానికి తోడ్పడే పద్ధతులూనూ. ఉన్నదంతా పోగొట్టుకున్నవాడు మళ్లాగోచిపాతతో ప్రారంభించకతప్పదు. కృతయుగంలో ఏమున్నదో తెలియదు. ఈనాడు ఏ కొత్తది వచ్చినా అది కృతయుగంలో ఉండే ఉంటుందనటం తప్ప, రేపు రాబోయేది అనాడే ఉన్నదని ఈనాడు చెప్పగల తాహతు పురాణ సంస్కృతికి లేదు మరి! అందుచేత మనం మన తాతలు త్రాగిన నేతుల ప్రస్తావన కట్టిపెట్టి, ఏదో ఒక వంట నూనెను అందుబాటులోకి తెచ్చుకునే మార్గం ఏమిటా అని ఆలోచించాలి.




మన దేశంలో చరిత్రజ్ఞానం ఉన్న వాళ్ళు సాధించిన ఉన్నతిని మన పురాణ సంస్కృతితో పోగొట్టుకున్నాం. మహేం జోదారో, హరప్పా నగరాలు ఉచ్ఛ దశలో ఉండగా అలాంటి నగరాలు ప్రపంచంలో ఎక్కడా లేవని తవ్వకాలు రుజువు చేస్తున్నాయి. పాటలీపుత్రం ఉచ్ఛదశలో ఉండగా అంత వైభవం గల నగరం ప్రపంచంలో ఏక్కడా లేదట. అశోకుడి రాజ భవనాన్ని చూసిన యాత్రికులు దాన్ని మనుషులు కట్టలేదు, దేవతలు కట్టా రన్నారట। చరిత్ర జ్ఞానంగల మౌర్యులూ, గుప్త రాజులూ మన సంస్కృతిని అత్యున్నత ప్రమాణాలకు తీసుకుపోయారు. ఈనాడు మనకు అలాటిదేమీ లేదు. మనకు పురాణాలలో కూడా పురాణం అనిపించు కునే అర్హతలేని చెత్త రామాయణమూ రాంభజనా మిలిలాయి' మానవజాతి దిగ జారిపోతున్నట్టు పురాణ సంస్కృతి చెప్పనే చెప్పింది. గనక మనం అట్టడుగు లేసి పోవటానికి మానసికంగా తయా రయే ఉన్నాం.

---

# పిలుపు



సి.ఎల్.ఎన్. శాస్త్రి

"రాధా! చూడు. కొంచెం తిను. రాధా నా మాట విను." "లేదండి నేను పాపిష్టిదాన్ని. చేజేతులా చేసుకున్నాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు". రాధ వెక్కి వెక్కి ఏడుస్తోంది. "రాధా ఊరుకో. అయిపోయినదానికి ఏంచేస్తాం.

నాకాఫీసు టైమవుతోంది అమ్మా నేను వెడుతున్నాను. దానిచేస్త కాస్త తివి పించవే." "అలాగేరా నాయనా. ఊ( ఏమిటో కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుందని".

స్కూలు బస్సు అప్పుడే వెడుతోంది. దానివేపు జాలిగా, బాధగా చూశాడు రామారావు. రామారావు సైకిలు తొక్కుతున్నాడు. కాని అతని ఆలోచనలు వెనక్కి వెళుతున్నాయి. రాధ అవును రాధకి తగినశాస్తి జరిగింది. కాని అది తనకుకూడా కదా ఏ వస్తువూ ఉన్నప్పుడు దాని విలువ తెలియదు.

అప్పుడే ఆరునెలలు గడిచాయి....

* * *

రామారావు ఆ ఊళ్ళో యుడిసిగా పనిచేస్తున్నాడు. రాధ అతని భార్య రాధ బి ఏ. వరకు చదువుకుంది. కాని ఆడదాని కుండవలసిన సౌశీల్యం, వినయం, అణకువ ఏ కోశానా లేవు. వాళ్ళకి బాబు, పాప ఇద్దరు పిల్లలు. పాపకి మూడేళ్ళు వచ్చాక రామారావు ఇంక పిల్లలు కలగ కుండా ఆపరేషను చేయించుకున్నాడు. తను ఒక క్లర్కే అయినా పిల్లల భవిష్యత్తు కోసం, వాళ్ళని ఫీజులు ఎక్కువైనా కాన్వెంటులో చేర్పించాడు. బాబు, పాప చాలా చురుకయినవాళ్ళు. క్లాసులో ఎప్పుడు ఫస్టువస్తూ ఆటల్లో కూడా చురుగ్గా ఉండేవారు. బాబుకి పది పాపకు ఏడేళ్ళు బాబు అయిదు, పాప మూడు చదువుతున్నారు

"నానమ్మా, ఈవాళ మాకు స్కూల్లో కామిక్సు భాగవతం బుక్కు ఇచ్చారు అందులో కథలు చెప్పనా?" "నాకు ఇంగ్లీషు రాదురా నాయనా. అయినా భాగవతంలోదే కథ ఒకటి చెప్తానురండి" "నేను నానమ్మ ఒళ్ళో కూర్చుంటాను" "అన్నా నేను ముందడిగాను నేనే" "పాప చిన్నదికదా బాబూ దాన్ని కూర్చో నియ్యి." సర్లే ఇద్దరూ కూర్చోండి వినండి కద్రువ, వినత అని ఇద్దరు అక్కాచెల్లెళ్ళు ఉండేవారు. కద్రువ నాగులకు తల్లి. ఒకరోజు ఒక గుర్రాన్ని చూశారు. దాని తోక తెల్లగా ఉందని వినత, కాదు నల్లగా ఉందని కద్రువ వాదించుకున్నారు ఎవరు గెలిస్తే వాళ్ళు రెండోవాళ్ళకి దాస్యం చేయడానికి ఒప్పందం ఆరోజు గడిచిపోయింది మరురోజు దగ్గరకి వెళ్ళి చూడ్డానికి తన కొడుకుల్లో ఒక నాగుణ్ణి గుర్రం తోకకి చుట్టుకునేట్టు చేసి కద్రువ పందెం గెలుస్తుంది. వినత చేసేదిలేక పందెం ఓడిపోతుంది చివరకు గరుత్మంతుడు అమృతం తెచ్చి నాగులకిచ్చి తల్లి వినతను దాస్యం నుంచి విముక్తురాల్ని చేస్తాడు. చూశారా? తల్లికోసం కొడుకు ఎంతో కష్టపడ్డాడన్నమాట." "చాలా బాగుంది నానమ్మా. అమ్మా చెప్పను కొట్టకమ్మా. కొట్టకమ్మా." "ఎందుకే

వాడ్నలా కొడతావు. వాడేంచేశాడే తల్లీ?" "ఏంచేశాడా? తలుపు బార్లా పెట్టి ముసలమ్మ కథలు వింటున్నాడు పిల్లి పాలుకాస్తా తాగేసింది." "అమ్మా! కొట్ట కమ్మా. ఇంకెప్పుడు అలా వదలనమ్మా." వెధవా, స్కూలునించి వచ్చాక పాలు తాగి తలుపేయమన్నానా?" "ఎందుకే వాడ్నలా చంపేస్తావేమిటే!" "మీరు అనవసరంగా కలగజేసుకోకండి. చచ్చినా బాగుణ్ణు పీడ విరగడవుతుంది. వెధవ పిల్లలు ప్రాణాలు తోడేస్తున్నారు."

• • •

"పాపా! అక్కడ గూట్లో అద్దం ఉంటుంది పట్రా అమ్మా. షేవింగు చేసుకోవాలి. పాప అద్దం తెస్తూ గడప తగిలి పడిపోయింది. అద్దం ముక్కలై పోయింది. రాధ వీక్లీ చదువుకుంటున్నది లేచి పాపని ఫెడీఫెడీ కొట్టింది. "గుంట ముండా. అద్దం తిన్నగా పట్టుకోలేవే." "రాధా! ఏమిటది? నీ ఆగడం రోజు రోజుకీ శృతిమించుతోంది. రాత్రికి రాత్రి బాబుని. అద్దం నే నే తెమ్మన్నాను. అసలు నువ్వు కన్న తల్లివేనా? రాక్షసివా?" "అవును లెండి నేను రాక్షసి లాగే కనబడతాను. మోజు తీరిపోయాక అంతే." అనవసరంగా నోరు జారకు. నువ్వు ఖాళీగానే కూర్చున్నావుగా. నువ్వు తేవచ్చుగా. పాపని తెమ్మని చెప్పినప్పుడు నువ్వూ విన్నావుగా పోనీలే పాపా ఏడవకు మరొకటి కొనుక్కుందాం" "అంతే లెండి మీ ముద్దుల కూతురు బద్దలు కొట్టిందిగా. నష్టమేమీ లేదు" "మరేందిగులు పడకు నా సొమ్మేగా పోయింది. నేను కొనుక్కుంటానులే" "అంతేలెండి ఇదంతా మీ సొమ్మే. ఈ కుర్చీలు, బల్లలు ఆఖరికి నే కట్టుకున్న చీర, జాకెట్టుకూడా...." "ఛీ ఛీ నీతో వాదమేమిటి." "అవును లెండి, నోరు కుట్టేసుకోండి." రామారావు ఇంక వినలేక విశ్రమించాడు.

"బాబూ, పాపా తయారయ్యారా?" "మేము రెడీ డాడీ." "గుడ్ రండి బస్సుటైము అయింది." "బాబూ, పాపా జాగ్రత్తగా వెళ్ళండి. ఇంటర్‌వెల్‌లో ఆడకండి క్లాసులోనే కూర్చోండి. మళ్ళీ సాయంత్రం బస్సు జాగ్రత్తగా ఎక్కండి." "అలాగే డాడీ. వస్తాం డాడీ టాటా." రామారావు వాళ్ళని బస్సు ఎక్కించి ఆఫీసుకి సైకిలుమీద బయలు దేరాడు.

• • •

"అమ్మ మంచిది కాదేం. డాడీ మంచి వారు. నానమ్మకూడా మంచిదే నానమ్మ మంచి మంచి కథలు చెప్తుంది. డాడీ అసలు కోపమే తెచ్చుకోరు. ఏమైనా పాడుచేసినా కూడా ఏమీఅనరు. అమ్మ అస్తమానం కొడుతుంది" "అవునన్నయ్యా అమ్మ రాక్షసి, దయ్యం భూతం డాడీ దేముడు" అటుగా వస్తున్న




రామారావు వాళ్ళ మాటలు విన్నాడు. "బాబూ పాపా! ఇలా రండి. తప్పమ్మా అమ్మని అలా అనొచ్చా?" "మరెందుకు అస్తమానం కొడుతుంది?" "ఇంక కొట్టకుండా నేను చెప్తానమ్మా." "ఛీ నువ్వెప్పుడూ అబద్ధాలు చెప్తావు. ఇలాగే చాలా సార్లు అన్నావు. కాని అమ్మ ప్రతిసారీ కొడుతోంది." రామారావు మౌనంగా ఉండిపోయాడు.

"నానమ్మా పడుకున్నావేం?" "కొంచెం నడుము నొప్పిగా ఉంది నాయనా." "నేను రాయనా నాయనమ్మా." "వద్దు నాయనా. నా బంగారు తండ్రే. ఆ మాటచాలు. మీ అమ్మ చూస్తే కోప్పడుతుంది" "ఫర్వాలేదు నానమ్మా. ఏది అటు తిరుగు నేను రాస్తాను." రాధ ఇవన్నీ దూరంనించి వింటోంది. కాసేపు పోయాక సుడిగాలిలా వచ్చి బాబుని బరబరా ఈడ్చుకుపోయి వీపు మీద గుద్దేసింది. "అమ్మా! అమ్మా! కొట్టకమ్మా. నానమ్మకి నడుంనొప్పిగా ఉంటేను." "వెధవా! నానమ్మ మీద ప్రేమ నుండిపోతోంది. ముసలి ముండకి సేవ. నేను తలనొప్పితో అలా గింజుకుంటుంటే కాస్త అమృతాంజనం రాస్తానన్న ముక్క లేదు." "వాడి తప్పేమిదమ్మా రాధా? ఎందుకు పిల్లవెధవనిలా కొడతావు నేను వద్దనే అన్నాను. అయినా పిల్లాడు ప్రేమ చంపుకోలేక." "అబ్బో మహాలావు ప్రేమ నానమ్మ మీద ప్రేమ." "అవునమ్మా ప్రేమే. ప్రేమ గురించి నీకేం తెలుసు? ప్రేమ ఇస్తే ప్రేమ పుడుతుంది." "చాల్లెండి నీతులు. అయినా నా కొడుకుని నేను ఇష్టం వచ్చినట్టు చేసుకుంటాను. మధ్య మీరెవరు కలుగజేసుకోవడానికి?" "అవునులే తల్లి. నువు చెప్పిందే నిజం."

ఆవాళ రాత్రి భోజనాల టైము. "అన్నయ్యా నన్ను ముట్టుకో. నేను దాంకుంటాను." "ఆ పాపా దొరికావు"

"నేను దొరకనుగా" అంటూ పాప వంటింటి వేపు పరిగెట్టింది. అటు వేపు నించి రాధ మజ్జిగ తెస్తూంటే పాపతల్లిని గుద్దుకుంది. మజ్జిగ నేలపాలయింది. రాధ శివమెత్తింది.

"వెధవల్లారా ప్రాణాలు తోడేస్తున్నారు. మీరు పిల్లలా పిశాచాలా" అంటూ ఇద్దర్నీ బాదేసింది. "కొట్టకు మమ్మీ. ఇంకెప్పుడూ అల్లరి చేయం మమ్మీ" అంటూ పిల్లలు గోలగోలగా ఏడిచాక రామారావు వచ్చి రాధని వారించాడు. "అవునులెండి. నేను చెడ్డదాన్ని. పిల్లల్ని పెంచడం తెలియదు. ఇప్పుడు అన్నం మింగుతారుగా. మజ్జిగ లేకుండా మింగండి" అంటూ విస విసా వెళ్ళి పడుక్కుంది.

* * *

అవి ఆఫీసులో ఇనస్పెక్షను రోజులు. రామారావు ఉదయమే ఆరు గంటలకే లేచి గబ గబా తయారయి ఆఫీసుకి వెళ్ళిపోతున్నారు. మళ్ళా రాత్రి పది గంటలకి వస్తున్నాడు. బాబుని, పాపని గురించి అసలు పట్టించుకుందుకే టైము లేదు. రామారావు వచ్చేసరికి పడుకుండిపోతున్నారు వాళ్ళు లేచేసరికి తను వెళ్ళిపోతున్నాడు. ఏమీ గొడవ జరగటం లేదనే భావిస్తున్నాడు.

ఆ రోజు బాబు పాప స్కూలు నించి ఇంటికి వచ్చారు. బాబు స్కూల్లో టిఫినుబాక్సు పారేశాడు. బాక్సు క్లాసులో పెట్టి, పి. టి. అవరులో గ్రౌండ్స్‌లోకి వెడితే, ఎవరో కొట్టేశారు. అదే చెప్పాడు. "వెధవా. మనమేమైనా జమీందార్లు మనుకున్నావా? రోజుకో వస్తువు తగలేస్తారు మిమ్మల్ని బయటకి పంపించడం భయం. ఉండు నీకిలా కాదు. ఎన్ని తన్నినా బుద్ధిరావటంలేదు" అంటూ గరిట కాల్చి వాతలు పెట్టింది. బాబు అమ్మో అమ్మో అంటూ గుక్క తిప్పుకోకుండా ఏడ్చేశాడు. అడ్డుకోబోయిన నానమ్మని తోసేసింది రాధ. పాప కూడా బాబుని చూసి ఏడ్చేసింది. నానమ్మ బాబుని ప్రక్కనే ఉన్న డాక్టరు గారి దగ్గరికి తీసికెళ్ళి కాస్త మందు రాయించింది. ఆ రాత్రి నానమ్మ దగ్గరే ఇద్దరూ పడుకున్నారు

మరునాడు ఉదయమే బాబు లేవలేక లేచాడు. రాత్రి జరిగింది గుర్తుకొచ్చింది. రాధ పిల్లలకి టిఫిను చేయలేదు. బాక్సు పారేసినందుకు శిక్ష "మాడండి వెధవల్లారా. నీతోపాటు అది కూడాను" అంది రామారావు ఉదయమే వెళ్ళిపోయాడు లంచ్ అవరులో బాబు, పాప ప్లేగ్రౌండులో కలుసుకున్నారు. రోజూ కలిసి టిఫిను తినేవాళ్ళు అవాళ బాగా ఆకలేస్తోంది. "అన్నయ్యా కిషోరు అక్కడ కూర్చుని తింటున్నాడు. కొంచెం అడుగుదామా?" "తప్పు. డాడీ ఏం చెప్పారు? ఎవర్నీ అడగకూడదనలేదు. దా మనం ఆట ఆడుకుందాం.

చూడు ఆ నూతిదగ్గిర సింహం, కుందేలు ఆట ఆడుదాం. నువ్వు కుందేలు, నేను సింహం. నువ్వు అనాలి మహరాజా, మీలాంటి సింహమే నూతిలో దాంకు నుంది అని" పాప అడిగింది. బాబు "ఏదీ ఎక్కడా?" అని గర్జించాడు. పాప విరగబడి నవ్వింది "అన్నయ్యా ఇంకోసారి అను" అంది పాప. బాబు గర్జించాడు. పాప మళ్ళీ నవ్వింది. ఇద్దరూ నూతిలోకి తొంగి చూస్తున్నారు. అది కొంచెం పాత నుయ్యి అవడం వల్ల వాళ్ళు అనుకున్న, నూతిగోడ లోపలికి పడిపోయింది. దాంతో పాటు పాప "అన్నయ్యా" అని అరుస్తూ పడి పోయింది. వెంటనే "పాపా" అంటూ పట్టుకోబోయి బాబు. అంతే దూరంగా ఉన్న పిల్లలు ఇది చూసి హాహాకారాలు చేశారు ప్రిన్సిపాలుతో చెప్పారు.

రామారావు ఇనస్పెక్షను రికార్డులన్నీ పూర్తయ్యాయి. బాస్ ఎంతో మెచ్చు కున్నారు ఇంతట్లో ఫోను వచ్చింది "మీరు వెంటనే ఒకసారి స్కూలుకి రావాలి" ప్రిన్సిపాలు కంఠం. "ఏం జరిగింది మేడం?" ఆతృతగా ప్రశ్నిం చాడు రామారావు. ఇక్కడికి వస్తే చెబు తాము. వెంటనే రండి" అని ఫోను పెట్టేసింది మేడమ్

రామారావు వెళ్ళేసరికి బాబు, పాప ఒక బల్లమీద పడుకోబెట్టబడి ఉన్నారు. నిర్జీవంగా మిగిలారు. అయినా మొహాలు నవ్వుతూ కళగా ఉన్నాయి. అప్పటికే నీళ్ళు ఎక్కువగా త్రాగడం వల్ల. చిన్న పిల్లలు కావడం వల్ల వెంటనే బయటకు తీసినా లాభం లేకపోయింది. మేడమ్ జరిగిందంతా వివరిస్తున్నారు రామారావు కన్నులు అశ్రువులు వర్షిస్తున్నాయి. అయినా మగవాడు కనుక ధైర్యం కూడ గట్టుకున్నాడు స్కూలుకి ఆ పూట, మరో రోజు శలవు ప్రకటించారు. తోటి పిల్లలు కూడా ఏడుస్తున్నారు. అందరి సాయంతో రామారావు టాక్సీలో వాళ్ళని ఇంటికి తీసుకువచ్చాడు.

"రాధా! ఇప్పుడు నీ కడుపు మంట చల్లారిందా? చావండి చావండి అని శపించావు. కన్నతల్లివి. అదిగో చూడు. నీ కోర్కె తీరింది. మరెప్పుడూ నీకు అడ్డురారులే. ఏ పనీ, ఏ వస్తువూ పాడు చెయ్యరులే." రాధ ఒక్కసారి విశ్చేష్ట అయ్యింది. ఇలా జరుగుతుందని తను అనుకోలేదు. తరువాత వాళ్ళమీద పడి రోదించింది. బరియల్ గ్రౌండుకి స్కూలు స్కూలంతా తరలి వచ్చింది పిల్లలంతా కలిసి బాబు, పాపల ఆత్మ శాంతికి ప్రేయర్సు జరిపారు. వాళ్ళమీద పూల మాలలు కురిపించారు. అప్పటితో స్కూలుకి తనకి ఋణం తీరిపోయింది,

గతం ఆలోచిస్తూ రామారావు అప్పుడే ఆఫీసుకి చేరుకున్నాడు. నిర్లి ప్తంగా సీటులో కూర్చున్నాడు. మోడు వారిన జీవితాన్ని భారంగా లాగడానికి.

---

# వయసొచ్చిన మనసు

మైనంపాటి భాస్కర్



పెళ్ళికొడుక్కి ప్రెజెంటేషన్ కొనాలి.

అబిడ్స్‌కి వెళ్ళాం. నాకు తోడుగా మనోహర్. వాడు మా అన్నయ్య కొడుకు. ప్రెజర్ కుక్కరొకటి కొన్నాను.

"నెక్స్ట్ నీ మారేజ్ కొట్టోలు! పెళ్ళిచేసుకొని స్టేట్స్‌కి వెళతావా? తిరిగి వచ్చాక చేసుకుంటావా? లేకపోతే అక్కడే ఎవర్నన్నా చేసేసుకుంటావా?" అన్నాను.

వాడు ఎలక్ట్రానిక్స్‌లో యూనివర్సిటీ సెకండు వచ్చాడు. స్కాలర్‌షిప్ మీద టెక్సాస్ యూనివర్సిటీలో చదవడానికెళుతున్నాడు. సన్నగా, పొడుగ్గా, నాజూగ్గా, అందమైన అమ్మాయి లాగా ఉంటాడు.

"ముందు నీ పెళ్ళి కానియ్యి బాబాయ్! తర్వాత నా సంగతి ఆలోచిద్దాం" అన్నాడు వాడు వేళాకోళంగా వాడికి నా దగ్గర చనువెక్కువ.

పెళ్ళి అన్నమాట వింటే నా మనస్సు బరువెక్కిపోతుంది.

పాతికేళ్ళ క్రిందట .... అంటే నాకు పాతికేళ్ళు నిండడానికి ఇంకా అయిదేళ్ళున్నప్పుడు....

....ఇదో ఈ ఊళ్ళోనే,....లత అని ఒక దేవత....ప్రబంధాల్లో వర్ణించినట్లు నెమళ్ళకు అందంగా నడవడం నేర్పుతూ కోయిళ్ళకు తియ్యటి మాటలు నేర్పుతూ, చందమామకు చల్లగా ఉండడంలో ట్రెయినింగ్ ఇస్తూ ఉండేది.

లత ....

లతలాగే సన్నగా, లేతగా, అందంగా,

లతని నేను ప్రేమించడానికి లక్ష కారణాలున్నాయ్. అయితే లత నన్ను ప్రేమించడానికి వెదికి చూసినా ఒక్క కారణమూ కనబడదు.

కానీ ప్రేమించింది.

అదృష్టమా?

దానికీ నాకూ చాలా దూరం.

ఆ లతతో నాకు పరిచయం లేకపోతే, లత నన్ను ప్రేమించకపోతే, లత నా ప్రేయసి కాకుండా కేవలం ఆరాధ్య దైవంగా మాత్రమే ఉండి ఉంటే....

ఈనాడీ రంపపుకోత ఉండేది కాదు

"పెద్దవాళ్ళకిష్టంలేదని తెలిపోయింది మనం పెళ్ళి చేసేసుకుందాం." అంది లత, ధైర్యంగా.

ఆ ధైర్యం నాకు లేకపోయింది.

"కాదు లతా! ముందు ఉద్యోగం దొరకాలి మన కాళ్ళమీద మనం నిలబడగలగాలి. అప్పుడే పెళ్ళి" అన్నాను

చదివిన చదువుకి ఇంకే ఉద్యోగాలు దొరకక్క, ఆర్మీలో చేరాను నార్తిండియాకి వెళ్ళిపోయాను.

అప్పుడు జరిగిపోయింది ఘోరం!

లతని బలవంతంగా ఒక మోడుకి అర్పించారు వాళ్ళ పెద్దవాళ్ళు

ఆ పిల్ల ఏం చేస్తుంది? నాకు ఉత్తరం రాసే పాటుంది. రాసిఉంటాలి కానీ నాకు చేరలేదు.

ఆ తర్వాత నేను ఇటువైపు రాలేదు థార్ ఎడారి అంచుల్లో, ఆ వేడిలో, భగ్నమైన ప్రేమ సెగలో, జీవితమంతా కాల్చేసుకున్నాను.

క్రిందటి నెలే రిటైరయ్యాను.

తరం మారుతోంది. అన్నయ్య పెద్దకొడుకు పెళ్ళి.

ఇన్నాళ్ళకు మళ్ళీ నా ఊరు. నా బంధువులు. ముసలాళ్ళు మరిక లేరు.

పెద్దవాళ్ళు ముసలాళ్ళయ్యారు.

పిల్లలు పెద్దాళ్ళయ్యారు.

నే నెరగని పిల్లలు చాలామంది ఉన్నారు

ఊరు చేరగానే ఊపిరి ఆగిపోయేలా తెలిసిన వార్త—లత రెండేళ్ళ క్రితం పోయిందట

* * *

పెళ్ళి హడావిడిలో

చటుక్కున షాక్ కొట్టినట్లయింది.

లత .... ఇరవై, ఇరవై రెండేళ్ళ లత....అచ్చం అలాగే... ఇది నిజమా? ఇది సంభవమా?

"ఏమిటలా చూస్తున్నావ్? మా అమ్మాయే! లావణ్యా! మామయ్య. ఆర్మీలో ఉంటున్నారని చెప్పలేదూ?" అంది రుక్మిణి.

లావణ్య! రుక్మిణి కూతురు! అంటే వరసకు నా మేనకోడలు ఒక్క క్షణం సేపు లతా అనుకున్నాను. మనిషిని పోలిన మనుషులుండటం అంటే ఇదే!

లావణ్య నాజూగ్గా ఉన్న చేతులెత్తి నమస్కారం పెడుతూ దగ్గరకొచ్చింది.

భుజంమీద చెయ్యేశాను.

"నువ్వు పుట్టిన తర్వాత ఇప్పుడే చూస్తున్నా లావణ్యా!" అన్నాను. గొంతు తెలియని దుఃఖంతో పూడుకు పోయింది.

* * *

లావణ్య పేరు మాత్రం అతికి నట్లు సరిపోయింది బంగారపు తీగెలా, చీకటి రాత్రిలో మెరుపులా, వన్నెగా, పొడుగ్గా లావణ్య

లావణ్య పందిట్లో తిరుగుతూ ఉంటే చాలామంది తననే తదేకంగా చూడడం గమనించాను

సహజం

అందమైన ఆడపిల్ల

వాళ్ళ అమ్మ తాలూకు ఆస్తీ, నాన్న తాలూకు హోదా ఆ అమ్మాయికి విర్రవీగే రాన్ని తెచ్చి పెట్టాయో గానీ, గర్వాన్ని ఇవ్వలేదు.

ఎమ్మెస్సీ చదువుతోంది. తర్వాత రిసెర్చి చేస్తుందిట. తనే చెప్పింది.

తను వడ్డనలోకి వస్తే అందరూ మారు వడ్డించుకునీ, ఏవేనో ప్రశ్నలేసీ, తొందరగా కదలనివ్వరు.

మనోహర్ మరీనూ.

"ఇంకో లడ్డు వెయ్యి." అన్నాడు. ఆమె చేతిలో ఉన్నది పులుసు గిన్నె.

వెళ్ళి లడ్లు తెచ్చింది.

"ఇందాక వంకాయ కూర అడిగాను. వెయ్యలేదు." నిష్టూరంగా అన్నాడు.

తెచ్చి వేసింది.

"నెయ్యి"

ఒక్కసారి కోపంగా చూసి, అంతలోనే నవ్వేసింది.

"నెయ్యి మళ్ళీ నేను తెచ్చేదాకా కూర్చో తొందర్లేదు." అని నవ్వుతూనే పక్కకి జరిగిపోయింది

బంగారం రంగు పట్టుచీరె కుచ్చెళ్ళు




ఒకవైపు ఎత్తి బొడ్లో దోపుకుంది. పచ్చటి పాదాలు వాటిమీద జీరాడుతున్న తెల్లటి పాల నురుగులాంటి పరికిణీ.

నెయ్యి తెచ్చి గిన్నెతో విస్తట్లో ఒంపేసింది. "ఏయ్! ఏమిటది? చాలు. చాలు." అన్నాడు మనోహర్ కంగారుగా.

"అడిగావు. వేస్తున్నాను."

ఈడూ జోడూ కుదిరిన కుందేళ్ళ జంటో, లేళ్ళ జంటో ఒకదాన్ని ఒకటి తరుముకుంటూ సరదాగా ఆడుకుంటున్నట్లు ఉంది చూసే వాళ్ళకి

"ఎప్పుడు నువ్వు స్టేట్స్ కెళ్ళేది?" అని పలకరిస్తున్నాడెవరో బంధువు.

"పెళ్ళి చేసుకుని దాన్ని కూడా తీసుకెళ్ళ మంటున్నాం." అంది మా వదిన మనోహర్ తల్లి

ఆ సంభాషణలో పేర్లు దొర్లక పోయినా, పెళ్ళి జరగాల్సింది మనోహర్ లావణ్యలకని అక్కడున్న వాళ్ళకందరికీ చెప్పకుండానే అర్థమవుతోంది

ఆ క్షణంనుంచీ లావణ్య ఆ పరిసరాల్లో కనిపించడం మానేసింది.

సిగ్గు! యూనివర్శిటీ చదువులు చదివినా! భోజనం చేస్తూ ఒకసారి చుట్టూ చూశాను.

చివరి పంక్తి.

అందరూ దగ్గర బంధువులు అందరూ పెద్ద పెద్ద హోదాల్లో కొచ్చారు. ఉద్యోగాలు చెయ్యని వాళ్ళు వ్యాపారాల్లో బాగా సంపాదించుకుని ఆస్థులు కొన్నారు.

ఎవరి దీవెనవల్లో గాని బాగుపడ్డాయి మా కుటుంబాలు.

ఒక్క నరహరి తప్ప

నరహరి నాకు కజిన్ అవుతాడు అరసేదో ఆఫీసులో గుమస్తా అదేం ఆఫీసో - నీ పాతికేళ్ళయినా ప్రమోషన్ లేదుట. అలాగే ఉన్నాడు సంసారం పెద్దదయింది. కొడుకు మూర్తి బియేదాకా చదివి తనూ ఓ గుమస్తా ఉద్యోగం సంపాదించి తండ్రికి సాయపడుతున్నాడు. వాసు చాలా తెలివైనవాట్ట-మనోహర్ చెప్పాడు

"నాటికి ఇంట్లో శాంతి ఉంటే భలే పైకి వచ్చి ఉండేవాడు బాబాయ్! ఇంట్లో రోజూ ఏదో రకం గొడవ వాడి కెరీర్ పాడయిపోయింది " అన్నాడు వాడు.

మూర్తి నెరిపోలేదు కాని బాగు పడనూ లేదు నేను వచ్చినరోజు పలకరించి ... మళ్ళీ మాట్లాడ దామంటే కనబడటమే లేదు. వాడు.

ఉంటే వంటపాకలో ఉంటాడు. లేకపోతే సైకిలేసుకుని బజారుపన్లు చేస్తుంటాడు.

పెళ్ళి దాదాపు వాడి చేతిమీదే జరుగు తోంది.

ఒక్కొక్క క్షణం ఒక్కొక్క మూల, ఒక్కొక్క రూపంతో కనబడు తుంటాడు.

తెలివైనవాడు. అందరూ అదే అన్నారు." అయితేనేం. అదృష్టంలేదు.

నా భ్రమ అయి ఉండవచ్చు. లావణ్య నిశ్చితార్థ ఉంటే, ఆ ప్రాంతా లకు వాడు తరచుగా వస్తున్నట్లని పించింది

"లావణ్యా! కాస్త తమలపాకులు అందుకో!" అని ఎవరన్నా కేకవేస్తే, లావణ్య చేతిలో ఓ కట్ట తమలపాకులు కుక్కేసి క్షణం మాయమయ్యేవాడు మూర్తి. లావణ్య తన ఫ్రెండ్స్‌ని టిఫెన్‌కి తీసుకొస్తే, కాఫీ గంగాళం దగ్గర వీడు సిద్ధం!

వాడి పద్ధతులు క్షమించాను నేను.

వాణ్ణి చూస్తే జాలివేసింది. లావణ్య అపురూపమైన అందగత్తె. వీడు పెద్దగా బావుండడు! బిగుతుగా ఉన్న ప్యాంటూ, కొద్దిగా పాతబడ్డ షర్టూ, అదో రకంగా ఉంటాడు

అయినా, మనిషన్న తర్వాత ఆశ సహజం!

క్షమించాను వాణ్ణి — లావణ్యని పూసుకు పూసుకు తిరుగుతున్నా!

* * *

పెళ్ళయిపోయింది.

బంధువులం మాత్రమే మిగిలాం.

చిరుచీకటి పడుతుండగా, డాబామీదికి ఎక్కాను.

లావణ్యా, మనోహర్ కూర్చుని ఉన్నారు ఇంకెవరూ లేరు.

ఏం చెయ్యాలో తోచలేదు. వెనక్కి తిరిగిపోదాం అనుకున్నాను.

మరి వాళ్ళేం అనుకుంటున్నారో

చీకటివల్ల మొహాల్లో భావాలు కన బడటం లేదు.

"రా బాబాయ్!" అన్నాడు మనోహర్ వాడి గొంతులో తడబాటులేదు. చెప్పా నుగా వాడికి నా దగ్గర చనువెక్కువని.

"కూర్చో మామయ్యా" అంది లావణ్య. కొద్దిగా సిగ్గు! మామూలే!

నాకు కళ్లు దొరకలేదు. నా మొహం! కళ్లా ఏముంది? అర్థమై పోవట్లేదూ? అబ్బాయీ అమ్మాయీ, ఏకాంతం!

కూర్చున్నాను.

"అందుకే అంత్రోపాలజీ చదవమం టున్నాను. ఏం బాబాయ్? బెస్టుకాదూ?" అన్నాడు మనోహర్.

ఓరీ! ఎంతలో మాట మార్చేశావురా? మీరిద్దరూ చీకట్లో డాబా మీద కూర్చుని ... గురించి మాట్లాడు కుంటున్నారూ? అని నన్ను నమ్మ మంటావూ? ఇంతేం జోకు తట్టలేదూ నీకు? ఈ కాలం పిల్లలు!

ఇదేమిటి నాకు? కొద్దిగా ఈర్ష్యా? అందంగా అన్యోన్యంగా ఉన్న జంటని చూసి భరించలేక పోతున్నానా? జీవిత మంతా నాశనం చేసుకున్న నేను, ఎదుటివాడి జీవితం బాగుపడుతుంటే చూడలేక పోతున్నానా?

లేకపోతే లావణ్య అచ్చం లత లాగా ఉండడం వల్ల బాధనా? గతం గుర్తొస్తోంది. మేం పెళ్ళిచేసుకోలేక పోయాం. ఇప్పుడు వీళ్ళు స్వేచ్ఛగా, యధేచ్ఛగా ఉండడం భరించలేక పోతున్నానా?

బాధపడి ఏం చేస్తాను?

లావణ్యని పెళ్ళిచేసుకోనా? ·

అహ్హహ్హా!

నవ్వైనా రావటం లేదేం? నిజంగా నాలో అలాంటి భావం ఉందేమిటి?

లావణ్యకు పెళ్ళి! లావణ్యకు పెళ్ళి! లావణ్యకు పెళ్ళి!

ఎవరితో?

నాతోనే!

అహ్హహ్హా!

నవ్వాకు. నాలో ఏం తక్కువ?

మేజరుగా పనిచేస్తూ రిటైర్‌మెంట్ తీసుకున్నాను నిండా నలభై ఐదేళ్ళు లేవు నాకు. కణతలుమాత్రం నెరిశాయి. ఎక్సర్‌సైజుతో ఒళ్ళు ఇనపముక్కలా గట్టిపడింది. ఈ సోకాల్డ్ యంగ్ మెన్స్ కంటె దృఢంగా నే ఉంటాను, అంతెం దుకు? ఈ మనోహర్ గాణ్ణీ, మూర్తి గాణ్ణీ చెరోచేతిలో పట్టుకుని గిరిగిరతిప్పి కింద పడెయ్యగలను

మనోహర్! మూర్తీ!

హఠాత్తుగా నా మనసు నాకర్థమైంది.

వీళ్ళిద్దరూ నా ప్రత్యర్థులు! వరసకి నాకు కొడుకులు. ఒక ఇరవైయ్యేళ్ళ పడుచుకోసం వాళ్ళతో నేను పోటీ!

లావణ్యతో పెళ్ళి! ఎవర్ని, ఎలా, ఏ ముఖం పెట్టుకుని అడగను? ఏమని అడగను? అయ్యో!

* * *

మర్నాడు

అందరం భోజనాలుచేసి హాల్లో కూర్చున్నాం

పెళ్ళి టెన్షన్ తగ్గిపోయి, కబుర్లు వేళాకోళాల్లో పడ్డారు అందరూ.

నానారకాల విషయాల మీద కబుర్లు, గోవిందుని పిలిచి సిగరెట్లు తెమ్మన్నాను.

మర్చిపోయాను! గోవిందెవరో చెప్పలేదు కదూ? వాడొక అనాథ. మనోహర్ వాళ్ళింట్లో పెరుగుతున్నాడు. అన్ని పనులూ చేస్తుంటాడు వాడినిచూస్తే నాకు జాలి. ఈ నాలుగు రోజుల్లోనే నాదగ్గర వాడికి చనువైంది. సిగరెట్లు తెమ్మని రెండ్రూపాయల నోటిస్తే సిగరెట్లు ఇస్తాడుగానీ చిల్లర ఇవ్వడు. నేనూ అడగను. ఔదార్యం! అందుకే నేనంటే ఇష్టం వాడో బఫూన్.

వాడితో ఏవేవో మాటలు పెట్టుకుని నవ్వుతున్నారందరూ. కీ ఇచ్చిన కోతి బొమ్మలా ఎగురుతున్నాడు. పిల్లలందరూ వాళ్ళ వాళ్ళ తల్లుల దగ్గరగా కూర్చు న్నారు. మాటల మధ్యలో చటుక్కున లావణ్య దగ్గరికి వచ్చాడు.

"అందరికీ అమ్మలున్నారు. నాకే ఎవరూ లేరు. మీలాంటి అమ్మ నాకు ఉంటే ఎంత బావుండు!" అన్నాడు లావణ్య చెయ్యి పట్టుకుని బిక్కమొహం పెడుతూ

పెద్దవాళ్ళని ఒక్కక్షణం నిశ్శబ్దం ఆవరించింది పిల్లలు మాత్రం యధా విధిగా గోలచేస్తున్నారు ముందుగా లావణ్యే తేరుకుంది

"నేనీనీకు అమ్మలాంటిదాన్నే కాదా!" అంది వాణ్ణిదగ్గరికి తీసుకుంటూ

నాకు గుండె నీరయిపోయింది జాలితో.

"మరి నాన్నో?" అన్నాడు గోవిందు లావణ్య మొహం ఎఱ్ఱబడింది.

దుర్భరమైన నిశ్శబ్దం.

గోవిందు మొగాళ్ళనందరినీ పరీక్షగా చూశాడు. మనోహర్, వాళ్ళూ, వీళ్ళూ తర్వాత నేను.

ఒక్క క్షణం గుండె గుబ లాడింది. నాలుగు రోజులనుంచి వాణ్ణి ఆప్యాయంగా చూసుకుంటున్నాను. నా పేరు చెప్తాడా? నా మనసులో ఉన్న మాట బయటికి చెప్పేస్తాడా?

ఊహుఁ! అంత అదృష్టమా!

గోవిందు చూపులు నన్ను దాటేశాయి

"అలాంటి నాన్న కావాలి."

అందరం చూశాం మూర్తి! అపరాధిలా తల వంచుకున్నాడు.

లావణ్య చటుక్కునలేచి లోపలికి వెళ్ళిపోయింది.

"ఛీ! వెధవా! అవతలికెళ్ళు" అని గోవిందుని గద్దించారెవరో.

* * *

మర్నాడు.

పదిరూపాయల నోటిచ్చాను సిగరెట్లు తెచ్చాడు గోవిందుడు చిల్లర



ఇవ్వకపోయినా నోట్లు తిరిగి ఇవ్వక తప్పదుగా! జేబులోంచి బయటికి తీస్తుంటే కట్టగా ఐదులూ, రెళ్ళూ, ఒకట్లూ, బయటపడ్డాయి. కనీసం ఒక ఇరవై ఉండాలి వాడిదగ్గర.

ఆ నోట్లు చూడగానే విన్నటి సంఘటనకి అర్థం గోచరించింది.

వీడు కమీషన్లు కొడతాడు.

విన్న వీడు చెప్పిన మాటలు వీడి వయసుకి మించి, సినిమా డైలాగుల్లా ఉన్నాయి. చిలకలా, నాటకంలో పాత్ర దారిలా చెప్పాడు.

అప్పుడు జాలివేసినా, ఇప్పుడు అర్థం అవుతోంది.

ఎవరో చెప్పించారు.

ఎవరు?

ఇంకెవరు? 'తెలివైనవాడు' మూర్తి. తను మన్మధుడేంకాదు. తను లావణ్యకి

తగదు ఒకవేళ నోరుతెరిచి అడిగినా మొహాన ఉమ్మేస్తారు అందుకే ఇన్ డైరెక్టుగా ఈ కుర్రకుంక చేత అడిగించాడు- లావణ్యకి మనసులో ఆ ఊహ పడాలని

ఓరి అసాధ్యుడా!! ఓరి నిర్భాగ్యుడా!!!

వెంటనే గోవిందు చెవ్వు మెలేశాను.

"చెప్పరా వెధవా? ఎవరిచ్చారు నీకు డబ్బు? ఆ మూర్తిగాడేనా?"

"లేదండీ! ఎవ్వరూ ఇవ్వలేదండీ."

"చంపేస్తాను వెధవా! చెప్పు మూర్తేనా?"

"కాదండీ"

చెయ్యెత్తాను.

"కొట్టకండీ! చెప్తానండీ! లావణ్య గారిచ్చారండీ!"

పక్షవాతం వచ్చినట్లు చెయ్యి పడిపోయింది. మొహం మొద్దుబారింది ఒళ్ళు వేడెక్కింది చెవుల్లోంచి రొదగా గాలి వీస్తున్నట్లనిపించింది.

నీరసంకా కుర్చీలో కూలబడ్డాను.

* * *

అయితే లావణ్యకు....

మూర్తంటే ఇష్టం.

మరి మూర్తికి...

లావణ్యంటే ఇష్టమయినా చెప్ప డానికి జంకాడు.

మరి లావణ్య....

చూపుల్లో ఎన్నో రకాలుగా తన ఇష్టాన్ని బయపెట్టినా, మూర్తి బెరుగ్గానే ఉండడంవల్ల 'నన్ను పెళ్ళిచేసుకో' అని అడిగెయ్యలేకపోయింది సిగ్గు ఎమ్మెస్సీ చదివినా

మరి గోవిందు

లావణ్య అడమన్నట్లు అడాడు చెప్ప మన్నవి చెప్పాడు.

మరి మనోహర్....

పొరబడ్డావ్! ఆ రోజు మనోహర్ డాబామీద లావణ్యకు విజంగానే అంత్రో పాలజీ మీద లెక్చరిస్తున్నాడు. ట్రూ జెంటిల్‌మాన్. చీకటిగా ఉంది కదా అని ఆడపిల్లను కావలించుకునే రకంకాదు అతను లావణ్యకు స్నేహితుడు- బావ- ఆత్మీయుడు- అంతే!

మరి నేను....

యూ ఆర్ ఏ సెనైల్ ఓల్డ్‌మాన్ సిన్నచూపి నుప్వే జాలిపడు.

మరి పెళ్ళి...

లావణ్య తెలివైనది. ఇక్కడిదాకా జాగ్రత్తగా లాకొచ్చిన విషయాన్ని ఇక ముందు మాత్రం వదిలేస్తుందా? మూర్తి తక్కువేంకాదు. ఇప్పటికీ విషయం వాడికి తలకెక్కి ఉంటుంది. వాళ్ళు బాగుపడ తారు. నువ్వు బాధపడకు

మరి తరం....

మారింది. నోటితో అభిప్రాయం వ్యక్తంచెయ్యలేక జీవితాల్ని నాశనం చేసుకునే తరంకాదిది. ఆ దపిల్లలు చదువుకుంటున్నారు, బాగుపడుతున్నారు తెలివిగా జీవితాలు దిద్దుకుంటున్నారు ఆశీర్వదించు

---

# జరుగుతున్న చరిత్ర

ఎన్నికలైనవి. అందులోని జగజీవనోపాఖ్యానం మనకు విస్మయం కంటె వినోదాన్ని అధికంగా కలిగించింది. మన రాజకీయాలు ఎంతకు, ఏ విధంగా జరిగినవో లోకం గ్రహించడానికి ఒక నమూనాగా ఇది సిద్ధమైనది. బహుగుణోపాఖ్యానం ద్వారా వినోదం కంటె విస్మయమే అధికంగా మనకు కలిగింది. ఐతే, అందులో ప్రశస్తమైన విషయం ఒకటి జరిగింది. ఏ పార్టీద్వారా తాను M.P. ఐనాడో, ఆ పార్టీనుంచి తను వైదొలగినపుడు పార్లమెంట్ సభ్యత్వానికి రాజీనామా యిచ్చినాడు బహుగుణ, ఇది మంచిపని. ఇంకొక్క మంచిపని కూడా జరిగింది. హర్యానాలో అవకాశవాదం సంపూర్ణ విజయాన్ని సాధించి, తమిళనాడులో చిత్తుగా ఓడిపోయింది.

ఎన్నికలకు పూర్వం, ఎన్నికలలో గెల్చినవారికి అనుకూలమైన వాతావరణం లేకుండెను. తమ కేంద్రప్రభుత్వం ఏమీ చేయలేదని తమ్ము అభిమానించే పత్రికలతో సహా, పత్రికలన్నీ వ్యాఖ్యానించినవి. ఐనప్పటికీ, వారు చివరకు గెల్చినారు. ప్రతిపక్షాల వారే పరిపాలక వర్గాలవారికి ఈ విజయాన్ని సమకూర్చి పెట్టినారు. ఐతే, తమ అభ్యర్థులకు దరహాసం మీద వచ్చిన వోట్లే ఎక్కువని వారు సంతృప్తిచెందినారు.

ప్రజలకు మాత్రం వెంటనే ఒక లాభం కలిగింది. పెట్రోల్, డీజిల్ వగైరాల ధర పెరిగినా, కిరసనాయిలు ధర పెరగలేదు. మున్ముందు పారిశ్రామికాభివృద్ధికి వ్యవసాయాభివృద్ధికి ఏమేమి చర్యలు ప్రభుత్వాలు తీసుకుంటాయో చూడవలసి యున్నది. దానిని బట్టి మన జాతీయ రాజకీయ భవిష్యత్తు నిర్మాణం అవుతుంది.

* * *

అస్సాం సమస్య, ఈశాన్యప్రదేశాల సమస్య ఇంకా తెగలేదు. ఈ పంక్తులందే లోపల ఒక సవ్యమైన పరిష్కార మార్గం కల్పించకపోతే ఏడుగురు అక్కచెల్లెండ్రు NAMMATలో కలిసిపోతారేమో! నాగాలాండ్, అస్సాం, మేఘాలయ, మణిపూర్, మైజోరాం, అరుణాచలప్రదేశ్, త్రిపుర కలిసి Nammat నిర్మాణమైనది. ఈ సంస్థ ప్రధానకార్యాలయం ఉత్తరబర్మా. చైనా అంటే అభిమానంగల T.M. Muviah మువయా దీనికి నాయకుడు. ఈశాన్యప్రదేశాలన్నీ కలిసి United states of Anam (united states of

మండి జగన్నాథం

America మోస్తారుగా కాబోలు లేదా Union of Soviet Socialist Repubdlics వలె కావచ్చును, కాని, ఇప్పట్లో USSR నమూనాకంటె USA నమూనా చైనాకు ఎక్కువ ప్రియమైనది కావచ్చును) ఏర్పడవలెనని అకాంక్ష.

నాగాలాండ్ తిరుగుబాటు నాయకులకు తమ ప్రదేశం ఇండియాలో భాగం కాదు–ఇండియాతో సన్నిహితంగా వుండే స్వతంత్ర నాగారాజ్యం, ఇప్పుడు Nammat ఉద్యమం ఫలిస్తే స్వతంత్ర ఈశాన్య రాజ్యం ఏర్పడి ఇండియాకు సన్నిహితంగా వుంటుంది.

కాశ్మీర్ రంగాన మనకు కలిగిన అనుభవం మనకు పాఠాలు నేర్పగలిగితే, ఆలస్యం అమృతం విషం అని మన నాయకులందరు అవగాహన చేసుకుంటే, USA (United states of Amam) అస్సాం–సంయుక్త–రాష్ట్రాలు అనే రాజ్యం మన సరిహద్దున నిర్మాణం కాదు. నిజానికి కావలసిన పనిలేదు,

విడిపోయే ప్రవక్తి, స్వతంత్ర రాజ్య భావన అస్సాం, మైజోరాం, మేఘాలయలలో ఇంతవరకు జరిగిన ఉద్యమాలలో కనిపించ లేదు. ఇండియాలో భాగాలుగా వుంటూనే తమకు న్యాయం కలిగించవలెనని ఈశాన్య ప్రదేశాల ప్రజలు కోరుతున్నారు. వారి నాయకులు స్పష్టంగా ఆ మాట చెప్పినారు. ఉద్యమాలను శాంతియుతంగా నడిపినారు. చెదురుమదురుగా కొన్ని హింసాపూర్వక చర్యలు జరిగినవి వాటిని గూర్చి నాయకులు గర్వపడడం లేదు. జరగకూడని పనులు జరిగినవి గదా!–అని దుఃఖిస్తున్నారు. ఉద్యమం సవ్యమైన పరిమితిలో వుండవలెనని పట్టుబట్టిన విద్యార్థి నాయకుల విజ్ఞత ప్రశంసనీయం

ఈ తరుణంలో భారతీయ నాయకులందరు కలిసి ఒక న్యాయమైన మార్గాన్ని చూపితే, మన ఈశాన్య సోదరీ సోదరులు తప్పక అంగీకరిస్తారు.

అందువలన ఇటీవల రెచ్చిన ఒక 'మైనారిటీ', గొడవను వెంటనే తొలగించడం మంచిది. మా ప్రాంతాలలోకి బహిరాగతులు (వెలుపలివారు) వచ్చి, మమ్ములను మైనారిటీ చేస్తున్నారు. అధికారాలను వశం చేసుకుంటున్నారు, ఆదాయాలు అధికంగా గల వనరులను అందుకున్నారు' అని ఈశాన్య ప్రాంతీయులంటే, వెలుపలినుంచి వచ్చిన వారిలో నుంచి మైనారిటీ ఉద్యమం రావడం సరిగా అర్థంకావడం లేదు. ఈ మైనారిటీ వారు మొత్తం భారతదేశంలో ఒక పెద్ద మైనారిటీగా పరిగణింపబడుతున్నారు అంటే, ఎక్కడనుంచి వారు వచ్చారో అక్కడ వారు మెజారిటీకి చెందినవారే. ఈ నామధేయాన్ని గూర్చిన తర్కం ఎట్టిదైనప్పటికీ, ఈ

పేరిట జరిగే కాండ పరిస్థితిని మరింత విషమింపజేస్తే, ఇంకా చిక్కుల పాలవు తాయి ఆ కాండలో దౌర్జన్యకాండ కలిసిందని తెలిసింది. కాని, దానిని వెంటనే నాయకులు అరికట్టి వుంటారు ఈ నాయకుల స్వరూప స్వభావాల గూర్చి వదంతులే గాని, నిర్ధారణగా ఫలానా అని తెలియలేదు.

ఏది ఏమైనప్పటికీ, అందరం కలిసి కృషిజేసి ఈశాన్య వాసులకు సంతృప్తిని కలిగించి, తిరిగి మనకూ వారికీ మధ్య సామరస్యాన్ని నెలకొల్పుకోవడం మన ధర్మం.

* * *

ఈశాన్యాన ఇన్ని చిక్కులుండగానే వాయవ్యాన ఏర్పడిన రెండు పెద్ద చిక్కులు ఇంకా బాధిస్తున్నానే వున్నవి ఒక చిక్కు విషయంలో మన లోపం లేకుండా ప్రయత్నాలు సాగిస్తున్నాము. రెండవదాని విషయంలో తగినంత జాగృతి వున్నట్లు కన్పించదని పరిశీలకులు కొందరు భావిస్తున్నారు

మొదటి చిక్కు అఫ్ఘనిస్తానుకు సంబంధించినది ఆ సీమపై చేసిన దురాక్రమణ గొప్ప తప్పిదం అని లోలోన రష్యా నాయకులు గ్రహించినారు. పైకి, గంభీరంగా వున్నారు. తమకు విరుద్ధం కాని కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గానీ లేక మరొక మిశ్రమ ప్రభుత్వాన్ని గానీ ఆ సీమలో స్థాపించి, దానికి అంతర్జాతీయమైన ఆదరాన్ని కలిగించి, సేనలను ఉపసంహరించుకునే ధోరణి లోకి వచ్చినట్లు వినికిడి. వినావికి, గత్యంతరంలేదు. మునుపు జెక్ సీమపై దండెత్తి, ఎర్రటి ఉద్యమానికి తాము ఎంతటి అపకారం చేసినారో రష్యా నాయకులు గ్రహించి వుంటారు. అఫ్ఘనిస్తాన్‌లో విదేశీయులను సహించరు- వారు కమ్యూనిష్టులైనా సరే! అంతేగాక ఆ సీమలోని ప్రజలు ఇస్లాం ధర్మాన్ని అవలంబించినా మతోన్మాదులు కారు అత్యాచారాన్ని ఎదిరించి, సమసమాజ స్థాపనకు దోహదమిచ్చే శక్తులు ఇస్లామ్ ప్రపంచంలో పుట్టుకొచ్చినవి ఆ శక్తుల సహకారంతో కృషిజేయలేక ఒక్కసారిగా ఇస్లామ్ తత్వంపై అఫ్ఘనిస్తానేలో కొత్తగా ఏర్పడిన కమ్యూనిస్టు ప్రభుత్వం విరుచుకుపడడంతో అల్లకల్లోలం ఏర్పడింది ఇందులో నుంచి కమ్యూనిజాన్ని, అఫ్ఘన్ సీమను తొలగించడానికి వివేకం అవసరం.

ఇస్లామ్ రాజ్యాలనందే దేశాలు సైతం అట్టి వివేకాన్ని ప్రదర్శించలేకపోయినవి మొదటి తప్పు ఒక మతం పేరిట ఒక రాజ్యాన్ని సాగించడం, ఆ రాజ్యానికి ఆ మతంపేరు పెట్టడం రెండవ తప్పు, అవన్నీ కూడి అఫ్ఘన్ సమస్యను చర్చించి, దానికి కేవలం ఇస్లామ్ పూత పూయడం.

అఫ్ఘన్ సీమ వాసులు ఇస్లాం అను

యాయులు అంతవరకే అది ఇస్లామ్. ఇతరత్రా, స్వేచ్ఛను ప్రేమించే ప్రజలు గల రాజ్యం అఫ్ఘనిస్తాన్. స్వేచ్ఛ మానవ సమస్య అమెరికన్లు, పాశ్చాత్యులు ఆఫ్ఘన్ సమస్యను కూడ నీతిలోకి దించి, మానవ సమస్యను మరుగు పరచినారు.

ఆఫ్ఘన్ ప్రజా ఉద్యమం అణచ రానిది ఈ ఉద్యమానికి సాయంగా అనేక ఇతరేతర శక్తులుండవచ్చును. స్వకార్యార్థం అవి ఆ పనులు చేస్తూ ఉండవచ్చును. కాని, ముఖ్యంగా స్వాతంత్ర్యాన్ని ప్రేమించి, అందుకై ప్రాణాలొడ్డే ప్రజలు ఆ ఉద్యమానికి పట్టుగొమ్మలని గుర్తించవలెను ఆ పట్టుగొమ్మలతో సమాధానపడే ప్రయత్నం ఒకవంకా, తిరుగుబాటు దారుల ఆక్రమాలపై అగ్నివర్షం కురిపించి ధ్వంసం చేసే ప్రయత్నం ఇంకొక వంకా జరుగుతున్నవి. రెండవ ప్రయత్నంలో సాఫల్యం లభించదు. వీట్‌నాంలో అమెరికన్లకు ఎంత సాఫల్యం లభించిందో, ఈ రంగాన రష్యన్లకు అంతే సాఫల్యం లభించబో తుంది.

అందువలన సమాధాన మార్గాన పయనించి, ఆఫ్ఘన్ ప్రజలను విశ్వసించి, వారి స్వేచ్ఛను కాపాడే ఏర్పాటును చేయడం రష్యనులకు మంచిది.

ఈ సందర్భంలో కీ. శే. మార్షల్ టిటో రష్యనులకు గుర్తు చేసిన ఒక అంశాన్ని వారు స్మరణకు తెచ్చుకోవడం సమయోచితంగా ఉంటుంది టిటో వాక్యం: "మొట్టమొదటి సోషలిస్టు భూమి అయిన సోవియట్ యూనియన్ మనకు ఎంత ప్రేమాస్పదమైనప్పటికీ, సోషలిజం నిర్మాణం చేసే మన దేశాన్ని మనం తక్కువగా ప్రేమించలేము."

రెండూ సోషలిస్టు దేశాలైనప్పటికీ రష్యా, యుగోస్లావియాలు స్వతంత్ర రాజ్యాలుగా వర్ధిల్లినవి. అటువంటప్పుడు అఫ్ఘనిస్తాన్ ప్రజలు సంక్షేమ రాజ్యాన్ని నిర్మించుకునే తమ దేశాన్ని ప్రాణం కంటె ఎక్కువగా ప్రేమించడంలో తప్పేమున్నది?

* * *

ఇక రెండవ చిక్కు విషయం. ఇది మన పొరుగున వున్న పాకిస్తానుకు సంబంధించిన విషయం. 'ఇస్లామిక్ బాంబ్' తయారీకి ఆ రాజ్యం తయారవుతున్నది. తమకు అమిత ఇష్టమైన దానిని ఇస్లామీగా వర్ణించుకోవడం ఇటీవల మహమ్మదీయులెక్కువగా వుండే రాజ్యాల, అలవాటైనది.

పాకిస్తాన్‌లో భుట్టోగానీ, జియాగానీ అంతా ఒకే పట్టుమీద వుండినారు వున్నారు. ఎదుటివారిమీద నిప్పులు కురిపించే న్యూక్లియర్ శక్తిని సంపాదించడానికి పూనికతో పనిచేస్తున్నారు అటు ICBM న్యూక్లియర్ క్షిపణులను

(రష్యా-అమెరికాలలో ఏ ప్రాంతం పైనైనా బాంబులు విసరగల సాధనాలను) చైనా తయారుచేస్తూ, ఇటు పాకిస్తాన్ ఇస్లామిక్ బాంబు తయారు చేస్తూవుంటే, మన న్యూక్లియర్ పాలసీ ఎట్లుండవలెనో అట్లుండవలెను. ఇదివరకు మన నాయకులలో ఎవరు ఎలా పల్కినా, అది ప్రామాణికం కాదు. పరిస్థితి మారింది. అందుకు తగినట్లుగా మనం మనం ప్రవర్తించుకొనవలెను.

* * *

రష్యావల్ల మనకు అనేక సంకట సమయాల్లో దొరికిన సాయం మనం మరువరానిది మన రాజకీయ విధానాలు అనగా రాజ్యసంచాలక పద్ధతులు ఏవైనా, బుద్ధి పూర్వకంగా మనం పరస్పర సాయం చేసుకుంటున్నాము.

మన తారాపూర్ న్యూక్లియర్ కేంద్రానికి ఇస్తామనీ - ఇవ్వమనీ పేచీలుపెట్టి చివరకు Heavy water బరువైన పానీయం సప్లయి చేస్తామని అమెరికన్లు అన్నారు. కెనడా వారూ పేచీపెట్టినారు మనం పోఖ్రాన్‌లో ప్రేల్చిన ఒక న్యూక్లియర్ సాధనం చేయరాని పని అని కెనడా - అమెరికాల అభిప్రాయం. ఆ కోపంతో పేచీ పెట్టినవి. 1976లో కెనడా అభ్యంతరం తెలియగానే, 200 టన్నుల బరువైన పానీయం ఇవ్వడానికి రష్యా అంగీకరించింది. సప్లయి చేసింది. ఇప్పుడు 250 టన్నుల సప్లయి కోసం గత ఫిబ్రవరి మాసంలో మనకూ రష్యాకూ అగ్రిమెంటు కుదిరింది. అబాపతు 30 టన్నుల సప్లయి (మొదటి వాయిదా) వస్తున్నది.

పాలస్తీనా వాసుల సమస్య ఇంకా పరిష్కారం కాలేదు. ఇస్రాయిల్ మొండి పట్టును అమెరికా విదేశాంగ మంత్రి మస్కీ నిరసించాడు. అమెరికా సద్భావంతో లోగడ సాగిన చర్చలు ఈ అంశంపై మళ్ళీ ఈజిప్టు - ఇస్రాయిల్ రాజ్యాల మధ్య వాషింగ్‌టన్‌లో జరిగి వుండినవి. ఇస్రాయిల్ దారికి రాకపోతే, ప్రపంచం పట్టించుకుని, దానిని దారికి తెస్తుంది.

* * *

క్యూబా నుంచి అనేక మంది అమెరికాను శరణాలయంగా భావించి, సుఖతరమైన జీవనంకోసం తరలి వచ్చినారు చెప్పుబడు మాటలు విని, క్యూబాను రాజకీయంగా నిందలపాలు జేయవలెనని పూనుకున్న 'తుంటరుల' మాటలు విని వారలా చేశారని క్యూబా అధికార్లు భావించారు. వెంటనే ఆ అధికార్లు తమ విధ్యుక్తధర్మాన్ని విస్మరించంగా నేరవేర్పే ఉద్దేశ్యంతో జైళ్ళల్లోవున్న నేరస్థులను వదలిపెట్టి శరణార్థుల గుంపులలో వారిని కలిపివేశారు. ఆ 'నేరస్థుల' అల్లరికి తట్టుకోలేక అమెరికన్లు వారిని తిరిగి క్యూబాకు పంపివేశారు. ఇటువంటి

వారిని రవాణా చేయడం అన్యాయం కాదా ? - అని అడిగినారు.

పశ్చిమ బెర్లిన్-తూర్పు బెర్లిన్ (జర్మనీ) కథ జ్ఞప్తికి వస్తున్నది. మొదట తూర్పు వారు పడమటికిరాగా, తూర్పున వున్న రాజ్యాధికార్లు పెద్ద అడ్డగోడను మొదట నిర్మించుకున్నారు. పిమ్మట రెండు బెర్లిన్ నగరాలు, రెండు జర్మనీలు సౌభాగ్య వంతమైనవి. ప్రపంచంలో ఘర్షణ వాతావరణంలో మార్పువస్తే రెండు జర్మనీలు ఎవరికీ చెప్పా - చెయ్యక ఏకమై పోతే ఆశ్చర్యపడవద్దు!

కొరియా సంగతి అట్లే వున్నది. దక్షిణ కొరియాలో కల్లోలం ఎక్కువైనది. ఐనప్పటికీ, ఈ సమయంలో ఉత్తర కొరియన్లు తాము దక్షిణాదిపై దండెత్తమని హామీ ఇచ్చినారు. కల్లోలం తగ్గిన తర్వాత రెండు భాగాలు సామరస్యంతో చర్చించుకుని, రమా రమీ ఏక దేశంగా వర్తించవలెననే భావం అంతరంగికంగా ఉభయ కొరియా వాసులలోనూ ప్రవేశించిందని అంటారు.

* * *

ఆఫ్రికా దివసాన్ని ఇటీవల గంభీరంగా జరిపినారు. 1963లో Organisation for of African unity (OAU) ఆఫ్రికా సీమల ఐక్య సంఘటన అనే సంస్థ నిర్మాణమైనది. 17వ. సాంవత్సరిక ఉత్సవాల సందర్భంలో ఆఫ్రికా దివస కార్యక్రమం నడిచింది.

జింబాబ్వేలో ముగాబే ఆధిపత్యం రాగానే దక్షిణాఫ్రికా జాత్యహంకారులకు గుండెల్లో గుర్రాలు పరుగెత్తినవి. కాని ముగాబే చర్యలకు సమయం పడుతుంది. ఈలోగా ఆఫ్రికా రాజ్యాలన్నీ కల్పించుకుని, దక్షిణాఫ్రికా జాత్యహంకారులు శ్యామవర్ణులైన దేశభక్తులపై, విమోచనోద్యమ వీరయోధులపై గావించే అత్యాచారాలను ఎదుర్కొన వలెనని తీర్మానించు కున్నవి.

సోలొమన్ మాలాంగూ యువకుడు, ధీరుడు, అతణ్ణి ఉరికంబ మెక్కించారు. తల్లి ని రాజధాని పరిసరాలలో అధికార్ల గూండాలు చంపివేసినారు. నెల్సన్ మాండేలా యావజ్జీవ ఖైదీగా దక్షిణాఫ్రికా జైళ్ళల్లో మ్రగ్గిపోతున్నాడు. శ్యామవర్ణుల పోరాటమే నెగ్గితే మాండేలా దక్షిణాఫ్రికా ప్రధానమంత్రి కాగలిగినంత శక్తిపరుడు జేమ్రమంగేకు మరణదండన విధించారు.

ఈ దారుణ హత్యాకాండను అరికట్టడం మానవులందరి ధర్మం. ఆఫ్రికా సీమల ధర్మ యుద్ధానికి అండదండలందివ్వడం అందరి కర్తవ్యం.

* * *

నేటి ప్రపంచం నానా బీభత్స దృశ్యాలతో నిండివున్నప్పటికీ, ఎక్కడికక్కడ (ఇరాన్‌లో, అఫఘనిస్తాన్‌లో హిందూ మహా సముద్రపు డెగోగార్సియాలో, కంపూచియాలో, ఇంకా అటు

వంటి కొన్ని క్షేత్రాలలో) సంఘర్షణలు రాజ్యాల మధ్య పెద్దయెత్తున సంభవించే అవకాశాలున్నప్పటికీ, విరుద్ధ తత్వాలు గం రాజ్యాలు పరిస్థితుల ఒత్తిడి ద్వారా సమాధాన పడుతూ వుండడం వల్ల, ప్రపంచ యుద్ధమనేది వాయినా పడుతూ వస్తున్నది. దీనికి సాక్ష్యం?

అమెరికన్లు, చైనావారు పరస్పరం విందించుకోడంలో ఒక్క దూషణ శబ్దాన్ని కూడా మిగల్చలేదు. ఇప్పుడో? సోవియట్ యూనియనుకు ఉభయులు విరోధులై, అనేక పర్యాయాలు కలుసుకుని మాట్లాడుకుంటున్నారు.

సోవియట్ యూనియన్ ముఖ్యులు ఉగాండా (తూర్పు ఆఫ్రికా) సీమను పాలించిన పరమ దుర్మార్గుడు ఈదీ అమీన్ ఖాయిని కౌగిలించుకున్నది - ఉగాండా సీమ పాశ్చాత్యులకు విరుద్ధంగా ప్రవర్తించినప్పుడు.

పశ్చిమ జర్మనీ కమ్యూనిజానికి విరుద్ధం, రష్యాకు విరుద్ధం అని సుప్రసిద్ధమైన విషయం. ప్రస్తుతం కోట్లకొలది రూపాయల విలువగల వ్యాపారం రష్యా - పశ్చిమ జర్మనీల మధ్య నడుస్తున్నది.

రష్యన్ల అఫ్‌గాన్ దూకుడు జరిగిన తర్వాత కూడా. (ఆ దూకుడును పశ్చిమ జర్మనీ ఖండించిన తదుపరి సైతం సోవియట్ యూనియన్ కోస్తాలో ఆయిల్, గాస్ త్రవ్వకాలలో ఉభయ రాజ్యాల కలిమడి చర్యలకు ఒప్పందం జరిగింది. ముడి పదార్థాలు, లోహాలు - ఇటువంటి వాటిని తీసి, శుద్ధిచేసే పనులలో జాయింట్ కార్యక్రమాలు సాగుతవి. పై ఒప్పందం, జాయింట్ కార్యక్రమాలలో వచ్చే సరుకులు పశ్చిమ జర్మనీకి చాల అవసరం.

చైనా అడిగితే అమెరికా ఇవ్వని వస్తువు లేదు. దీనికి మూలం, యుగోస్లావియా కమ్యూనిస్టు రాజ్యం ఐనప్పటికీ మాస్కో పెత్తనం క్రింద కాకుండా స్వతంత్రంగా వున్నప్పుడు, ఆ రాజ్యానికి అమెరికా పుష్కలంగా సాయం చేసినందువల్ల నష్టం రాలేదు - అనే అంచనా. బాగానే వుంది ఆలోచన. కాని, చైనా విషయంలో అమెరికన్ దీర్ఘదర్శుల ఆలోచన మరొక విధంగా వున్నది. ఐనా, అమెరికా చైనాను ప్రోత్సహించక మానదు.

* * *

ఇంతకూ చైనా ఏమంటున్నది? మనతో మంచిగా వుంటానంటుంది - రష్యాతో మనం ఎక్కువ సంఖ్యంగా వుండడం రుచించకున్నా! దాలైలామను ఎట్లయినా టిబెట్‌లోకి రప్పించి, మనకిక టిబెట్ సమస్య లేకుండా చేయవలెనని చైనా దృఢంగా సంకల్పించింది.

మొదటి రోజుల్లో ఆక్రమించిన చైనా సేనలు, చైనా అధికార్లు విపరీతంగా. దూకుడుగా ప్రవర్తించినారని

ఆత్మ విమర్శ చేసుకుంటూ, ఇప్పటి అధికార్లు కొత్తపుంతన పోతామంటు న్నారు. టిబెటన్లు పరాజీయులుగా, చైనా వారు విజేతలుగా లోగడ ప్రవర్తించిన చైనాన్ని టిబెట్ వాసులు గుర్తుచేసి నపుడు "అవునవును, నిజమే, అటు వంటి తప్పిదం క్షంతవ్యం కాదని" అని ఇప్పటి చైనా అధికార్లు అంటున్నారు. టిబెట్ రాజ్యం వుండదు కాని చైనా రాజ్యంలో ఆదరణీయమైన భాగంగా టిబెట్ వుంటుంది. టిబెట్ ప్రజలు సుఖంగా వుంటారు. తమ ధర్మాన్ని అనుసరించడానికి అటంకం ఏమీ వుండదు - అని చైనా వారు అంటు న్నారు.

దాలైలామాకు గానీ, ఆయన అను యాయులను గానీ, విశ్వాసం పూర్తిగా కలగడం లేదు. రష్యన్ సంజ్ఞలు ఇది వరకు వీరికి అందినంత వరకు చైనాకు తిరిగి వెళ్ళడానికి ప్రోత్సాహకరంగా లేవు. రష్యాలో బౌద్ధులు వున్న ప్రాంతాలలో దాలైలామా అనుయాయులు కోరితే ఆశ్రయం కూడా ఇస్తారేమో? ఇటీవలనే దాలైలామాకు ఆ ప్రాంతా లలో గొప్ప సన్మానాలు జరిగినవి, జరిగించబడినవి.

ఈ గొడవ ఇలా వుండగా, కుటుంబ నియంత్రణకు జోరుగా చైనావారు దిగినారు. 1985 వచ్చేసరికి కుటుంబంలో మూడవ శిశువు అసంభవం. ఒక్క శిశువు గల కుటుంబాలు అత్యధికంగా వుంటవి. 2000 సంవత్సరం వచ్చేసరికి ఇక జనాభా పెరగడమంటూ వుండదు.

కుటుంబపరిమితి అవసరమే. కాని, మాతృత్వాన్ని అసలే లేకుండా చేస్తే, జీవితంలో కుటుంబాలకు కలిగే మానసిక స్థితి ఎలా వుంటుందో?

స్త్రీకి తల్లిగావడం, పురుషుడికి తండ్రికావడం కేవలం ఫ్యూడల్ లేక క్యాటలిస్టుల లక్షణం కాదు. Free Love స్వేచ్ఛగల ప్రణయం గొప్ప సంస్కారం గలవారికే తగును గాని సామాన్యులకు తగదు. సాధారణంగా వైవాహికజీవితం, అనుకూల దాంపత్యం మాతృత్వం, పితృత్వం జీవనానికి అనం దాన్ని సమకూర్చే అంశాలు. కేవలం షడ్రసోపేతమైన భోజనమే తృప్తి నివ్వదు గదా! సాధారణమైన రీతిలో అన్ని వస్త్రాదులకు లోపం లేకుంటే చాలు, కుటుంబీకులు సంతోషంగా కాల క్షేపం చేస్తారు.

లోగడ కొన్ని ప్రయోగాలలో విప రీతంగా ప్రవర్తించి చైనా వారు దెబ్బ తిన్నారు. ఇందులోనైనా, కొంచెం జాగ రూకులై మెలగడం మంచిది.

---



జయంతి వెంకటరమణ

నలభై రెండు రోజుల ప్రోగ్రాము మరి రెండురోజుల్లో ముగియనున్నది. ఆ మర్నాడే మూటా ముల్లె సర్దుకుని విశాఖపట్నం నుండి మరలిపోవచ్చు. కాని ఇన్ని నాళ్ళుగా ఇంతమంది నుండి పొందిన స్నేహాన్ని అనుభూతుల్ని, దూరం చేసుకుని వెళ్ళటమెలా? బహుశా నాకే అలా అనిపిస్తోందేమో, అందరూ నాలాగే బాధపడతారా? – ఏమైనా ఈ ప్రదేశాన్ని, ఈ స్నేహితుల్ని వదలి వెళ్ళక తప్పదుకదా!... ఆలోచిస్తూ కేంటీను నుండి ఇవతలకి వస్తున్న నన్ను రెండు కళ్ళు పరిశీలించి చూడటం చూశాను. ముందుకు కదలబోతూ ఆగాను. అవే కళ్ళను రెండురోజుల క్రిందట చూశాను. నన్ను ఇదే విధంగా చూడటం నాకు గుర్తే. నేను గ్యాలరీ రూముకు క్లాసుకు వెళ్ళబోతూ, కెమిస్ట్రీ డిపార్టుమెంటు వైపు ఆమె తిరగటం చూశాను. వెంటనే నాకు 'ఇందుమతి' గుర్తు కొచ్చింది.

ఈమె ఇందుమతే నేమో అన్న భ్రాంతి కూడ కలిగింది. ఆమె 'ఇందుమతి' అనుకోడానికి అవకాశాలు ఏమీలేవు. మనిషిని పోలిన మనుషులుండవచ్చు. ఈమె కెమిస్ట్రీ సమ్మర్ ఇన్‌స్టిట్యూట్ ట్రైనింగ్‌కోసం వచ్చిన ఉపాధ్యాయిని అయినా అయి ఉండాలి లేదా కెమిస్ట్రీ. ఎమ్. ఎస్ సి స్టూడెంటయినా అయి ఉండాలి. అయితే ఆమె ఎవరో అయితే నన్ను ఎందుకు పరిశీలనగా చూడాలి? కారణం స్పష్టమే. వచ్చిన మొదటి రోజుల్లోనే నేనొక రచయితనన్న విషయం చాలామందికి తెలిసింది మా స్టూడెంటు వలన. నన్ను రచయితగా అభిమానించిన వారిలో ఈమె ఒకరేమో

ఆమె మరీ దగ్గరైంది. ఆమె చేతిలో వ్యానిటీ బ్యాగు తప్ప మరేమీ లేవు. నేనలా నిలబడే ఉన్నాను. ఒక్కడుగులో ఆమె దగ్గరవుతుంది. ఆమె ఇందుమతి అవునో కాదో తెలిసికోవాలని ఉంది.

"ఏమిటి కవిగార్కి ఆలోచనలు? క్లాసుకు టైము అవుతోంది. టెన్ టు ఎయిట్. పదండి. పదండి." అంటూ వక్కపొడిని నా కందిస్తూ తొందర చేశాడు హనుమంతరావు. ఆమె దగ్గర గానే వచ్చింది. ఇక నే నడకసాగించ వచ్చు.

"ఆలస్యమేం లేదు. మీరు వస్తున్నారని ఆగానంతే. పదండి" ముందుకు అడుగు వేశాను. ఆమె వెనుకయింది. నాకోసం ఒక క్షణం ఆగిందేమో. నేను వెనుతిరిగి చూడలేదు. కాని ఆమే నిజంగా ఇందుమతి అయితే! .... నా గుండె వేగంగా కొట్టుకుంది. కాని ఈమె ఇందుమతి కాదు. ఈమె ఇందుమతి అయ్యే అవకాశాలు ఏమీలేవు. ఈమె ఎవరో! నాతో మాటాడాలని కుతూహల పడుతోంది. రేపు ఆమె కనిపిస్తే మీతో మాటాడలేకపోయాను నేను గర్విష్టి ననుకుంటున్నారు కదూ? కాదు. నేను గర్విష్టిని కాను. నా కేముందని గర్వించను! ... ఇంత పెద్ద సంజాయిషి ఎందు కిస్తున్నాననుకుంటారేమో! మీరు ఇందుమతిలా కనిపించారు అసలు ఇందుమతి ఎవరో తెలుసా? ...."

"ఏమిటి గురువుగారూ! ఏదో ఆలోచనలో పడ్డారు. త్వరగా అడుగులు వెయ్యండి. ఇవ్వాళ చెప్పేది మరిచి పోయారు కాబోలు" అన్నాడు హనుమంతరావు.

మేము ఫిజిక్సు డిపార్టుమెంటు వైపు తిరిగేసరికి హేమలత, నిర్మల, మూర్తి గారితో ఏదో విషయాన్ని గూర్చి చాల తీవ్రంగా చర్చిస్తున్నారు. అతనేదో వారికి అర్థం కాని విషయాన్ని తెలియ జేస్తున్నాడు. మమ్మల్ని చూచి "ఈసారి ఏమేమి ఫస్టు క్వశ్చెన్సిస్తారో!" అంది హేమలత. నాకు తెలుసు అది నాకు గురిపెట్టిన ప్రశ్న.

"పాట రాసివ్వడమే కాదు. పాడి వినిపించాలి" అందామె.

"మన కెప్పుడు వీలవుంది. రేపే చివరి రోజుకదా" అన్నాను.

"అవును. రేపు వెలిడిక్టరీ ఫంక్షను. అసలు వీలవదు. ఎల్లుండి తిరుగు ప్రయాణం హడావుడి. మరెప్పుడవు తుంది? అయితే ఇవ్వాళ సాయంత్రం వీలు చూచుకుని బీచికి రండి. మేమూ వస్తాం" అందామె. అలాగే అన్నాను నేను. అంతలో నిర్మల వచ్చింది. ప్రోగ్రాము గురించి హేమలత చెప్పింది." వచ్చేటప్పుడు మంచి కథను కూడ ఆలోచించుకుని రండి." అంది నిర్మల. "నీ పిలాంటి కండిషన్లు పెడితే రావటమే మానేస్తారు" అంది హేమలత.

"ఎక్క[illegible] వెతికి తేలేము? ఇవ్వాళ మా ఫ్రెండ్సు కూడ బీచికి వస్తామన్నారు ముఖ్యంగా మాస్టారి పాట వినాలనే. వాళ్ళ ఎగ్జామ్సు కూడ అయిపోయాయి. ఈ రోజు రాత్రే వెళ్ళిపోతున్నారు. వాళ్ళ కోరికా తీరు తుంది" అంది నిర్మల.

పెద్ద సభే ఏర్పాటు చేసేటట్టున్నారే" అన్నాను.

"మంచి కథ చెప్తే సన్మానమే చేస్తాం" అందామె. "అక్కడికే వచ్చే యండి" అంది హేమలత. "ఎక్కడికి గురూ!" అంటూ వచ్చాడు హనుమంత రావు, దూరంగా లాక్కెళ్ళుతూ చెప్పాను

"వచ్చాం! నే నివాళ జాలారిపేట వెళ్ళా లనుకుంటున్నాను గురూ!" అన్నాడు.

"మీరు వెళ్ళండి" అన్నాను.

"అయ్యో బాబోయి! వీళ్ళ మధ్య మిమ్మల్ని వదలి వెడితే ఇంకేమైనా ఉందా?" అన్నాడు. "జోక్ చాల బాగుంది. ప్రమాదమేదీ రాదు" అన్నాను.

కాఫీ బ్రేక్ అయింది,

* * *

సాయంత్రం అయిదున్నర వేళ.

నేనూ, హనుమంతరావు, శాస్త్రి, మూర్తిగారూ నలుగురం పిఠాపురం హాస్టల్సు దిగువన నడిచి, సముద్రానికి దగ్గరగా కూర్చున్నాం; మెత్తటి ఇసుక మీద. మేమక్కడ ఉంటామన్న సంగతి హేమలత వాళ్ళకు తెలుసు. వస్తారు. మేము నలుగురం, ఈ కోర్సుకి వచ్చిన దగ్గరనుండి కలిసే ఉన్నాం ఈనాటి వరకు. విడిపోతామన్న విచారం మాత్రం మా అందరిలో ఉంది. వేసవి సెలవలు హాయిగా గడపక ఇంతదూరం వచ్చామంటే ఎంతోకొంత నేర్చుకోవాలనే తాపత్రయం మాత్రం మా నలుగురిలో ఉండటం చేత ఒక జిల్లాకి చెందిన వారము కాకపోయినా స్నేహితుల మైనాము. మూర్తిగారు నాకన్న వయసులో పెద్ద. చాల నిశితమైన బుద్ధి వివేషం కలవాడు. సంగీతమంటే చాల యిష్టం. రాత్రి పడుకోబోయే ముందు

'ఏంకిపాట'లో కృష్ణశాస్త్రి గీతా'లో పాడుకుని నిద్ర పోయేవారం. పాట ప్రారంభించటం అతనివంతు పాట పాడి ముగించటం నావంతు.

"ఈ ఆడ మళయాళం ఇంకా రాదేం?" అని శాస్త్రి అంటూండగా మూర్తిగారు "ఏదీ లేపాక్షి బసవయ్య గీతం" అన్నారు. నేను పాట ప్రారంభించాను నే ననుకున్న దానికన్నా చాల అందంగా ముగిసింది పాట. పాట పూర్తి అవగానే నా వెనుకనుండి మెత్తని చప్పట్లు వినిపించాయి. నేను గ్రహించాను. హేమలతగారి బృందం వచ్చి రహస్యంగా నా పాట విన్నదని "హేమలతగారూ! కనిపెట్టాను లెండి" అన్నాను. హేమలత ఒకసారి ముందుకు వచ్చి "పాట [illegible] పాట ఆపేస్తారేమో అని దాగుండిపోయాం. పాట బాగా పాడారు. థాంక్స్" అందామె. నాకు కొద్ది దూరంలో కూర్చుంటూ. "మీ పాట వినేశాం" అంది నిర్మల ముందుకు వస్తూ. ముందుకు వచ్చిన నిర్మలతోపాటు ఇద్దరమ్మాయి లుండటం, అందులోనే ఉదయం చూసిన అమ్మాయి కూడ ఉండటం ఆశ్చర్యాన్నందాన్ని కలిగించింది. "నా ఫ్రెండ్సు, కెమిష్ట్రి ఫైనల్ స్టూడెంట్సు" మావాళ్ళ నందర్నీ వారికి పరిచయం చేసింది నిర్మల. వారి గురించి మాత్రం తానేమీ చెప్పలేదు. నేను కొద్దిగ నిరుత్సాహపడ్డాను. రెండో అమ్మాయి క్రిష్టియన్. అందరం వృత్తాకారంలో కూర్చున్నాం. నేనూ, నాకు కొద్ది దూరంలో హేమలత, నిర్మల స్నేహితురాండ్రు, నిర్మల, హనుమంతరావు, శాస్త్రి, మూర్తిగారు మళ్ళా నేనూ. నేను ఆమె వైపు చూశాను. ఆమె 'ఇందుమతే అయితే ఎంత బాగుండును' అనుకున్నాను ఇందుమతే నేమో అనే ఆశ కలిగింది

"మాష్టారు! పాటతెచ్చారా?" అడిగింది హేమలత. పాకెట్ లోంచి కాగితాన్నితీసి మౌనంగా ఆమెకు అందించాను. "ఒకసారి పాడి వినిపించండి" అందామె కాగితాన్ని ఇసుకమీద పరచి, చివర్లలో ఇసుక పోసి ఉంచుతూ "మాకందరికీ పాటలు ఇష్టం. మీరెన్ని పాడేసినా వింటాం [illegible]" అంది నిర్మల. "షూర్" అన్నాడు శాస్త్రి పాట ప్రారంభిచాను.

"గాలిలో నావ్రతుకు తేలిపోయిన దోయి. నీటిలో కలిసింది మాలినావ్రతుకోయి." పాటపూర్తయింది. మెత్తగా చప్పట్లు వినిపించాయి నలుమూలల నుండి. "మీ గొంతులో బరువుంది విషాద గీతికలు మీ గొంతుకలో బాగ తిరుగుతాయి. ఏదీ మరొక్కటి" అంది నిర్మల. ఆమె స్నేహితురాండ్రు చెవుల, చూపుల నామీదే కేంద్రీకరించారు

"విషాదగీతికా?" అన్నాడు శాస్త్రి "ఏం వద్దా?" అన్నాడు హనుమంతరావు

"ఒద్దసి కాదు. ఈ చివరిరోజున విషాద గీతికలేమిటాని?" అన్నాడు శాస్త్రి.

"ఫరవాలేదు. అవే బాగుంటాయి. పాడండి మాష్టారూ!" అంది నిర్మల మూర్తిగారు సిగ్నల్ యిచ్చారు. నేను ప్రారంభించాను.

వాడిపోయెను ఈ లత
మారిపోయెను ఈ కథ
విన్నపూచిన పువ్వులన్నీ
వాడినేలకు రాలిపోయె.
నేడు పూచే పూవులేవీ
కంటికేమి కానరావు. వాడి॥
ఎన్నికురిసిన వానవెనుక
మిగిలిపోయిన పరదలాగ
కడకునీకు మిగిలెనేమో
వేడి వేడి కన్నీరు
మబ్బుమాటున మెరుపులాగ
వలపుచిలికె మధువులాగ
లతికచివర పూవునేమో
మోమువాడని జాజిపువ్వు వాడి॥

"చాల బాగుంది" - మళ్ళా చప్పట్లు. "లత అన్నారు కదా! నేను కాను కదా?" అంది హేమలత. అందరం నవ్వాము. "మారిపోయెను ఈ కథ. అన్నారు. ఏమిటా కథ?" అన్నాడు శాస్త్రి. అసలు ఉదయం ఒక కథ చెప్తానని ప్రామిస్ చేశారు. కథ చెప్పండి" అంది నిర్మల. అందరూ కథ చెప్పమని పట్టుపట్టారు. నాకు మాత్రం మనసు రావటం లేదు.

చల్లని గాలి హాయిగా మామీద వీయనారంభించింది. సముద్రకెరటాలు కేరింతలుకొడుతూ ఆడుకుంటున్నాయి మామీద, సముద్రం అంతటా వెన్నెల పల్చగా పరుచుకుంది. ఈ వాతావరణం చాల అహ్లాదకరంగా ఉంది. ఈ వాతావరణానికితగ్గ కథ చెప్పండి." అన్నారు మూర్తిగారు. అతని మాటను కాదనడని అందరికీ తెలుసు.

"ఇప్పుడు ఇంకెక్కడికి పోతారు?" అంది నిర్మల కవ్వింపుగా.

"ఈ వాతావరణాకి తగ్గది ప్రేమకథ. చక్కటి కథ చెప్పండి." అంది హేమలత

"కథలు చదివి, సినిమాలు చూసి విసిగెత్తిపోయాం ప్రేమకథలు వద్దు" హనుమంతరావు ప్రొటెస్టు చేశాడు. "కాదు ప్రేమకథే కావాలి" నిర్మల పట్టుపట్టింది.

"పోనీ సుఖాంతం చెయ్యండి" అన్నాడు శాస్త్రి.

"కాదండి ట్రాజిడీ అయితేనే బాగుంటాయి" అంది నిర్మల ఫ్రెండు.

"ఏ కథ అయిదేనేం? చెప్పేతీరులో ఉంది. వినటానికి మేమంతా సిద్ధమే" అన్నారు మూర్తిగారు. అంటే కథను వినటానికి ఆయన అందర్నీ సిద్ధపరిచారన్నమాట. నేనందర్ని పరికించి చూశాను. అందరిదృష్టి నామీదే ఉంది.

"అయితే చెప్తాను. కథను చాల జాగ్రత్తగా వినండి. ఇందులో ప్రతిమాట ప్రతిసంఘటన చాల ముఖ్యమైనవి. కథ సాగుతున్నంతకాలం ఎవరూ ఏమి

వే ప్రశ్నలు యకూడదు. కథ ముగిసిన తరువాత అడగవచ్చు నేచెప్పవచ్చు" అన్నాను.

"ఓ. కే!" అన్నారంతా.

నేను ప్రారంభించాను.

మన జీవితాలలో ఎన్నో సంఘటనలు జరుగుతాయి. కాని అన్నీ ముఖ్యమైనవి కావు. కొన్నిమాత్రం మనజీవితాలపై మంచి ప్రభావాన్ని కలిగిఉంటాయి. అలాగే మన జీవితాల్లో మనం ఎందరినో కలుస్తాం. కాని కొందరే మనమనసుల్లో మిగిలిపోతారు. వాళ్ళు తారసపడటం చేతనే జీవితంలో పెద్దమార్పులు వస్తాయి. కొందరు కొంతకాలంవరకే మన జీవితంలో ప్రభావాన్ని కలిగిఉంటే మరికొందరు జీవితాంతం మనసులో రాజ్యమేలుతారు. మనం ఆ సంఘటనలు గాని, ఆ వ్యక్తుల గాని మరచిపోలేము." నేనాగాను. అందరూ నాకు దగ్గరగా జరిగారు. వెన్నెల చిక్కపడింది. గాలి వీయనారంభించింది మనసుకు హాయిని కలిగిస్తూ.

"సారథి ఆ ఊరువెళ్తాడని అతడు ఏనాడూ అనుకోలేదు. వెళ్ళినవాడు వెంటనే తిరిగివస్తాడని అనుకున్నాడే గాని మూడు రోజులపాటు ఉండవలసి వస్తుందని అనుకోలేదు. కాని అలా జరిగింది.

సారథి, వేణు బి.ఎస్.సి. విద్యార్థులు. క్లాస్ మేంట్సు. రూమ్ మేంట్సు. మంచి స్నేహితులుకూడ. గ్రూపులు మాత్రం వేరు. వేణూది ఏభైమైళ్ళ దూరంలో ఉన్న ఊరయితే సారథిది నూరుమైళ్ళ దూరంలో ఉన్న గ్రామం-స్వస్థలాలు. వాళ్ళు ఫైనలియర్ చదివేటప్పుడు దసరా సెలవుల తరువాత వేణు జ్వరంపడ్డారు. అతడక్కడ ఉన్న అన్ని సంవత్సరాలలో అస్వస్థత అతనికి కలుగలేదు. జ్వరంరాగానే కంగారు పడ్డాడు. ఇంటికి దిగబెట్టి రమ్మని సారథిని కోరాడు. ట్రైన్‌కి బండిని పంపమని వేణు తండ్రికి ఉత్తరం వ్రాసి వేణుని తీసికుని బయలుదేరాడు సారథి. ప్యాసింజరు బండి ఆ చిన్న స్టేషనులో ఆగగానే స్టేషన్‌కు గుర్రం బండిని తీసికొచ్చిన రంగన్న వాళ్ళకు ఎదురొచ్చాడు. బండి ముందుకు పోతూంటే వేణు అన్నాడు. "చూశావా! నాకోసం స్టేషనుకు ఎవ్వరూ రాలేదు." అన్నాడు బాధపడుతూ.

"రాకూడదని రాకుండా ఉండరు కదా!" అన్నాడు సారథి.

"నీకు తెలియదు. నీవే చూస్తావు" అన్నాడు వేణు నీరసంగా నవ్వి.

ఊరికి స్టేషన్‌కి నాలుగుమైళ్ళ దూరం. బండి ఊరిని చేరేసరికి రాత్రయింది. ఇప్పటిలాగే వెన్నెల కాస్తోంది. పెద్ద దివాణంలో ఉన్న భవనం ముందు జట్కాబండి ఆగింది. ఆ భవనాన్ని చూస్తుంటే అర్థమైంది, వేణుది ఎంత కలిగిన కుటుంబమో. వేణుకి రంగన్న

ముందుకెడుతూంటే సారథి అనుసరించాడు. వారికి రామస్వామిగారు– అంటే వేణు తండ్రి ఎదురయ్యారు. "అక్కడ ఎవరైనా డాక్టరుకి చూపించలేకపోయారా? సరే మేడమీదికి తీసుకెళ్ళు రంగన్నా! డాక్టరుకి కబురు పెడదాం. ....మీరు మా వేణు స్నేహితులా? మంచిది మా యింటిలో రెండు రోజులుండి వెళ్ళండి.... వేణుకి తగ్గిపోతే కలిసే వెల్దురుగాని.... రంగన్నా ఈ అబ్బాయికి మన ఔట్ హౌస్‌ను చూపించు. వస్తాను. చెఱకుతోటవైపు వెళ్ళిరావాలి. రంగన్నా అమ్మగారికి చెప్పు" అని వెళ్ళిపోయాడు. రంగన్న వేణుని మేడమీదికి తీసికెళ్ళాడు. వాళ్ళను అనుసరించబోతుండగా మరో నౌకరు వచ్చి "రండి బాబూ! వెనకింటికి వెళ్దాం" అని సారథి ఎయిర్ బ్యాగు అందుకున్నాడు. తలుపు తెరచి దీపంవేసి నౌకరు వెళ్ళిపోతూంటే సారథికి అనిపించింది. "ఇది ఆతిధ్యం అనుకోనా? లేక వేణుకి నాకు మధ్యన అంతరాన్ని తెలియజేయడమనుకోనా?"

సారథి బట్టలు మార్చుకొని కుర్చీలో కూర్చోబోతుండగా గది అవతల గాజుల చప్పుడయింది. సారథి భ్రుకుటి ముడిచాడు. గది అవతలికి అతను దృష్టి సారించేలోగా పదహారు పదిహేడేళ్ళ వయసుగల అమ్మాయి కాఫీకప్పుగల ట్రేని టీపాయి మీద పెట్టి 'కాఫీ' అని చెప్పి వచ్చినంత వేగంగా నిష్క్రమించింది.

ఆత్రుటి కాలమే చాలు సారథిలో వినూత్నానుభూతిని నింపటానికి. ఆత్రుటి కాలంలో తలఎత్తి ఆమెచూచిన చూపే చాలు; అతనిలో గాఢమైన ముద్రవేయటానికి, "కాఫీ!" అని ఆమెమాట యధాలాపంగా అన్నా, ఒక గోడకు చెప్తున్నట్టు చెప్పినా, ఆమె చూపులు ఒక నిర్జీవ పదార్థాన్ని చూచినట్టు చూచినా, ఆమె గొంతులో కిన్నెరవాణిని అతడు గుర్తించకపోలేదు. ఆ చూపులో అమాయకత్వం అతనిని కదలించకపోలేదు. వచ్చినంత వేగంగా ఆమె వెన్నెలలోకి నడచిపోయింది ఆమె నడచిపోతూంటే అందాలస్రోవు నడచిపోయినట్టు అనిపించింది సారథికి.

నేను ఆగాను. అందరూ నావైపు చూశారు. నేను ప్రారంభించాను.

"కథను వ్రాయడంలో ఉన్న స్వేచ్ఛ చెప్పటంలో ఉండదు. ఇక్కడ అందాలరాశిని వర్ణించే అవసరం ఉంది. కాని సారథి చూసిన ఆమెను నేను వర్ణించబోవటంలేదు. అందంగా వంగిన ఆమె కనుబొమ్మలను గాని, సన్నగా కెంపులై మెరిసే లేతపెదవులను గాని, పొడవైన అందమైన ఆమె ముక్కును గాని, శిల్పి చెక్కిన ఆ అందమైన విగ్రహాన్ని గాని, ఆమె కళ్ళలోని అమాయకత్వాన్ని గాని, ఆమె శరీర వర్ణాన్ని గాని చిత్రించి పటం కట్టి మీ ముందు నేనుంచబోవటం లేదు. కారణం? సారథిని ఒక్క త్రుటికాలం




లోనే ఆకట్టుకున్నది ఆమె అందకాదు. ఆమె కళ్ళలో అమాయకత్వం మాత్రమే ఆతనిని ఆకర్షించగలిగింది.

"ఎవరీమె?" అనుకున్నాను.

"ఎందుకు ఈమెను చూస్తే జాలి కలుగుతోంది?" ఆలోచనలో పడ్డాడు.

"స్నానానికి రండి బాబూ!" నౌకరొచ్చి పిలిచాడు.

స్నానం చేసి వచ్చేసరికి "భోజనానికి రమ్మంటున్నారు" మళ్ళీ ఆ అమ్మాయే గోడకు చెప్పినట్లు చెప్పి వెళ్ళిపోయింది.

సారధి భోజనానికి వెళ్ళే ముందు వేణుని చూచివద్దామనుకున్నాడు. కాని వేణు పిన్నతండ్రి గోపాలరావు ఎదురుపడి డైనింగ్ రూములోకి తీసికెళ్ళాడు.

"జ్వరం తప్ప మరే అనారోగ్యం లేదు. వాడికి మాత్రం కంగారెక్కువ. మీరు భోజనం చెయ్యండి. రేపుదయం చూడవచ్చు" అంది నడివయస్సులో ఉన్నట్లు కనిపించే స్త్రీ. ఆమెను చూడగానే ఆమె వేణు తల్లి అయివుంటుందనుకున్నాడు. ఆ పోలికలలా ఉన్నాయి. భోజనానికి ఇంటిల్లిపాది వచ్చారు రామస్వామి గారు భోజనానికి వేళకి అందుకోగలిగిన నాడు అందరూ డైనింగ్ రూములో కలుసుకుంటారట. లేకపోతే ఎవరి టైము వారిదేట. గోపాలరావు చెప్పాడు. అతడే వేణు చెల్లెళ్ళని, తల్లిని తండ్రిని పరిచయం చేసాడు. దూరప్రాంతంలో ఉన్న అన్నలను పరిచయం చేసాడు. కాని తనకు పరిచయమైన వారెవ్వరిలో 'ఆమె' లేకపోవటం సారధిని తికమక పెట్టింది. 'ఆమె ఎవరు?' అంటూ ఆలోచిస్తున్న సారధిని "కూర్చో సారధీ" అన్నారు రామస్వామి గారు.

ఒక వితంతువు వడ్డన చేయసాగింది. "ఈమె వేణు 'చెల్లెలు' కాదు బంధువా?" ఆలోచిస్తూంటే ఎవరో వెనుక వైపు నడచి పోయినట్టయింది. తల తిప్పి చూడటం సభ్యత కాదని ఊరకున్నాడు.

"వేణునొకసారి చూచివస్తాను" అన్నాడు భోజనం చేసి సారధి, మేడమీది ముందు గదికి దారి చూపాడు గోపాలరావు. సారధి వెళ్ళేసరికి ఆ అమ్మాయి తలుపు దగ్గర గదిలోపల నిల్చుని ఉంది. పాలలో రొట్టెను ముంచుకొని తింటూ ఆమెతో ఏదో మాట్లాడుతున్నాడు వేణు ఆమె తల వంచుకుని వింటున్నది. సారధిని చూచి "రా సారధీ!" అన్నాడు వేణు. ఆమె తల ఎత్తి చూసింది. "శారదా! వీడే సారధి. నా స్నేహితుడు" అని పరిచయం చేశాడు. ఆమె నమస్కారం చేసింది. సారధి ప్రతి నమస్కారం చేశాడు.

"శారదా! ఈ రెండు రోజులూ సారధిని కనిపెట్టి ఉండవలసినది నీవే! ఈ ఇంటిలో మనిషి చచ్చినా బ్రతికినా పట్టించుకునే వారెవ్వరూ లేరు" అన్నాడు వేణు.

"అలాగే" అంటూ సారధివైపొకసారి చూచి వెళ్ళిపోయింది శారద.

"సారధీ! నా కెంత బలగం ఉందో చూశావా? నేనెంత స్థితిపరుడనో గమనించావా? కాని నేను ఈ ఇంటికి వచ్చి సుమారు నాలుగు గంటలవుతున్నా ఏ ఒక్కరూ తొంగి చూడలేదు. నాకు

డబ్బుంది. ఆస్థి ఉంది. కాని చల్లని మాటలాడే వాళ్ళు లేరు. అందుకనే స్నేహమంటే ప్రాకులాడుతాను. ఇది తెలిసి ఇంత దూరం ఎందుకొచ్చావని అంటావేమో, శారద ఉన్నాదన్న ధైర్యం వల్ల. శారదది చాల జాలి గుండె శారద ఒక్కసారి పలుకరిస్తే చాల బాధలన్నీ మరపుకొస్తాయి. నీవు శారదను చూశావు కదూ! శారద చాల మంచి పిల్ల. కాని అమాయకురాలు...." అంటూ కొద్ది క్షణాలు ఆగి, "సారధీ!.... రోజు లెప్పుడూ ఒకలాగే ఉండవు. నా చదువైపోతోంది. శారద సుఖపడుతుంది. శారదను ఈ నరకంలోంచి తీసికెళ్ళి పోతాను. శారద ఈ ఇంటిలో దాసీగా బ్రతకవలసిన అవసరం లేదు. మాసిన బట్టలు కట్టక్కరలేదు...." ఇంక వేణు ఏం చెప్తున్నాడో సారధికి వినిపించలేదు. మనసులో మబ్బులు కమ్మినట్టయింది. 'శారదపై వేణుకి హక్కుంది శారద వేణూ ఆస్థి" అన్నది అతనికి అర్థమైంది.

"దేవుడెప్పుడూ మంచివాళ్ళ పక్షమే ఉంటాడు. చింత పడకు" అని తనకు తోచిన విధంగా అనునయించి, అతని చేత టాబ్‌లెట్ వేయించి గదికి వచ్చేశాడు సారధి.

తలుపుతీసి గదిలోకి అడుగు పెడుతూండగా వెనుకనే వచ్చింది శారద. గాజుల ధ్వనిని విని వెనుకి తిరిగాడు. వెండి మరచెంబు మీద వెండి గ్లాసును బోర్లించి టీపాయి మీద పెడుతూ 'మంచి నీళ్ళు' అంది శారద.

"మీ పేరు శారదా?" తడబడుతూ అడిగాడు. 'అవును' అంది తల దాచుకుని ఆమె.

"చదువుకున్నారా?"

"ఎస్. ఎస్. ఎల్. సి"

"ఈ ఊళ్ళో స్కూలుందా?"

"ఉంది"

"వేణు గురించి ఆందోళన పడుతున్నారు కదూ! జ్వరమే. మందువేసుకున్నాడు. తగ్గిపోతుంది" అన్నాడు సారధి. కృతజ్ఞతా పూర్వకంగా చూచిందామె ఇంకా ఏతనేమైనా అడుగుతాడేమో అని ఎదురుచూచిన శారద "పెద్దవాళ్ళు చిన్నవాళ్ళను 'మీరు' అని మన్నించవచ్చా?" అని అడిగింది.

"పరిచయం లేనప్పుడు అలాగే అనాలి" అన్నాడు

"వెళ్తాను" అంది శారద "మంచిది" అన్నాడు సారధి.

ఆమె వెళ్ళిన తరువాత అతని మనసు చాల కల్లోలమైంది.

"శారద ఈ ఇంటిలో పనిమనిషా? సారధి గుండె కలుక్కుమంది. 'ఈ దివ్యాంగన ఈ ఇంటిలో పనిమనిషి ఎలా అవుతుంది? ఈమె ఈ ఇంటిలో దాసిన అవుతుందా? కాదు. కాకూడదు. అదే నిజమయితే దేవుడు చాల పక్షపాతి. ఈమె అందగత్తె అని సానుభూతి

చూపుతున్నాడా? కాదు.... కాదు.... ఆమెలో అమాయకత్వం తనను ఆకర్షిస్తోంది. సహన గుణం, వినయవిధేయతలు అందానికి మెరుగులు పెడుతున్నాయి. కాని శారద గురించి ఇంతగా ఆలోచించవచ్చా? .... కూడదు .... శారద వేణు సొమ్ము. వేణూలాంటి భర్తను పొందగలుగుతోంది....” ఇలా ఆలోచిస్తున్న సారధి కెప్పుడో నిద్ర పట్టింది

రాత్రి కలలో సారధికి శారదే కనిపించింది. విశ్వాలంగా ఆతనినే చూస్తోంది. వెన్నెల్లో కొబ్బరిచెట్ల నీడల్లో నిలబడి, 'శారదా' అంటూ పరుగెత్తి పట్టుకున్నాడు. కాని ఆమె దొరికిందో లేదో కల కరిగిపోయింది. కళ్ళు తెరచి చూశాడు. వెన్నెల విరగపూస్తోంది మేడ నిద్రపోతోంది.

“ఒక్క క్షణకాలంలోనే శారద ఇంతగ మనసు నాకట్టుకుందే! కారణం ఏమై ఉంటుంది? కాలేజీలో ఎంత మంది ఆడపిల్లలు కనిపించటం లేదు. ఎగ్జిబిషన్లలో, సినిమా హాళ్ళలో, బస్సు స్టాండ్లలో, రైళ్ళలో ఎందరు కనపడటం లేదు. ప్రాక్టికల్ క్లాసుల్లో ఒకరి కెదురుగా ఒకరు, ఒకరు ప్రక్క ఒకరు ఉన్నా సంచలనం కలగనిది ఈమెను చూస్తే గుండె ఎందుకు స్పందిస్తుంది? ఎవరినైనా ఆకట్టుకునే నేర్పు ఈమెకుందా? కాని ఆ ప్రయత్నమేదీ ఆమె చేస్తున్నట్లు కనిపించదే. మరి మనసెందుకు ఆమె వైపు మొగ్గుతోంది? .... ఏది ఏమైనా శారద గురించి ఆలోచనలు చేయకూడదు....” అని మనసు సదిలపరచుకొని ప్రయత్నిస్తూ నిద్రకొరిగాడు సారధి.

కథ చెప్తున్న నేను ఆగాను.

“ఎందుకా కంగారు? చెప్పండి చెప్పండి” అన్నాయి అన్ని గొంతుకలు.

వెన్నెల విరగపూసింది.

వెన్నెల సముద్రం అందంగా మెరస్తోంది. గాలి హాయిగా వీస్తోంది.

“ఈ కథను చెప్పడానికి మీరు చాల ముందుగా బాగ ప్రిపేర్ అయినట్టుంది. మీరు కథ చెప్పే విధానం. కథ వ్రాసికోడానికి వీలుగా ఉన్నట్టుగా ఉంది మీరు కథను చెప్పేరీతి. చెప్పండి మరాపకండి” అన్నారు మూర్తిగారు.

నేను కథను ప్రారంభించాను.

మర్నాటి ఉదయం కాఫీ టిఫిన్ తెచ్చిన శారద అంది “రాత్రంతా వేణుకి జ్వరంగా ఉంది. మీరొకసారి వెళ్ళి చూడండి” అని.

వేణుని చూడటానికి మేడ మీది కెళ్ళాడు. వేణు జ్వరంతో మూలుగుతున్నాడు.

“డాక్టరు దగ్గరి కెళ్దామా?” అడిగాడు సారధి.

“మేమే వెళ్ళే అలవాటు లేదు. నాన్నగారికి చెప్పు. డాక్టరుకు కబురు

పెడతారు. నాన్న లేకపోతే బాబాయికి చెప్పు'' అన్నాడు. సారథి క్రిందికి వెళ్ళాడు ఇద్దరూ లేరు పనిమీద పొలం వైపు వెళ్ళిపోయార్ట ఉదయమే.

"నేను వెళ్ళి పిల్చుకొస్తాను'' అన్నాడు సారథి "వద్దులే" అన్నాడు నీరసంగా వేణు సారథి వినలేదు. ఇంటి పనివాడి సహాయంతో అరగంటలో డాక్టర్ని వెంట పెట్టుకొని వచ్చాడు. డాక్టరు అరగంట అట్టహాసంచేసి పరీక్షించి ఇంజక్షన్, కాప్స్యూల్ ఇచ్చి సాయంత్రం వచ్చిచూస్తానని చెప్పి వెళ్ళిపోయాడు. డాక్టరు రావటం చూసి వేణు అమ్మగారు వచ్చి "ఇంకా జ్వరం తగ్గలేదా ?" అంటూ "డాక్టరు మందిచ్చాడా ? వేసికో కాఫీ పంపిస్తాను. శారదా !" అని కేకవేసుకుంటూ క్రిందికి దిగి పోయిందామె.

"ఈ ఇంటిలో మనుషులుండలేరు సారథీ ! యంత్రాలే ఉండాలి" అన్నాడు వెళ్ళిపోయే తల్లిని చూచి. అక్కా చెల్లెళ్ళు ఉదయం 9 గం॥ అయితే గాని లేవర్ట వారికి తిండి మీద అలంకరణ మీద, తలుర్ల మీద తప్ప మరి దేనిమీద శ్రద్ధ లేదట. శారద ఉండబట్టి ఇల్లు నడుస్తోందని. ఆమె లేకపోతే తానా ఇంటి నుండి ఏనాడో పారిపోయి ఉండే వాడని వేణు చెప్పాడు, సారథితో.

శారద కాఫీ తెచ్చింది. "నిజమైన స్నేహితులు మీలాగే ఉంటారు" అంది శారద సారథిని చూస్తూ. "ఇది చాలా స్వల్ప విషయం. మనిషి మనిషికి ఎందుకు ? తోడుకోసం కాదూ ?" అడిగాడు సారథి సారథి వైపు మెరిసే కళ్ళతో చూచింది శారద.

"మనిషికి ఏమున్నా లేకపోయినా అనురాగం చూపే భార్య, ప్రాణాన్నిచ్చే స్నేహితుడు ఉంటే చాలు. ఎన్ని లోకాలైనా జయించవచ్చు. ఏం సారథీ ?" అన్నాడు వేణు

"అవును" అన్నాడు సారథి శారద వైపు చూస్తూ.

సారథి తనవైపు చూడటం చూచి అప్రయత్నంగా మెరిసే కళ్ళతో సారథి నొకసారి చూచి గబుక్కున తల దించుకుని అక్కడి నుండి వెళ్ళిపోయింది శారద.

"సారథీ ! శారదకు వగని సిగ్గు" అంటూ నవ్వాడు వేణు [illegible] సారథికి అర్థంకాలేదు మధ్యాహ్నం భోజనానికి నౌకరు వచ్చి పిలిచాడు. శారద రాలేదు. సాయంత్రం డాక్టరు వేణుని చూసి ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళాడు.

రాత్రి భోజనానికి శారద వచ్చి "భోజనానికి రండి" అంది తలుపు దగ్గరే నిలబడి.

"వస్తాను.... కాని.... ఈ రోజంతా కనిపించలేదేం ?" తడబడుతూ అడిగాడు.

శారద తల వంచుకుని "ఏమో !.... నాకు తెలీదు" అంటూ తడబడే అడుగులతో వెళ్ళిపోయింది.

సారథి మనసు అదోలా అయింది. "శారద కనిపించదా? కనిపించినా మాటాడదా?"

యాంత్రికంగా భోజనం చేశాడు. గదికి తిరిగి వచ్చేసరికి మంచం దగ్గర టీపాయి మీద వెండి మరచెంబు; వెండి గ్లాసు ఉన్నాయి. సారథి మనసు కలుక్కుమంది.

"శారద నా కంటపడదా?" మధన పడ్డాడు.

"ఛా! నేను శారద గురించి ఆలోచించ కూడదు....శారద నా మనసులో నుండి తొలగిపోవాలంటే త్వరగా ఇక్కడ నుండి వెళ్ళిపోవాలి వెళ్ళిపోతాను. శారద ఎదురుగా ఉన్నంతకాలం మనసు వలలో చిక్కిన చేపలా గిలగిలలాడక తప్పదు. వెళ్ళిపోతాను" నిర్ణయించు కున్నాడు సారథి.

రాత్రి కూడా శారద కనిపించలేదు. గాని శారదతో మాటాడుతున్న భ్రాంతి.

మర్నాటి ఉదయం కాఫీ టిఫిన్ తెచ్చి అంది శారద" వేణుకి రాత్రి జ్వరం తగ్గింది. వేణు మిమ్మల్నే అడుగు తున్నాడు. ఒకసారి వెళ్ళి చూడండి."

"అలాగే" అన్నాడు సారథి, ఆమె వైపు చూడకుండా తల ప్రక్కకు తిప్పుకుని మనసులో ఎంతో ఉక్రో షంగా ఉంది కాని ఎలా వెలువరిం చాలో తెలియటంలే దతనికి. శారద కదలలేదు." "గ్లాసు, ప్లేటు పంపించేస్తా లెండి మీరు వెళ్ళండి" తల వంచుకునే అన్నాడు. కొద్దిసేపు కదలలేదు. అతను తల త్రిప్పేలోగా "వెళ్తాను లెండి" అంటూ వెళ్ళిపోయిందామె. ఆమె గొంతులో బరువు గమనించి తలత్రిప్పి చూశాడు ఆమె వెళ్ళిపోతోంది

"అయ్యో య్యో! శారద వెళ్ళిపో తున్నదే" బాధపడ్డాడు సారథి.

ఆమె ఉన్నంతసేపు ఎందుకు బెట్టు చెయ్యాలనిపించిందో, ఆమె వెళ్ళిపోగానే "అయ్యో" అని ఎందుకనిపించిందో అర్థంకాలేదు సారథికి

సారథి వేణు గదివైపు వెళ్ళబోతుం డగా మేడమెట్లు ఎక్కబోతున్న శారద వెనుదిరిగి వెళ్ళిపోయింది. నిట్టూర్చి వేణు గదిలోకి చేరాడు సారథి

"జ్వరం తగ్గిపోయింది సారథీ. ఒళ్ళంతా చెమటతో స్నానం అయిపో యింది" ఆనందంగా చెప్పాడు వేణు. చిరునవ్వు నవ్వుతూ వేణుచేత బట్టలు మార్పించాడు సారథి. వేణూ ఏదో చెపుతున్నాడు. కాని ఏదీ వినిపించటం లేదు సారథికి.

కొద్ది సేపటిలో రెండు కప్పులతో కాఫీ తెచ్చింది శారద.

టేబిల్ మీదనుండి కాపీకప్పు అందు కుంటూ "ఈరోజు సాయంత్రం జ్వరం నీకు మళ్ళా రాకపోలే మరి జ్వరం రాదు. నేను రేపుదయమే వెళ్ళిపోతాను. క్లాసులు పోతాయి" అన్నాడు సారథి.

తలగడా గలేబును మార్చుతున్న శారద తల ప్రక్కకు వంచి గలేబు త్రాళ్ళు ముడివేయసాగింది.

"నీకు ఈ ఊరిలో బోర్ కొడుతోంది కదూ!" అన్నాడు వేణు.

"కాదు. క్లాసులు పోతాయి" నేను మాత్రం ఉండి చేసే దేముందిక్కడ? నిన్ను చూచేవారు, కనిపెట్టేవారు ఒక రున్నారు కాబట్టి నాకు నీ గురించి బెంగలేదు" అన్నాడు సారథి.

దుప్పటిని మడత పెడుతున్న శారద ఆగింది.

"నీమాట నిజమే! సారథీ! శారద ఉంది. నాకింక ఏం ఫరవాలేదు. కానీ నీవు వెళ్ళిపోతే నాకెలా ఉంటుంది.... కాని....నీవు వెళ్ళాలి కదా! వెళ్ళు." అని ఆగి మళ్ళా అన్నాడు వేణు "కాని.... సారథీ నీవు దేవుణ్ణి ఎప్పుడు ప్రార్థించినా 'అమాయకులయిన ఆడవాళ్ళను సృష్టించ వద్ద'ని ప్రార్థించు. ఒకవేళ సృష్టించినా అందము నివ్వద్దని చెప్పు" సారథి నవ్వి "అలాగేలే!" అన్నాడు.

శారద కాఫీ కప్పులు తీసికుని అవతలికి వెళ్ళిపోయింది

"మీ శారద ఇవాళ ముభావంగా ఉందేం?" అడిగాడు సారథి

"మనం మాట్లాడుకుంటున్నాం కదా! కల్పించుకుని మాటాడే చొరవ శారదకు లేదు నాకు జ్వరం తగ్గిందని చెప్పిన దగ్గర్నుంచి ఎన్నికబుర్లు చెప్పిందనీ! అన్నీ నీ గురించే. నీవు చాల మంచి వాడవట మంచి స్నేహితుడవట, క్రొత్త మనిషిలాగే కనపడలేదట, ఎప్పుడో చూచినట్టే ఉందట. గొంతు ఎప్పుడో విన్నట్టుగానే ఉందట .... సారథీ!....శారద చాల అమాయకురాలు నా ఆందోళనంతా శారద గురించే...." వేణు ఆగగానే

'శారద ఎవరు!' అని అడుగుదా మనుకున్నాడు. వేణు మాటలతో ఆర్ద్రమైన మనసులోంచి మాటలు పైకి తన్నుకుని రావాలని తాపత్రయ పడుతూంటే డాక్టరు గదిలోకి వచ్చాడు. డాక్టరు మాటాడుతూ క్రిందికి దిగివచ్చి ఊళ్ళోకి వెళ్ళి తిరిగి వచ్చేసరికి పన్నెండు గంటలు మధ్యాహ్నం వేళ అయింది సారథికి గదిలోకి వచ్చేసరికి గదంతా చాల శుభ్రంగా సర్దబడి ఉంది "శారదే చేసిందా ఈ పని!" అనుకున్నాడు. "శారదే చేస్తుందని ఎందుకనుకోవాలి" సరిపెట్టుకున్నాడు.

పని కుఱ్ఱవాడు వచ్చి భోజనానికి పిలిచి వెళ్ళిపోయాడు.

మంచి నిద్రపట్టింది. నిద్ర లేచేసరికి సాయంత్రం అయిదవుతోంది. ముఖం మీద చల్లటినీళ్ళు జల్లుకుంటూంటే శారద కాఫీ టిఫిన్ గదిలో పెట్టి వెళ్ళిపోతోంది. చూశాడు సారథి వెనక్కి పిలవాలనుకున్నాడు కాని ఆమె తిరిగి వచ్చిన తరువాత ఏమి మాటాడాలో తెలియలేదతనికి

సాయంత్రం షికారు కెడుతూ ఆలోచించాడు.

"ఒకపూట శారద కనిపించకపోతే మనసు మసకబారిపోయింది. ఆ బాధ తోనే శారదను బాధపెట్టి నేను బాధపడు తున్నాను. క్షమించమని శారదను అడుగుతాను" ఆలోచిస్తూ ఇంటికి తిరిగి వచ్చి వేణుని కలిశాడు.

"సారథీ నాకు ఈ రోజంతా జ్వరం రాలేదు. మరి రాదు. నీవు అనుకున్నట్టుగా రేపు బయలుదేరవచ్చు. నీకు చాల శ్రమ యిచ్చాను. నీవు బాధపడవు. కాని నా విధి కృతజ్ఞత చెప్పుకోవటం" అన్నాడు.

వేణు మరిరెండు రోజులు తనని ఉండమని అన్నట్టయితే బాగుండేది అని అనిపించింది సారథికి.

"బాబాయికి చెప్పు ఉదయాన్నే ట్రైన్ కి బండి ఏర్పాటు చేయిస్తాడు" అన్నాడు వేణు.

"వెళ్తాను. ఉదయం వీలైతే కలుస్తాను" అంటూ క్రిందికి దిగి వచ్చేశాడు వేణు బ్రతిమిలాడినా ఉండా లనిపించలేదతనికి.

భోజనానికి పనిక్కుర్రవాడేపిలిచాడు.

భోజనాల దగ్గర మర్నాడు బయలుదేరి వెళ్ళిపోవా లనుకుంటున్నట్టు చెప్పాడు. రామస్వామిగారు గోపాల్రావుని బండి ఏర్పాటు చేయించమని చెప్పారు.

శారద అపేళ్ళప్పుడు ఆ సమీపంలో ఉంది. శారదకు ప్రత్యేకంగా చెప్పి శెలవు తీసుకోవాలని ఉంది. కాని ఎలా పిలవుతుందో తెలియలేదు.

నెమ్మదిగా గదిలోకిచేరాడు. గదిలో మరచెంబు లేదు. శారదవస్తుందని ఆశ.. ఒక నమ్మకం. వరండాలో కుర్చీవేసుకుని కూర్చున్నాడు బయట పండువెన్నెల. కొబ్బరిచెట్లు నీడపడటంచేత, జాజిపందిరి అడ్డుగా ఉండటంచేత వరండాలో కొంత భాగం, అతను కూర్చున్నచోట చీకటిగా ఉంది శారద కనిపించే అవకాశం అతని కుంది. అతను కనిపించే అవకాశం ఆమెకు లేదు.

అరగంట భారంగా గడిచింది.

వెండి మరచెంబుతో నీళ్ళు పట్టుకొచ్చి గదిలోపలికి వెళ్ళిపోయింది. ఆమెకు సారథి గదిలో కనిపించలేదు. "ఎక్కడకు వెళ్ళారబ్బా!" అని గుమ్మందగ్గర కొస్తూ శారద అనటం సారథి విన్నాడు. ఇవతలికి వస్తున్న ఆమెకు సారథి కనిపించాడు.

"ఇక్కడున్నారా?" అందామె.

"అవును ఏమీ తోచక యిక్కడ కూర్చున్నాను" అన్నాడు సారథి కుర్చీ లోంచిలేచి వెనుకకు జరిగి నిలబడుతూ. శారదతో మాటాడాకూడదన్న నిర్ణయాన్ని మరిచిపోతూ.

శారద నెమ్మదిగా స్తంబందగ్గరకొచ్చి నిలబడింది.



"రేపు వెళ్ళిపోవటమేనా?" అడిగింది శారద.

"అవును వేణూకూడ వెళ్ళమని చెప్పాడు."

శారద కొద్దిసేపు మాటాడలేదు. ఆమె కళ్ళుమాత్రం చీకటిలో మెరుస్తున్నాయి.

"ఇక్కడ ఉండిపోకూడదూ?"

"ఎందుకు ఇక్కడ?"

"ఉండిపోండి"

"చదువుపోదూ?"

అవును, మరి." అని కొద్దిసేపాగి.

"మరి.... మరి.... రారా?" తడబడింది శారద.

"రాగలనో లేదో. అవసరం ఉంటుందో ఉండదో ఎలా తెలుస్తుంది."

శారద ఒక ప్రక్కగా తలవంచుకుంది.

"రావలసిన అవసరమేముంది?"

"అవును. మరి.... మరి.... అవసరమేముంది?– చీకటిలో మెరిసే, కళ్ళు వాలిపోయాయి కనుకొలుకుల్లో నిలిచిన కన్నీటిని గుర్తుపట్టాడు సారది

"శారదా!" అన్నాడు సారథి కంగారు పడుతూ. "రాకండి మరి" అంటూ వెళ్ళబోయింది శారద. "శారదా" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని ఆపాడు. శారద చెయ్యి వదిలించుకునే ప్రయత్నమేదీ చెయ్యలేదు. ఆమె అతనికి మరీ సమీపంలో ఉంది. అతనికి ఆమె కళ్ళు ఆ కళ్ళలో ప్రార్థనతప్ప మరేమీ కనిపించటంలేదు. తనకత్యంత సమీపంలో నిల్చున్న శారద తనకు పరాయిదిలా కనుపించలేదు.

"శారదా! వస్తాను. తప్పకవస్తాను. వేణు పిలవాలేగాని గామా" అన్నాడు.

'నమ్మకమేనా?'— అన్నట్టు చూసింది శారద.

"తప్పక వస్తాను శారదా! తప్పక వస్తాను" ఆమె చేతిని రెండుచేతులతో పట్టుకుని. శారద చేతిని విడిపించుకుని కన్నీళ్ళు తుడుచుకుంది.

"శారదా! వేణు నా స్నేహితుడు. వాడు కష్టపడటం నే చూడలేను. వాడి సుఖం నాకెప్పుడూ కావాలి. వేణుని కనిపెట్టుకుని ఉంటావు కదూ?" అడిగాడు.

శారద మౌనంగా తలూపింది.

"ఉదయమే— అంటే తెల్లవారక ముందే— అయిదు గంటలకే వెళ్ళిపోతాను. రాత్రవుతోంది. నీవిక వెళ్ళిరా!" అన్నాడు.

శారద మెరిసేకళ్ళతో వెళ్ళిపోయింది.

"శారదా! నీవు నాకు కావాలి. కాని వేణుని మోసం చెయ్యనా? నేనేం చేసేది?" అంటూ కుమిలిపోయాడు. "శారదా! నిన్ను నేను చూడకపోయినా బాగుండేది? నేనెందుకు వచ్చానిక్కడికి?" అంటూ బాధపడ్డాడు.

ఆ రాత్రి కలత నిద్రేఅయింది.

తెల్లవారువేళకు ముందుగా రంగన్న వచ్చి లేపాడు. వేడినీళ్ళు స్నానానికి తెచ్చాడు. వేడి కాఫీ తెచ్చి బండిసిద్ధంగా ఉందన్నాడు.

"ఈ చీకటివేళ ఇన్ని ఏర్పాట్లు ఎవరు చేశారు రంగన్నా!" అడిగాడు కాఫీ త్రాగుతూ.

"ఇంకెవరు చేస్తారుబాబూ! శారదమ్మ కాక?" అన్నాడు రంగన్న.

అప్రయత్నంగా తలఎత్తి ఎదురుగా కనిపించే పెరటి వసారావైపు చూశాడు. శారద కనిపించలేదు. కాని పెరటి వసారాలో దీపం వెలుగు కనిపించింది.

"బండి సిద్ధంగా ఉంది బాబూ!" హెచ్చరించాడు.

అయిష్టంగా బండి ఎక్కాడు సారథి. బండి ముందుకు పోతోంది. కాని ముందుకుపోతున్న బండినెవరో వెనుకకు లాగినట్టయింది. వెనుతిరిగాడు.

గేటు దగ్గర నిలబడి తలుపుమీద ఉంచిన చేతులమీద బుగ్గనాన్చి కదులుతున్న బండీవైపే చూస్తున్న శారదను గుర్తుపట్టాడు సారథి. బండి మలుపు తిరిగేంతవరకు ఆ కళ్ళు అలాగే తదే

కంగా చూశాయి. ఆకళ్ళనే చూస్తూ ఉండి మలుపు తిరిగుతూంటే అను కున్నాడు" వేణూ! శారద నా మనసులో నుండి తొలగిపోలేదు. నన్ను నిందించకు" అని.

నేను కథచెప్పటం ఆపి "ఈ కథను యిక్కడితో ఆపివేస్తున్నాను. ముగింపు మీకే వదిలిపెడుతున్నాను. ఎవరికి ఎలా ఇష్టమయితే కథనలా ముగించుకోవచ్చు. ముగింపు చెప్పే విషయంలో నేనింత వరకూ చెప్పినకథ నెంతమాత్రం మార్చ కూడదు. ఈ కథకు ఎన్నిరకాలయిన ముగింపులయినా ఉండవచ్చు కాని అసలయిన ముగింపు ఒక్కటే. మీరు ఎందరి జీవితాలో చూశారు. ఎందరి కథలో విన్నారు. అదృష్టితోనే కథను ముగించండి. నేను వింటాను" అని అన్నాను.

"రచయిత తానంతట తాను ముగింపు చెప్పినప్పుడే పాఠకులకు తృప్తి అలా కాకపోయినప్పుడు అది ఎంత చక్కటి ముగింపు అయినా పాఠకునికి తృప్తి ఉండదు." అన్నాడు శాస్త్రి.

"శంఖంలో పోస్తేనేగాని తీర్థంకాదు" అంది నిర్మల.

"నేను చెప్ప గలిగిన ముగింపును చెప్తాను. కాని మీరు చెప్పే ముగింపుల కూడ వినాలని ఉంది. ఇప్పుడు మీరే ప్రశ్నలు వేసినా వెయ్యవచ్చు." అన్నాను.

"శారద వేణుకి ఏమవుతుంది?" హేమలత అడిగింది.

"కథనుబట్టి గ్రహించండి" అన్నాను. "కథలో సరియైన ఆధారమేదీ లేదు. అందుచేత, ముగింపు చెప్పటం కష్టం" అంది హేమలత.

"ముగింపు ఆ రహస్యాన్ని భేదించే దిగా ఉండాలి" అన్నాను.

"సారధి మళ్ళీ ఆ ఊరు వెళ్ళాడా?" అడిగాడు హనుమంతరావు.

"అది మీ యిష్టం. మీరు సారధిని ఆ ఊరు తీసికెళ్ళవచ్చు మానవచ్చు. కాని నేను మాత్రం సారధికి ఆ ఊరు వెళ్ళా లని ఎంతగా మనసు ఉన్నా వెళ్ళలేక పోయాననే ప్రారంభించి ముగింపువైపు వెళ్తాను" అన్నాను. "నేను ముగింపు చెప్తాను" అంది నిర్మల. "చెప్పండి" అన్నాయి అన్ని గొంతుకలు. నిర్మల ప్రారంభించింది. "శారద సారధి ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. మీరంతా ఇందుకు అంగీకరిస్తారుగా. కాని వేణు శారదను ప్రేమించాడు. వేణు స్నేహాన్ని నిలబెట్టుకోవటం కోసం, శారద వేణుల వివాహం కోసం సారధి ప్రోత్స హిస్తాడు. వాళ్ళ పెళ్ళి అవుతుంది" అంది.

"బాగానే ఉంది గాని ముగింపులో కొత్తదనం లేదు" అన్నారు మూర్తి గారు.

"శారదను పెళ్ళి చేసుకుంటానన్నాడు

వేణు. కాని శారద అతన్ని నిరాకరించింది. సారధిని పెళ్ళి చేసుకుంటానని మనసు విప్పి చెప్తుంది. సారధిని ఒప్పించి వారి వివాహం జరిపిస్తాడు వేణు" ముగించింది హేమలత.

"ఇదీ బాగానే ఉందిగాని అనుకున్నంత పటుత్వం ముగింపులో రాలేదు" మూర్తిగారన్నారు.

"ఈ రెండూ కాకపోతే మూడో ముగింపు ఉంటదే. శారద వేణునో, సారధినో పెళ్ళి చేసికోవాలి" అంది క్రిష్టియన్ అమ్మాయి.

"సారధి మనసు తెలిసి వేణు, వేణు మనసు తెలిసి సారధి ఒకరి కోసం మరి ఒకరు త్యాగం చేయటానికి సిద్ధపడవచ్చుగా" శాస్త్రి అన్నాడు.

"[illegible] ఇదిగాదు హాను మ[illegible]."

"ముగ్గురికీ పెళ్ళికాక అలా ఉండిపోతారు" అన్నాడు శాస్త్రి.

"ముగింపులో గానే ఉంది. కాని శారద అవివాహితగా ఉండిపోవచ్చు. సారధి వేణులు అవివాహితులుగా ఉండిపోతారన్నది నేనంగీకరించను, స్త్రీ ప్రేమలో ఉన్న స్థిరత్వం పురుషుని ప్రేమలో ఉండదు." అన్నారు మూర్తి గారు.

"ఈ కధకు ముగింపేమిటి?" అన్నాడు శాస్త్రి.

"మాష్టారే చెప్పాలి" అంది నిర్మల. అందరూ నావైపు చూశారు

"కధ సారధి పరంగా సాగింది. తనువ మిగిలిన ఇరువురి మనోభావాలు పరిగణన లోనికి రాలేదు. సారధిని దృష్టిలో పెట్టుకునే కధను చెప్తాను. మీకు యిష్టమయితే వినండి" అన్నాను.

"చెప్పండి" అన్నారంతా.

నే ప్రారంభించాను.

"శారదతో సారధి పరిచయం చాల స్వల్ప కాలమే అయినా, శారద అతని మనసులో గాఢంగా నిలచిపోయింది. ఆమె కూడ అతనిని ప్రేమించిందని అతని నమ్మకం. కాని వేణు అతని మనసులోకి రాగానే మనసు మనకబారుతుంది. ఎన్నో పర్యాయాలు వేణుకి తన మనసును తెలియజేయాలనుకుంటాడు. సాధ్యపడదు. వాచు విడి [illegible] ఉత్తరం ద్వారా తన మనసు తెలియజేయాలనుకుంటాడు. కాని రెండు రోజులు ఆతిధ్యమిచ్చిన కారణానికి తిన్నయింటి వాసాలు లెక్కపెట్టానని వేణు నిందించి స్నేహాన్ని తెంపివేస్తాడేమో అని భయపడతాడు. తను ఆమె కంట పడకుండ ఉంటే తన్నామె మరచిపోగలదని నిర్ణయం చేసుకుని ఆ ఊరు వెళ్ళే ప్రయత్నాన్నే విరమిస్తాడు...."

"అయితే ఇంతకి శారద సారధిల పెళ్ళి జరగదంటారు. అంతేకదూ? నేనే ఈ కధా రచయితనైతే ఎవ్వరు అడ్డంవచ్చినా ఎదిరించి శారదను సారధిని

పెళ్ళి చేసుకున్నాడనే ముగిస్తాను మీలాగ సారధిని పిరికివాడిని చెయ్యను" అన్నాడు హనుమంతరావు ఆవేశంతో.

"మనిషి పిరికివాడవటానికైనా, ధైర్యవంతుడవటానికైనా పరిస్థితులు కారణమవుతాయి కదా. సారధి స్నేహానికి ఇచ్చిన విలువకు ప్రేమకివ్వలేదని శారదను స్నేహితురాలిగానే పరిగణించాడని మీరెందుకనుకోకూడదు?" అంది నిర్మల.

"మీరు పురుషుల పక్షం మాట్లాడటం నాకు వింతగా ఉంది" అన్నాను.

"ఇందులో న్యాయం తప్ప పక్షపాతమేమీ లేదు" అన్నామె

"మీలాగ స్త్రీ లందరూ భావిస్తారని నేననుకోను శారద కూడ సారధిని పిరికివాడనే [illegible] కాని మీలాగ సమర్థించదు" అన్నాను

"శారద - సారధి" వీరి పరిచయం ప్రేమ ప్రారంభాన్ని దానితో గలిగిందే గాని పైకి వెదజల్ల లేకపోయింది. పైకి చెప్పుకునే స్థితికి రాలేదు. నిజానికి వాళ్ళు మనసులు విప్పి మాటాడుకోనే లేదు. కాని వారి మనసులలో చెలరేగే సంచలనాన్ని వారు కనిపెట్టారు. ఈ పరిచయం వల్ల దుఃఖం తప్ప మరేదీ లభించదని సారధి కనిపెట్టాడు. అందుకనే ఆమె నుండి దూరంగా పో ప్రయత్నించాడు. అది పిరికితనమెలా అవుతుంది?" అన్నారు మూర్తిగారు.

"పలాయన మంత్రం పఠించాడంటే ధైర్యవంతుడనా?" హనుమంతరావన్నాడు.

"అది పలాయన మెలా అవుతుంది? శారదను పెళ్ళిచేసుకుంటాననే మాట వరుసకైనా అన్నాడా సారధి?" అడిగారు మూర్తిగారు.

"చెయ్యి పట్టుకోలేదా?" ఊరుకోలేదు హనుమంతరావు

"బాధతో వెళ్ళిపోయే ఆమెను సమాధాన పరచాలనే దృష్టితోనే ఆమె చెయ్యి పట్టుకుని ఆపాడు ఆమెను అతను యిష్టపడుతున్నప్పటికీ వేణుని మరచిపోలేదు. చివరిసారిగా ఆమె వెళ్ళిపోయే ముందు శారదతో ఏమన్నాడు? [illegible] వాడి సుఖం నాకెప్పుడూ కావాలి. వాడిని కనిపెట్టుకుని ఉంటావు కదూ." అనలేదూ? ఆ విధంగా తన్ను అర్థం చేసికొమ్మని చెప్పటం కాదూ? కాని శారద తన్నెంత యిష్టపడుతున్నదో తనకు తెలుసు. తానామెను ఎంతగా యిష్టపడుతున్నాడో తనకు తెలుసు. శారదను తను ఆశించకూడదని తెలుసు మరచిపోవాలని తెలుసు. మరచిపోలేడని తెలుసు. సారధిలో ఎంత సంఘర్షణ ఉందో మీకు తెలుసా?" అడిగాడు ఆవేశంతో మూర్తిగారు అందరూ చప్పట్లుకొట్టారు 'ఆ అమ్మాయి' తప్ప.

"మీకు నా అర్గ్యుమెంటు నచ్చలేదా?" మూర్తిగా రడిగారామెని.

"వీళ్ళందరూ మీ అర్గ్యుమెంటును మెచ్చి చప్పట్లు కొట్టలేదు. మీలో ఆవేశానికి, హొయిత్రీకి మెచ్చి చప్పట్లు కొట్టారు, నిజానికి అతని పాత్రను అంతగా 'పోష్టుమార్టమ్' చేసే అవసరం నాకు కనిపించటం లేదు. సారథిగార్ని బోనులో పెట్టి ముద్దాయిలా క్రాస్‌చేసే అవసరమూ కనిపించటం లేదు కొందరు ప్రేమను పైకి చెప్పుకోగలరు. మరి కొందరు చెప్పుకోలేరు కొందరు సాధించగలరు. మరి కొందరు సాధించ లేరు వారు సాధించలేక మనసు చంపుకోలేక బాధపడతారు. అలాంటి వారిపై సానుభూతి చూపాలి గాని హేళన తగదు" అందామె అర్ధమైన కళ్ళతో.

నేను కృతజ్ఞతతో ఆమెను చూశాను.

"సారథిని ఎంత ఉదాత్తముగా చూశారు?" అన్నాడు శాస్త్రి. హనుమంత రావు ఆమె నేదో అడగాలనుకొంటు న్నాడు. కాని ఆమె చెప్పినది పూర్తికానిదే మాటాడకూడదని కాబోలు ఊరకున్నాడు

"శారద వేణుల దృష్టిలో పెటుకుని ముగింపు చెప్పగలరా?" అడిగాను నెమ్మదిగా ఆమె కొద్దిసేపు ఊరుకుని "మీరు కథలో శారద వేణుల సంబంధ బాంధవ్యాలను స్పష్టంగా చెప్పలేదు. కాబట్టి దానినే ముగింపులో ఉపయోగించు కుంటాను పర్మిషన్ యివ్వండి" అంగామె. "అలాగే. చెప్పండి" అన్నాను

"ముగింపుకోసం శారద వేణుల సంబంధాన్ని స్పష్టపరుస్తాను. శారద వేణు పినతల్లి కూతురు" అగిందామె. అందరం ఆశ్చర్యంతో చూచాం ఆమె వైపు.

"శారద తండ్రిపోయి. ఆమె తల్లి, తను పెదతండ్రి పోషణలోకి వచ్చిన తరువాత శారద, ఆమెతల్లి ఆ ఇంటిలో బానిసలుగా బ్రతకవలసి వచ్చింది వేణు తండ్రి వారిని మామూలు మనుషులుగా చూదామని ప్రయత్నించినప్పుడు వేణు తల్లి, శారద తల్లితో అతని అక్రమ సంబంధాన్ని కట్టి దూరం చెయ్యాలని చూచింది దారి తెన్నులేని ఆమె తల్లి ఆ ఇంటిలో బానిసగా బ్రతకటానికైనా సిద్ధ పడింది. శారదను తనచెల్లెలుగా చెప్పుకో టానికి వేణు సిగ్గుపడలేదు. కాని ఆమె బ్రతుకుతు బాట చూపేంతవరకు తన్ను 'అన్నయ్యా', అని పిలవ వద్దన్నాడు. అతనిమీది ఆశతోనే ఆ యిద్దరూ ఆ ఇంటిలో బానిసలుగా బ్రతకటానికైనా సిద్ధపడ్డారు. శారదను ఆ నరకం నుండి తప్పించ ప్రయత్నించాడు. సఫలీకృతు డయ్యాడు [illegible] ఆమె అగి" మాష్టారూ మీ కథలో శారద వేణుని 'అన్నయ్యా!' అనిగాని 'బావ' అని గాని

ఎక్కడా సంభోదించలేదు. అందుచేత ఈ స్వేచ్ఛను తీసికున్నాను క్షమించండి" అంది

"మీరు మంచి చమత్కారులే" అంది నిర్మల.

"మిగత కథను కూడా మీరే ముగించండి" అంది హేమంత.

"మాష్టారూ ఈమె మిమ్మల్ని బాగా బోల్తా కొట్టించారండి" అన్నాడు శాస్త్రి.

"యువార్ కరెక్టు. మిష్టర్ శాస్త్రీ! యువార్ కరక్టు" అన్నాను.

"మిగత కథ కూడా అల్లండి" అన్నారు మూర్తిగారు

"ఇక కథేముంది? వేణు బి.ఎస్.సి. పూర్తిచేసుకు, ఎమ్ ఎస్ సి లో డిగ్రీ పొంది లెక్చరర్ ఉద్యోగం సంపాదించుకున్నాడు శారదను, తనతో తీసి కెళ్ళిపోయాడు ఈ కథనే నవలగా వ్రాయాలనుకుంటే, ఆ ఇంటినుండి వారిని తీసికెళ్ళటానికి అతనొక నాటకం ఆడినట్టు వ్రాసుకోవచ్చు. శారద చదువులో చేరింది ఆమె చదువుకుంటున్నప్పుడే ఆమెకు పెళ్ళయ్యిండి. సారథితో మాత్రం కాదు. ఇదే నాకు తోచిన ముగింపు. మీరెలా స్వీకరించినా సరే" అందామె.

"శారద సారథిని మరచిపోయిందా?" అడిగాడు శాస్త్రి.

"మీరెలా అనుకున్నా సరే!" అందామె.

"అలా కాదు. మీరు శారద పాత్రను బాగ అర్థంచేసుకున్నారు గనుక చెప్పండి" అన్నాడు శాస్త్రి

ఆమె కొద్ది సేపేదో ఆలోచించింది. నెమ్మదిగా తలవంచుకుని చెప్పసాగింది. 'సారథిగారు ఆ ఊరు వదలి వెళ్లిపోయిన దగ్గరనుండి శారద అతనిని తలుస్తూనే ఉంది. అతను వస్తాడని ప్రతిరోజూ ఎదురుచూస్తూనే ఉండేది ప్రతిరోజూ సాయంత్రం చీకటి పడేవరకు బోట్ హౌస్ దగ్గర అతని మాటలను తలచుకొంటూ కూర్చోని వచ్చేసేది. వెన్నెల రాత్రులలో బోట్‌హౌస్‌నే చూస్తూ కాలం గడిపేది. సారథిగారిమీద తనకున్న ఆశలను వేణుకి తెలియజేయాలని, ఎన్నో సార్లు అనుకునేది. అప్పటికి వేణు సమస్య ఆమెను వివాహం కాదు. ఆ ఇంటినుండి విముక్తి. అస్వతంత్రురాలయిన వేణు పాత్ర తన పెళ్ళి గురించి ఏమని అడుగుతుంది? వేణు ఉద్యోగస్థుడయ్యాడు. శారదకు ఆ ఇంటినుండి విముక్తి లభించింది. కాలేజీలో చదువుకునేందుకు చేరింది. అప్పటికి సారథిగార్ని శారద చూడక నాలుగు సంవత్సరాలయింది. శారదకు పెళ్ళి చేస్తానన్నాడు వేణు శారద తన మనసుని వేణుకి తెలియజేసింది. వేణు ముందు ఆశ్చర్యపోయాడు తరువాత అన్నాడు 'సారథికి ఏ మాత్రం నీమీద మనసున్న మాట మాత్రం అయినా నాతో చెప్పడా? నీవు

పొరపాటు పడిఉంటావు. సారథికి నీ మీద మనసుంటే వస్తానన్న వాడు రాడా? సారథి నిన్ను యిష్టపడ్డాడే అనుకో, అయినా అతను తిరిగి రాలేదంటే వీలు గాని పరిస్థితులేవో ఉండి ఉండాలి కదా! అయినా సారథి ఇంతకాలం అవివాహితుడుగా ఉంటాడా? లేనిపోని భ్రమలకు పోకు'' అన్నాడు. శారదా బాగా ఆలోచించింది. అప్పటికే ఆమె తల్లి మరణించింది. వేణు మాటలు వినటమే శ్రేయమనిపించిందామెకు. శారద పెళ్ళి చేసుకుంది.'' అని చెప్పటం ఆపి ఆమె నావైపు చూసి "మీరు కథలో చెప్పిన విషయాలనే వాడుకున్నాను క్రొత్త విషయా లేవీ చేర్చలేదు. మీరు బోట్ హౌసును ఉపయోగించుకున్నారు నేను బోట్ హౌసు ప్రయోజనాన్ని చెప్పాను'' అంటూ ముగించిందామె.

''చాలా బాగా ముగించారు కథని. మాష్టారు అందమైన పూలను చిందర వందరగా వదేస్తే మీరు అందంగా సూత్రాని కెక్కించి దండగాచేసి మొదలు చివర కలిపి ముడివేశారు" అంది నిర్మల.

"కథ వ్రాయటమంటే పాత్రలో లీనం కావాలి రచయిత. మీరు శారద పాత్రలో బాగా లీనమయ్యారు. శారద మనసులో ఉన్న భావాలను చాలా సున్నితంగా చెప్పారు. ఆమె ప్రతిరోజూ కొన్ని క్షణాలనైనా 'బోట్ హౌసు' దగ్గర గడప వచ్చేది అన్న మాటలు వింటూంటే మనసు ఏమిటో అయింది మనసులో ఉన్న ఫీలింగ్స్‌నుచెప్పుకోలేక, దాచుకోలేకదూరమైన 'శారద సారథి'లను చూస్తూందే జాలి వేస్తోంది. బాధ కలుగుతోంది. శారద సారథి దూరమైనట్టు చెప్పిన ముగింపే రమ్యంగా ఉంది" అన్నారు మూర్తిగారు.

"పాపం హనుమంతరావుగారు ఆవేశపడ్డారు" అంది హేమలత వెక్కిరింపుగా.

"ఇది కథ. నిజ జీవితంలో ఇలా జరగటం మాత్రం ఎవరూ హర్షించరు. శారద ఆరాధనా అంతా ఏం కావాలి?'' ఆవేశంతోనే అన్నాడు హనుమంతరావు.

"మీకే ముగింపు నచ్చకపోతే ఇద్దర్నీ కలపండి. ఇలాంటి ప్రేమికుల వెతికి ముడి వెయ్యండి. 'ఇది ఇలా జరిగింది కాబట్టి అది అలా జరగాలి' అనే సూత్రం కథలలో వర్తిస్తుంది. 'ఇది ఇలా జరిగింది కాబట్టి అదలా జరగాలి. కాని ఇది ఎందుకు అలా జరిగింది?' అనే ప్రశ్న వేసేది జీవితం. జీవితం ఒక సమాధానం లేని ప్రశ్న. 'ఇది ఎందుకిలా జరిగింది?' అని మీరెంత తల బాదుకున్నా జవాబు దొరకదు. కథలను నూటికి నూరు కథలను సుఖాంతం చెయ్యవచ్చు. కాని జీవితాల విషయంలో ఖచ్చితమైన శాతమేదీ లేదు" అన్నారు మూర్తిగారు

"మీరన్నది ఒప్పుకున్నాను. జీవితాలు చాలా సుఖాంతాలు కావు. కనీసం కథల

కైనా ఎందుకు సుఖాంతం చెయ్యరు?" అన్నాడు హనుమంతరావు.

"కథలకు జీవితాలకు ఉన్న దూరాన్ని దగ్గర చేయటానికే" మూర్తి గారాన్నారు.

"ఇక లేద్దామా?" అన్నాను నేను. అందరూ మౌనంగా లేచారు. "త్వరగా అడుగులు వేస్తే మేం బస్సు కందుతాం. మా ఫ్రెండును రాత్రికైనా స్టేషనుకి పంపాలి" అంది నిర్మల.

"మమ్మల్నే త్వరగా నడవమని మీరు హెచ్చరిస్తున్నారా?" అన్నాడు శాస్త్రి. అందరం నవ్వేశాం. నేను మాత్రం కథ ముగింపునే ఆలోచిస్తున్నాను. నాలు గడుగుల్లో ఆర్. కె. కేంటీన్‌ను చేరుకున్నాం. 'అయిస్‌క్రీమ్' అన్నాడు శాస్త్రి. అందరం లోపలికి నడిచాం. కేంటీను రద్దీగా ఉంది. ఆడవాళ్ళు నలుగురు ఒక వైపు కూర్చున్నారు, మేము మరో వైపు కూర్చున్నాం. హేమలత, నిర్మల త్వరగా అయిస్‌క్రీమ్ తీసుకుని మమ్మల్ని తొందర చేయసాగారు. 'లాసన్సుంటే లోని పెర్చి లైటునే చూస్తున్నాను. "మాస్టారూ!" ఎవరో పిలిచారు. ప్రక్కకు తిరిగాను ఆమె.

"మీరు కూర్చున్న చోట ఈ కాగితం దొరికింది. మీదేనేమో చూచుకోండి. బస్సు వస్తోంది. నమస్తే!" అంటూ కాగితాన్ని నా కందించి ముందుకు నడిచింది. నేను అప్రయత్నంగా కాగితా నందుకుని నమస్కరించాను. బస్సు వస్తోందని హేమలత హెచ్చరించింది. హనుమంతరావు బిల్లు పేచేసాడు. శాస్త్రి, మూర్తిగారు ముందు కదులుతూంటే నేను ప్రక్కకు వెళ్ళి దీపం వెలుగులో కాగితం మడతను విప్పాను. చదివాను. అక్షరాలు చాలా హడావుడిగా వ్రాయబడినట్టున్నాయి.

అందులో ఇలా వుంది:

"మీరు హోటల్ హౌసులో మరచిపోయిన సల్లించు తెల్ల రుమాలు నా దగ్గరే ఉంది. తిరిగి యివ్వమని అడగకండి. దానిని నా దగ్గరే ఉండనివ్వండి. గతానికి కట్టిన బూజును దులుపుకోటానికి అది పనికి వస్తుంది కదా!"

అంతే. సంతకం లేదు

కాగితాన్ని జేబులో పెట్టుకుంటూ కేంటీను దాటి పరుగున వచ్చాను.

సిటీ బస్సు మలుపు తిరుగుతూ కనిపించింది.

జీవితంలో అన్నీ అనుకొన్న సంఘటనలే జరగవు. అనుకోనివీ జరగవు. కొన్ని అవీ, ఇవీ కలిసి మిశ్రమంగా జరుగుతూంటాయి. ఈ ఊరికి అనుకోకుండా నాకు ఎలా బదిలీ అయిందో రావు వాళ్ళ కుటుంబంతో పరిచయం కూడా అలాగే జరిగింది. రావు కుటుంబంలో ఉంది నలుగురు. రావు, రావు శ్రీమతి ఇద్దరూ ఒకరికోసం ఒకరా అన్నట్లుంటారు. వాళ్ళిద్దరి పిల్లలూ బంగారు బొమ్మలు. వాళ్ళబ్బాయి కాన్వెంటు దుస్తుల్లో చాలా హుందాగా కనిపిస్తాడు. వాళ్ళమ్మాయిని ఎన్నిసార్లు ముద్దు పెట్టుకున్నా మరోసారి అనిపిస్తూంటుంది. వాళ్ళ ఇంట్లో నవ్వులూ, కేరింతలూనూ. ఏ కొరతా లేకుండా చాలా హాయిగా వాళ్ళ సంసారం గడిచిపోతోంది.

రావు ఒక ప్రైవేటు కంపెనీలో మేనేజరు. శ్రీమతి రావు కూడా ఉద్యోగం చేస్తోంది. పిల్లలిరువురినీ కాన్వెంటుకు పంపి స్కూటరుమీద భార్యా భర్తలిద్దరూ ఆఫీసులకు బయలుదేరుతారు. శ్రీమతి రావును ఆమె ఆఫీసు వద్ద దించి తను కంపెనీకి వెళ్తాడు. సాయంకాలం శ్రీమతిని తీసుకొని ఇంటికి వస్తాడు. ఈ లోపల వంటమనిషి కాస్త టిఫిన్ కాఫీ చేసి ఉంచుతుంది. కాన్వెంటునుంచి వచ్చిన పిల్లలిరువురూ టిఫెన్ హార్లిక్స్‌లకు సిద్ధంగా ఉంటారు. ప్రతి ఆదివారం వాళ్ళ కాలకృత్యాల్లో కొంచెం మార్పు ఉంటుంది. అది సాయంకాలం ఏ సినిమాకో ఏ పార్క్‌కో, ఏ ఎగ్జిబిషన్‌కో వెళ్ళంతో ఆదివారానికి హారతి పాడేస్తారు.

వాళ్ళది ప్రేమ వివాహం. అటూ ఇటూ పెద్దలకు ఏ మాత్రం ఇష్టం లేకుండా జరిగిపోయిందట వీరి వివాహం. దాంతో అటూ ఇటూ దూరమయ్యారు. ఆ దూరం ఏ మాత్రం దగ్గరవనే లేదు.

అందరి జీవితాలూ సాఫీగా సాగవు చివరిదాకా. మధ్య జరిగే ప్రమాదాలు గుండెల్ని పిండేస్తాయి. తమ ప్రయాణం కడదాకా సాగుతుందనుకొంటారు ప్రతి వాళ్ళు. అయితే మధ్యలోనే తమ ప్రయాణానికి బ్రేకులు పడటం ఎవరూ ఊహించలేరు. రావు, శ్రీమతి రావుల సంసార శకటం ఒక మలుపులో తలక్రిందులైంది. ముప్పయి ఏళ్ళ రావుకు నూరేళ్ళు నిండాయి. ఉక్కు మనిషిలా ఉండే రావును మృత్యువు చిన్న మాత్రలాగా చప్పరించేసింది.

శ్రీమతి రావును ఇప్పుడు పలకరించాలంటే నాకు చాలా భయంగా ఉంది. ఈ ఊరు వచ్చాక వారి కుటుంబంతో పరిచయం అయ్యాక వాళ్ళ ఇంటికి వెళ్ళని, ఆమెతో మాట్లాడని రోజులు ఇప్పుడే. ఆమె సంసార రథచోదకుని పోగొట్టుకుంది. అయితే చోదకుడు పోయినంత మాత్రాన సంసార రథం

అక్కడే ఆగిపోదు కదా! ఆ స్థానం ఆమెకు తప్పలేదు. ఇప్పుడు వాళ్ళ సంసారం వెలితిగా వెలా తెలాబోతూ నడుస్తోంది. ఆ మె కు న్న ఆ సరాఆ ఉద్యోగ మే.

శ్రీమతి రావు రావు బలవంతంమీదే ఉద్యోగంలో చేరింది. ఆమెకు మొదట్లో ఉద్యోగం చేయాలని ఉండేది కాదుట. ఈ విషయాలన్నీ రావు నాకు పూస గుచ్చినట్లు చెప్పేవాడు. ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలబడటం ఎందుకైనా మంచిది అనేవాడు. శ్రీమతి రావుచేత ఉద్యోగం చేయించటం అతని సిక్స్తుసెన్స్ పని చేయటం వల్ల కావచ్చు. కంపెనీ వాళ్ళిచ్చిన డబ్బు బ్యాంకులో డిపాజిట్ చేసింది ఆమె. ఆఫీసుకు రిక్షామీద వెళ్ళివస్తోంది.

నాగది కిటికీలోంచి చూస్తే స్కూటరు మీద ఇద్దరూ కలసి వెళ్ళే దృశ్యానికి బదులు దిగులుగా రిక్షాలో కూర్చొని వెళ్ళే శ్రీమతి రావు క ని పి స్తు న్న దిప్పుడు.

పిల్లలిద్దరూ వాడిపోయిన ముఖాలతో ఉంటున్నారు. ఏదో బతికి ఉన్నాం కాబట్టి తప్పదన్నట్లు వాళ్ళు ముగ్గురూ కాలం గడుపుతున్నారు.

కాలము అన్ని బాధలకూ ప్రకృతి చికిత్సచేసే వైద్యుని వంటిది. అది జరుగుతున్న కొద్దీ గాయాలు మానటం చాలా సహజం.

రెండు మూడు నెలలు గడిచేసరికి కాస్త సర్దుకున్నట్లు కనిపించారు వాళ్ళు. మామూలుగా వాళ్ళ పనులు జరుగుతున్నాయి. ఎంత జరిగినా రావు లేని లోటు లోటే. ఇప్పుడు వాళ్ళింటికి వెళ్ళి వస్తునా ఇంతకు ముందు నేను మాట్లాడిన తీరులో ఎందుకో మాట్లాడలేకపోతున్నా. ఆమె భరిస్తున్న లోటు భారతదేశం భరిస్తున్న లోటు బడ్జెటును జ్ఞప్తికి తెస్తోంది. ఈ రెండూ 'సర్ ప్లస్' కాలేవు. నాటకంలోని వేషధారి చెప్పే నాలుగు డైలాగుల్లా ఉంటున్నాయి నా మాటలు నాకే. అందులో కాస్త అప్పుడప్పుడూ కలిపేవి ఓదార్పు మాటలు.

ఇంట్లో గలగలతో సంచరించే రావు మూగవోయి గోడకు ప్రేములో బిగించబడటం, పూలదండ ఒకటి ఆ ఫోటోకు వ్రేలాడటం చూచినప్పుడల్లా నా కళ్ళలో నీళ్ళు తిరుగుతూండేవి. అందుకని వాళ్ళింట్లోని ఆ ఫోటోను చూడటం నుంచి నేను త ప్పిం చు కో వ టా ని కి ప్రయత్నిస్తూండేవాడిని.

రావుతో షటిల్ ఆడకుండా గడవని సాయంత్రాలు ఇప్పుడు ఆ మాట ఎత్తకుండానే గడిచిపోతున్నాయి. రావు మంచి ఆటగాడు. అతనికి బద్ధకం లేదు. నాకు కొంచెం బద్ధకమే. అతనే రోజూ నెట్ కట్టి నన్ను పిలుస్తూండేవాడు ఆటకు. ఆడకపోలే ఊరుకునేవాడు కాదు.

"రావ్! ఇవాళ నీవ్వు షటిల్ ఆడకు. వచ్చే ఆదివారం వరకూ రోజూ

అడకు కాలం గడిచిపోతుంది అయితే ప్రతి ఆదివారం అదు చాలు వారం అంతా స్ధంభించిపోతుంది" అని జోక్ చేస్తూండె వాడిని

"ఎందుకు.... హాయిగా నిద్ర పోవ టానికా... " అంటూండేవాడు. నా నిద్ర మీద జోక్స్ వేయటం అతనికి బలే సరదా.

రావు పేరు ఎత్తితే ఎవ్వేవ్వో జ్ఞాపకాలు తరుముకొస్తూంటాయి. అతనికి మంచి కళా హృదయం ఉంది. వాళ్ళింట్లో అతను సేకరించి ఉంచిన బొమ్మలు అతని కళా జిజ్ఞాసను వ్యక్తం చేస్తూంటాయి. రోడ్ల మీద మంచి మంచి బొమ్మలు వేసి డబ్బులు అడుక్కునే వాళ్ళకు అతను చేతికి వచ్చినంత చిల్లర తీసి యిచ్చేవాడు.

రావున్నప్పటి ప్రపంచంలో సంచరించిన నేను రావులేని ప్రపంచంలో సంచరిస్తున్నాను ఇప్పుడు. ఇది నాకే తీరని లోటనిపిస్తూంటే, మరి శ్రీమతి రావు సంగతి వేరే చెప్పనక్కర్లేదు.

ఒకరోజు వాళ్ళింట్లో కూర్చున్నప్పుడు టేబులుమీద ఏదో మందుబిళ్ళ కనిపించింది తీసి చూచాను. "కాంబోసు" ఇది నిద్ర మాత్ర. ఇది ఇక్కడ ఎందుకుందో !

"మీరు నిద్రమాత్రలు వాడుతారా,"

"అబ్బే.... లేదండీ.... ఎప్పుడూ కాదు. అప్పుడప్పుడు...."

"అంటే "

"నిద్ర పట్టనప్పుడు "

'క్షమించండి మీరు అన్యధా తలంచనంటే నేనొక మాట చెప్తాను ఈ మాత్రలు మింగకండి.... మీ ఆరోగ్యం కోసం..."

"మింగాలని నాకు మాత్రం కోరికా తప్పటం లేదు...."

ఇంత చిన్న వయస్సులో ఈమెకు నిద్రపట్టక పోవటానికి కారణం !

నా ఆలోచనల్లో ఏవేవో తిరిగాయి ఆమె ఎదురోవాల్సిన, ఏదుర్కొంటున్న ముఖ్య సమస్య నాకు ఆ వీచికల్లో లీలగా గోచరించింది.

ఏ సమస్యకైనా పరిష్కార మార్గం సూచించ వచ్చేమో కానీ ఇప్పటి సమస్యకు పరిష్కార మార్గం సూచించటం కష్టమే. ఏం చెప్పాలో తోచలేదు. ఆ మాత్ర తీసుకుని వచ్చేసాను.

ఆమెకు రాత్రులు గడవటం చాలా కష్టమైపోతున్నాయి. నా గదిలోంచి చూస్తే వాళ్ళ బెడ్‌రూమ్‌లోని బెడ్ లైటుకు బదులు చాలా రాత్రులు కాంతివంతమయిన దీపమే వెలుగుతూండేది బహుశా చదువుకొంటున్నదేమో ని అనుకొంటూండేవాడిని. ఎంత చదువు కొన్నా అంత రాత్రివరకూ మేల్కొని ఉండటం ఏం ఆరోగ్యకరం....

"మీరు రాత్రిళ్ళు చాలాసేపు చదువుతున్నారా! నేనయితే ఏదో ఒకటి

వ్రాసుకొంటూనో, చదువు కొంటూనో గడుపుతుంటా ననుకోండి....”

“నిద్ర రాక పుస్తకాలతో కుస్తీపడు తూంటాను....”

“నిద్ర రాకపోవటం ఏమిటండీ.... నేను అప్పు ఇస్తాను నా నిద్ర కొంత తీసుకోండి. నాకు నిద్ర అలా పిలుస్తే యిలా వచ్చేస్తోంది.”

‘ అదృష్టవంతులు....”

“ఏం అలా అన్నారు ?

“మీకు నిద్ర పిలుస్తే వస్తుంది. నాకు తపస్సు చేసినా నిద్ర రాదు. రావటం లేదు.”

ఆమె ఇంకా బాగా కోలుకోలేదు. ఆమె పరిస్థితికి ఓదార్పు మాటలు చెప్పి విశ్రాంతిమిప్పటం నా వంతు. అది నిర్వర్తిస్తున్నాను ఏదో విధంగా.

అయిదారు నెలలు గడిచాయి. ఒక రోజు సాయంకాలం ఆమె చెప్పిన మాటకు కొంచెం ఖంగారుపడ్డాను. ఆమె తన ఉద్యోగానికి రాజీనామా ఇస్తాననటమే దానికి కారణం.

ఉద్యోగం బావుండలేదా ?”

“ఉద్యోగం బాగానే ఉంది కానీ చుట్టూ ఉన్న ఉద్యోగస్థుల తరహా బాగుండటం లేదు.”

“అంతా పాతవాళ్ళే కదా !”

“పాతవాళ్ళు మారకూడదని ఉందా!”

“మార్పు మానవ సహజం లెండి. కానీ రాజీనామా చేసి పూర్తిగా యింట్లోనే కూర్చుంటే మీరు మరీ పిచ్చివారయి పోతారు ”

“అదీ నిజమే. మరినేనేం చేయాలో తోచటం లేదు.”

“మీరు ఏమీ అనుకోకపోతే అసలు ఇబ్బంది చెప్పగలరా ?”

“మామూలు ఇబ్బందే. ఒంటరి అద దాన్ని. ఏ నీడలేనిదాన్ని. ఏ రక్షణా లేని దాన్ని; ఎవరైనా సరే భక్షించాలని చూస్తారు. ఇంతకంటే ఏం చెప్పగలను.”

“సారీ !.... చదువుకొని ఉద్యోగాలు చేసుకొంటూ నాగరిక ప్రపంచంలో చరించే అనాగరికులు వీళ్ళు....”

“ఒకళ్ళ నని ప్రయోజనం లేదు. అందుకే రాజీనామా.

“రాజీనామా చేయటంవల్ల మిమ్మల్ని పిరికివాళ్ళ క్రింద జమకడ్తారు. అది మరీ ఇబ్బంది.”

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ కూర్చుండిపోయింది.

“సారీ ! మిమ్మల్ని కూర్చోపెట్టి ఏదో ఆలోచనలో పడిపోయా.... క్షమించండి.” అది కాస్త తేరుకొని.

ఇవాళ ఆఫీసులో ఏదో జరిగి ఉంటుందనుకొన్నాను.

“ఫర్వాలేదు లెండి.”

ఇంతలో వాళ్ళ బాబూ, పాపా ప్రయివేటు ముగించుకుని “గుడ్ ఈవినింగ్ అంకుల్” అని విష్ చేస్తూ వచ్చారు.

కాసేపు వాళ్ళతో ముచ్చట్లు చెప్పి కాలక్షేపంచేసి ఇంటికి వచ్చేసాను

మరునాడు ఆమె ఆఫీసుకు వెళ్ళటం గమనించాను. ఆ మరునాడు కూడా వెళ్ళింది. ఆ రోజు సాయంకాలం వాళ్ళింటికి వెళ్ళాను.

"మీరు రాజీనామా...."

"ఇవ్వలేదు...."

"చాలా మంచి పనిచేశారు"

ఆమె ఇప్పుడు ఎక్కువగా మాట్లాడటం లేదు. ఆమెలో, ఆమె మాటల్లో ఉండే ఉత్సాహం అన్నీ మాయమయ్యాయి. చాలా నిస్తేజంగా ఉంటోంది శ్రీమతి రావు. రకరకాల కబుర్లతో గలగలమని ప్రవహించే ఆమె వాక్కు ఇప్పుడు అడిగిన వాటికి వీలయినంత చిన్న సమాధానాలు ఇవ్వటం వరకే పరిమితమైపోయింది.

"మీరు గతంలోంచి విడివడి భవిష్యత్తులోకి చూడండి. మీరు ఉత్సాహంగా ఉండి పిల్లలను ఉత్సాహపరచాలి. ఏమంటారు...."

"గతం జలపాతం హోరులా నన్ను చుట్టేస్తోంది చెవులు మూసుకొన్నా ఆ హోరే వినిపిస్తోంది. అయినా ప్రయత్నిస్తున్నా ..."

రోజూ నా గది కిటికీలోంచి చూస్తే రాత్రిపూట శ్రీమతి రావు బెడ్‌రూములో వెలిగే దీపపు కాంతి కనిపిస్తూనే ఉంది.

కొన్ని రోజులకు నేను శిక్షణ




నిమిత్తం బొంబాయి వెళ్ళాల్సి వచ్చింది. ధైర్యంగా ఉండమని ఆమెతో చెప్పి బొంబాయి ప్రయాణమైనాను.

నాలుగు నెలల నా శిక్షణా కాలం ముగించుకొని తిరిగి వచ్చాను. రాగానే

నన్ను చుట్టు ముట్టిన మాటలు శ్రీమతి రావు శీలం గురించినవి నా మిత్రులంతా ఆమె మీద చెప్పిన మాటలు నన్ను బాధ పెట్టాయి

నాకెందుకో ఆడవాళ్ళమీద ఒక మంచి నమ్మకం ఉంది అందులో మన దేశంలోని ఆడవాళ్ళమీద ఆ నమ్మకం కొంచెం ఎక్కువే

భర్త పోయిన భార్య తన సుఖాలన్నీ త్యజించాలనీ, కోరికలను అణచుకోవాలనీ మనకు మొదటి నుంచీ నూరిపోస్తారు ఆ సూత్రాలన్నీ చాలా కట్టుదిట్టంగా ఉంటాయి అవన్నీ మనలో జీర్ణించుకొని పోయాయి నా మిత్రులతో అదే విషయం గట్టిగా చెప్పాను కానీ వాళ్ళకు ఈ సూత్రాలమీద నమ్మకం లేదు

'నువ్వేన్నయినా చెప్పు శ్రీమతి రావు నీవ్వు వెళ్ళాక ఎవరినో వెంటవేసు కొని తిరుగుతోంది తోడులేని ఆమె మరో తోడును చూసుకొంది ఇది నిజం రోజూ అతను ఆమెను ఆఫీసులో దించి వెళ్తాడు సాయంకాలం మళ్ళీ ఇంటిదగ్గర దించుతాడు ఇక వాళ్ళ కబుర్లకూ, సినిమాలకు అంతులేదు శ్రీమతి రావు తన భర్తను పోర్తిగా మరచిపోయింది ఆమె సర్వస్వం ఇప్పుడు అతనే అతనే మధుసూదనరావు

"కబుర్లు చెప్పినంత మాత్రాన, సినిమాలకు వెళ్ళినంత మాత్రాన ఆమె శీలంమీద ఎందుకు కొడ్తారు నేను రోజూ వాళ్ళింటికి వెళ్తుందేవాడినే అలాంట ప్పుడు నాకూ, ఆమెకూ లంకె పెడ్తారా మీరు "

"అది వేరు గురూ! నీవు ఊరికే పలకరించి, పరామర్శించి వస్తావు అంత వరకే మధుసూదనరావు సంగతి వేరు మేము నాలుగు నెలలనుంచీ చూస్తు న్నాము "

''సరే ఏమంటారిప్పుడు

"అనేదేముంది— నీ సూత్రాలు, నీతులు అన్నీ పుస్తకాల వరకే అవి ఛాలెంజీ చేస్తున్నాము అంతే ''

"మీరెన్ని చెప్పండి నా నమ్మకం నాకుంది ఆడవాళ్ళను తేలికగా అంచనా వేయకండి మీరంతా ''

మరునాడుదయం నుంచీ శ్రీ మ తి రావుతో మధుసూదనరావును చూస్తున్నా రోజూ ఆమె ఆఫీసుకు బయలుదేరే వేళకు అ త ను ప్రత్యక్షమవుతాడు ఇద్దరూ కలసి వెళ్తారు సాయంకాలం ఇద్దరూ కలసి యింటికి వస్తారు నాకు వీళ్ళిద్దరినీ ఎన్నోసార్లు ఎన్నెన్నో ప్రదే శాల్లో చూడటం తప్పటం లేదు షాపిం గ్‌కూ, సినిమాలకూ, షికార్లకూ— అన్నిటికీ కలిసే వెళ్తున్నారు

నేను అప్పకప్పుడూ శ్రీమతి రావు గారింటికి వెళ్తున్నా మధుసూదనరావు గురించి అడిగేంత ధైర్యం నాకు కలగటం లేదు ఆమె అతనిని మధుసూదనరావు గానే పరిచయం చేసింది నాకు అతను

గాలా హుషారుగా ఉన్నాడు చాలా బాగా మాట్లాడుతున్నాడు మధ్యలో అతను పేల్చే జోకులు కేకుల్లా ఉంటున్నాయి శ్రీమతి రావు అతివి చెంత హుషారుగా ఉంటోంది అతవి జోకులకు విరగబడి నవ్వుతోంది చూచే వాళ్ళందరూ అతనంటే ఆమెకు చాలా ఇష్టం అనే విషయం చాలా సులభంగా గ్రహించేయగలరు

నేను ఇప్పుడు మధుసూదనరావు లేవి శ్రీమతి రావును కలుసుకోలేకపోతున్నాను విడిపోనీ జంటలా ఉన్నారు వాళ్ళు వారిద్దరి ఏకాంతాన్ని భంగం కలిగించటం ఇష్టంలేక వాళ్ళింటికి వెళ్లటం తగ్గించాను

నా మిత్రులు ఈ విషయంలో వదలటం లేదు రోజూ అడుగుతూనే ఉన్నారు మధుసూదనరావు, శ్రీమతి రావులను గురించి ముచ్చటించుకోవటంలో వాళ్ళ కెంతో ఆనందం ఉంది నా సంగతి మాత్రం వేరు

రాత్రి వేళల్లో నా కిటికీ గుండా చూస్తూంటే కనిపించే వెలుగు వెనక ప్రశ్నల పరంపర అనంతంగా ఉంది

ఒక రోజు సాయంకాలం నేను వెళ్ళిన వేళకు శ్రీమతి రావు ఒంటరిగా ఉంది— మధుసూదనరావు లేకుండా

"రండి రండి ఈమధ్య మీరు రావటం తగ్గించేశారు కూర్చోండి" అంటూ నన్ను ఆహ్వానించింది నేను కూర్చునే లోపల ఆమె లోపలికెళ్ళి జ్యూస్ తెచ్చి యిచ్చింది

"ఒక విషయం గురించి చాలా రోజులుగా మీతో ముచ్చటించాలని అనుకొంటున్నాను— మీకు అభ్యంతరం ఏమీ లేకపోతే" అన్నాను జ్యూస్ తాగటం ముగించి

"నాకు తెలుసు అదిమధుసూదనరావు సంగతి"

నేను షాక్ తిన్నాను

"సరిగ్గా ఊహించారు మీ గురించి నలుగురూ అలా చెప్పుకోటం నాకు ఏ మాత్రం యిష్టం లేదు"

"మీకే కాదు నాకున్నూ నా గురించి నా చుట్టూ ఎందరో అనుకోటం నాకు తెలుసు"

"మరి అన్నీ తెలిసి కూడా మీరు "

" ఆ మధుసూదనరావుతో సంచరించటం ఏమిటి? అంటారు అంతేనా మీరు నా శ్రేయోభిలాషి కాబట్టి చెప్తున్నాను నా గురించి అనుకొంటున్న వాళ్ళలో చాలామంది నా శీలానికి ఉచ్చులు వేసిన వాళ్ళే ఈ విషయం మీకు భయంకరంగా ఉండొచ్చు అయితే యిది పచ్చి నిజం నేను వివాహం చేసుకోటానికి పనికిరానిదాన్ని అయితే అనుభవించటానికి మాత్రం పనికి వచ్చేదాన్ని అందుకని వాళ్ళంతా వలలు పన్ని నన్ను ఆ ఉచ్చుల్లోకి లాగాలని ప్రయత్నించి ఓడిపోయిన వాళ్లు ఒంటరి ఆడదానికి

ఈ సంఘంలో రక్షణ సున్న. ఆడదాని శీలానికి ఒక సింహాసనం వేసిన మన దేశంలోని మన వాళ్లంతా ఆ సింహాసనం చుట్టూ నాల్కలుచాచి బుసలు కొడ్తూండే వాళ్ళే. ఏ మలుపులోనైనా అవకాశం దోచుకుందామని ఆశపడే వాళ్ళే. నాకు కావల్సింది ఒక మగవాడి తోడుకాదు. రక్షణ. ఆ రక్షణే మధుసూదనరావు."

నాకేమీ అర్థం కాలేదు చివరి వాక్యం.

''అంటే....''

"అంటే అతను నాకు తోడు. అతని అంగీకారం మీద నేనే ఏర్పరచు కొన్నాను. అతను ప్రతి నిముషం నాకు రక్షణ యిస్తాడు.

"అతను లేకపోతే మీకు రక్షణ ఉండదా!''

"ఉండదు. అంతా భక్షించే వాళ్ళే ఉంటారు.''

"మరి అతన్ని మాత్రం రక్షించే వాళ్ళలో ఎందుకు చేర్చారు? ప్రస్తుతం అతను మంచిగా ఉండవచ్చు. కానీ అతనూ మనిషే. అతని బలహీనతలు అతనికీ ఉంటాయి.

"నిజమే. అయితే భక్షించే వాళ్ళం దరికీ ఉండే అర్హతలు ఇతనికీ ఉన్నాయి. ఒక్క విషయంలో తప్ప....''

"మీరు చెప్తున్నది నాకు అర్థం కావడం లేదు. ఇంతకూ ఆ తేడా ఏమిటో కూడా చెప్తారా!''

''చెప్తాను. మీ మిత్రుల దృష్టిలో ఆడదాని విలువ పడక గదిలో బొమ్మ వరకే. కానీ అదంతా తప్పని చెప్పండి. మధుసూదనరావు నాకు అన్ని విషయాల్లో రక్షణ యిచ్చే మనిషే. పడకటింటిలోకి అడుగుపెట్టినా కోరికల పాములు బుసలు కొట్టినా అతనిలో చైతన్యం ఉండదు. అతను సంసార జీవితానికి పూర్తిగా పనికిరాని మనిషి. అందుకే నాకు రక్షణ ఇచ్చే మంచి మనిషి

శ్రీమతిరావుతో యింకేం మాట్లాడ గలను?

"క్షమించండి. నేనెప్పుడూ మిమ్మల్ని తక్కువగా అంచనా వేయలేదు." అని వచ్చేసాను.

రోజూ శ్రీమతిరావు, మధుసూదన రావు కనిపిస్తూనే ఉన్నారు.

నా గదిలోంచి చూస్తే వాళ్ళ పడక టింటిలో రాత్రిళ్ళు వెలిగేదీపం వెనకాల విషాదం నాకు తెలుసు. అది ప్రతిరోజూ రాత్రిపూట చాలాసేపు వెలుగుతూనే ఉంటుంది.

# నీలవేణి

పాటిబండ్ల విజయలక్ష్మి




అశోక్ ఆలోచనల్లో తుఫాను వచ్చిన సాయంత్రం జరిగిన సంఘటన మెదులు తోంది. "నా తాజ్ మీరే అయినప్పుడు నాకు తాజ్ మహల్ ఎందుకు? మీ హృదయమే నా ప్రేమమందిరం. నాకు వేరే మందిరా లెందుకు?" అని ఎంత గొప్పగా తన ప్రేమను గురించి చెప్పింది వీలూ. ఆ మాటలు ఆమె అవినాష్‌తోనే అని వుండవచ్చు. కానీ ఆ క్షణంలో అవినాష్‌గా నటిస్తున్న అశోక్ భుజాల మీద తలవాల్చి కళ్ళు మూసుకొని తన్మయత్వంతో చెప్పింది. అవన్నీ ఆమెకు జ్ఞాపకం లేకపోవచ్చు. అనూ చెప్పినా, తెలిసీ తెలియని స్థితిలో తన ప్రవర్తనగా సమర్థించుకోవచ్చు. నిజం కూడా అంతే కదా! కానీ తనకు! తను ఆమెతో అవినాష్‌గా నటించలేదు. ఆ పాత్రలో జీవించాడు. నిజంగానే తను అవినాష్ నన్న భావం నరనరానా జీర్ణించుకుపోయింది. కానీ నీలిమగా మారిన నీలవేణి తనను అశోక్‌గా, ఓ డాక్టర్ గానే గుర్తించింది. అవినాష్ ఛాప్టర్ ఎండ్ అయినట్లే అనుకుందేమో!

తాజ్‌మహలంతా తిరిగి చూస్తున్న పిల్ల

ంతా ఆ అద్భుత సౌందర్యాన్ని మెచ్చుకుంటుంటే మనసక్కడ లేని అనుపమకు ఆ పాలరాతి కట్టడంలోని అందాల స్థానంలో అశోక్ దీనమైన ముఖం కనిపిస్తోంది. నీలిమ మౌనంగా చేత్తో తడిమి చూస్తోంది ఆ అందాల ప్రేమ మందిరాన్ని కానీ ఎందుకో మనసుకు తృప్తిగా సంతోషంగా లేదు. ఏదో వెలితి ఏదో బాధ మనసులో.

జరిగిపోయిన గతం తాలూకు జ్ఞాపకాలు మెదులుతున్నాయి. అవినాష్తో, తను ఈ తాజ్ను చూడటానికి వచ్చినప్పుడు అతను తన చేతుల్లో చేయి వుంచి నడిపించుకొని వెళుతూ అమర ప్రేమికుడు షాజహాన్ గురించీ అతని ప్రేమ గురించీ ఎంత గొప్పగా చెప్పాడు!

అంతలోనే ఓ క్షణం అశోక్ రూపం కళ్ళముందు కదిలాడింది.

అతను ఢిల్లీలో రెడ్ఫోర్ట్ మరికొన్ని ప్రదేశాలలో అవి వర్ణించడం అంతా అచ్చు అవినాష్లాగే అతని ప్రవర్తన జ్ఞాపక మొచ్చింది

అంతలోనే అవినాష్ లేని లోటు, తను ఒంటరిగా జీవితమంతా సాగించాలన్న బాధ మనసులో మెదలడంతో ఏదీ యింట్రెస్టుగా చూడలేకపోయింది నీలిమ.

తాజ్ చూసి అంతా బయటకు రావడం చూసి సుధా, అశోక్ వాళ్ళకు ఎదురు వెళ్ళారు. ఆ అద్భుతమైన కళా ఖండాన్ని చూసే అవకాశం కలిగించిన అశోక్కు అమ్మాయిలంతా మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలిపారు మేడమ్తో సహా.

అంతా నదీతీరంలో ఓ చోట కూర్చున్నారు. అటుగా వచ్చిన పల్లీలు కొని అందరికీ యిచ్చాడు అశోక్.

"ఇక్కడ బోట్ షికారు చేయాలని వుంది మేడమ్!" అంది ఓ అమ్మాయి.

"ఎందుకుండదూ! ఎక్కడ లేని కోరికలూ పుట్టుకొస్తాయి యిక్కడికి రాగానే. మీ కోతి మూకను వేసుకుని నేను నదీ ప్రయాణానికి వచ్చినా వప్పుకోను. ఎవళ్ళో ఒకళ్ళు వయ్యారంగా వంగి నీళ్ళు పట్టుకొని ఆడుకుంటూ అందులో పడ్డారంటే, లేనిపోని రిస్క్. నో అలాంటి కోరికలు మానుకోండి. ఏదో డాక్టరుగారి దయవల్ల తాజ్మహల్ చూడగలిగాం, అంతవరకే సంతోషించండి" అంది ఘాటుగా కుసుమ మేడమ్ అంతా మౌనంగా వూరుకున్నారు. అడిగిన అమ్మాయి మూతి ముడుచుకుంది. చాలామందికి మనసులో ఆ కోరికవున్నా మేడమ్ సమాధానం విన్నాక సుశ్మీ ధైర్యంచేసి అడగలేకపోయారు.

"మేడమ్! మా అనూ! మరో వారం మా నో వుంటుంది. నేను వచ్చి దిగబెడతాను మా డాడీ మీ పర్మిషన్ తీసుకోమని చెప్పారు. అక్కడికి వెళ్ళగానే

అనూ వాళ్ళింటికి మీరు కబురు చేయ గలరా? అన్నాడు అశోక్.

"ఓ యస్! తప్పకుండా వుంచుకోండి డాక్టర్! ఎన్నో ఏళ్ళ తర్వాత కలుసు కున్నారు. అనూ వాళ్ళింటికి స్వయంగా నేనే వెళ్ళి చెప్పివస్తాను. మీరు చేసిన సహాయం ఈ జన్మకు మరవగలిగేది కాదు. మీ దయవల్ల మాకు దాదాపు అన్నీ ఫ్రీగానే దొరికాయి. ఢిల్లీలో అంత చక్కటి గెస్ట్‌హవుస్ ఫ్రీగా ఎవరిస్తారు? మేమెలా మీ ఋణం తీర్చుకోగలం? అనూను తీసుకొచ్చి నప్పుడు తప్పకుండా మా యింటికి రావాలి మీరు." అంది కుసుమ అశోక్ వైపు గౌరవభావంతో చూస్తూ.

"వద్దు బావా! నేనూ మేడమ్ వాళ్ళతో వెళ్ళిపోతాను. మరోసారి ఎప్పుడైనా వస్తాను" అంది అనుపమ.

"నో! నో! మళ్ళీ రావడమంటే అది జరిగే పనికాదు. పైగా మేం వూరుకున్నా మీ మామగారు వూరుకోరు, మిమ్మల్నిలా పంపించేస్తే కనుక మాట్లాడ కుండా అశోక్ చెప్పినట్లు మరో వారం వుండి వెళ్ళండి" అన్నాడు మధు చనువుగా.

"అవును. అనూ! డాడీకి నాకూ, కూడా తృప్తిగా వుంటుంది ఈ నాలుగు రోజులూ ఏదోగా గడిచిపోయాయి. ఓ వారం వున్నావంటే మళ్ళీ ఢిల్లీ వదల మన్నా వదలలేవు తెలుసా?" అంటూ నవ్వుతున్న అశోక్ మాటలకు చిన్నగా నవ్వింది అనుపమ మౌనం "అర్ధాంగి కారమా!" అంది వో కోణంగి.

"అర్ధాంగి లేదు, కారమూ లేదు నువ్వు నోరు మూసుకోవే. ఎలాగూ అనూ యిక్కడే ఆగిపోతుందని నాకు ముందే తెలుసు" అంది మరో జ్యోతిష్కురాలు.

నీలిమ మౌనంగా కూర్చుని యిసుకలో ఏదో వ్రాసి చెరిపేస్తోంది.

"నీలిమా! నీ ఫ్రెండ్ ఆగిపోతుంది ఢిల్లీలో మరి నీ మాటేమిటి?" అన్నారు కుసుమా మేడమ్.

"పానకంలో పుడకెందుకు?" అంటూ ఓ అమ్మాయి గుంపులో నుంచీ మెల్లగ కోపంగా చూసిన కుసుమా మేడమ్‌కు ఎవ్వరైందీ తెలీక నీలిమవైపు తిరిగారు సమాధానాని కన్నట్లు.

అనూని వుండనివ్వండి మేడమ్ పాపం ఎన్నో సంవత్సరాల తరువాత వాళ్ళు కలుసుకున్నారు. నేను మీతోనే వస్తాను. అనూ తర్వాత వస్తుంది గిరిప్ర సాద్ అంకుల్ ముఖ్యంగా సంతోషిస్తారు అనూను కనం ఇక్కడ వుంచి వెళ్ళా మంటే అంటూ చిన్నగా నవ్వింది నీలిమ అనూవైపు చూస్తూ.

"అదేం లేదండీ మేమూ సంతో షిస్తాం మీరూ మీ ఫ్రెండ్‌తో పాటు ఉండిపోతే, మరీసంతోషిస్తాం" అన్నాడు మధు చిన్నగా నవ్వుతూ.

"థాంక్స్! కానీ నేను వెళ్ళాలి"

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

## లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురుచూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ. నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి. పూర్తిగా ఫాయిల్ లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.




లింటాస్-LTS. P. 1-1710 TL

అంటున్న నీలిమ సమాధానం అశోక్ హృదయంలో ముల్లులా గుచ్చుకుంది.

అశోక్ తరఫున తనైనా నీలిమను ఆపేయాలని చూసిన మధూ చిన్నబుచ్చుకున్నాడు. అనుపమ దీర్ఘంగా నీలిమవైపే చూస్తోంది.

మిగతా స్టూడెంట్సంతా జట్లు జట్లుగా కూర్చుని కబుర్లలో పడ్డారు. వాళ్ళని చూస్తూండమని అశోక్, మధూలకు చెప్పి, మేడమ్స్ నెమ్మదిగా బోట్ షికారెళ్ళిపోయారు.

మళ్ళీ అనుపమ, నీలిమ, మధు, అశోక్ మిగిలారు. మాటలే కరువైనట్లున్నాయి వాళ్ళమధ్య. నీలిమ యిసుకలో ఏవేవో గీతలు గీస్తూ తల వంచుకొని కూర్చుంది. అనుపమ తదేకంగా తాజమహల్‌ను చూస్తూ కూర్చుంది. మధూ ఎదురుగా కూర్చున్న అమ్మాయిల గ్రూపును చూస్తున్నాడు. అశోక్ దృష్టి యమునా నదిమీద కేంద్రీకృతమై వుంది.

నలుగురూ ఒక్కచోట వున్నా, నాలుగు మనసులూ ఎక్కడెక్కడో పరిభ్రమిస్తున్నాయి.

వాతావరణంలో హుషారు తీసుకురావాలని వుంది మధుకు. కానీ ఎలా? ఎవరికి వాళ్ళు బిగదీసి కూర్చున్నారు.

ఇంక లాభంలేదని యిసుకలో కర్చీఫ్ పరచి.

"ఎక్స్‌క్యూజ్ మి" అంటూ కాళ్ళు చాపి కర్చీఫ్ మీద తలవుంచి పడుకున్నాడు, ఓ ప్రక్కకు తిరిగి నెమ్మదిగా హమ్మింగ్ చేయడం మొదలెట్టాడు.

"పెద్దగా పాడరా మధూ! టైమ్‌పాస్ అవుతుంది" అన్నాడు అశోక్.

అప్రయత్నంగానే గొంతు విప్పాడు మధు.

"ఏ, మేరే, దిల్, కహీం, అవుర్ చల్....

గమ్‌కి దునియాసే దిల్ భర్ గయా!"

కళ్ళు మూసుకుని పాడుతున్న మధు గొంతులో ధ్వనించిన భావం అందరి హృదయాల్ని మరింత భారం చేసింది.

మధూ అంత చలాకీగా సరదాగా తిరిగినా అతనిది ఓ విషాద జీవితం. ఎలాగో కష్టాలు పడి స్టడీస్ పూర్తి చేయగలిగాడు. సవతి తల్లి పెట్టిన బాధలన్నీ భరించాడు. ఆప్యాయతకు, ఆదరణకు మొహం వాచిపోయాడు. క్లాస్‌మేట్ "రమ" సాన్నిధ్యంలో అవన్నీ పొందగం ననుకున్నాడు. అయిదు దీర్ఘ సంవత్సరాలు కలిసి తిరిగారు. ఎన్నో మధురానుభూతుల్ని పంచుకున్నారు. కానీ ఆ దుష్టకాలు మధూ ఫైనలియర్‌లో వుండగా అమెరికా నుంచి తిరిగి వచ్చిన వాళ్ళ బావను గుట్టు చప్పుడు కాకుండా పెళ్ళాడి అమెరికా వెళ్ళిపోయింది. ఆ షాకునుంచీ చాలారోజుల వరకూ కోలుకోలేక పోయాడు మధు.

ఆ తర్వాత అశోక్ స్నేహంలో

అవన్నీ నెమ్మదిగా మరచిపోయే ప్రయత్నంలో నవ్వుతూ, నవ్విస్తూ తిరగటం నేర్చుకున్నాడు. కానీ ఎప్పుడో యిలా వాతావరణంలో స్తబ్ధత చోటు చేసుకున్నప్పుడు అప్రయత్నంగానే గుండెలు బరువెక్కుతాయి మనో భావాల్ని బయటపడకుండా వుంచడానికి ఏవో పాటలు పాడుకుంటూ గంటలు గడిపేస్తాడు ఇప్పుడూ అలాగే చేశాడు. ఆ పాట పూర్తికాగానే మరో పాట అందుకున్నాడు ఎవరూ అడక్కుండానే.

"అంసూ, భరేహైం, ఏ, జీవన్‌కి
రాహేం....
కోయీ, వునే, పే కహెతే, హమ్
భూల్, జాయే. ॥అసూం॥

వాదే, భులాదే, కసమ్, తోడ్
దేవో
హాలత్, పె, అపనీ, హమ్ ఛోడ్
దేవో....

ఆ పాట అలా సాగుతుండగానే అశోక్ దిగ్గున లేచి తాజ్‌మహల్ వైపు అడుగులు వేశాడు. తనని తాను కంట్రోల్ చేసుకోలేక. అసలే మనసంతా చికాగ్గా వున్నదంటే మధూ అలాంటి పాటలు పాడి మరింత బాధ పెడుతున్నాడు స్వయంగా వాడూ బాధపడుతున్నాడు. అప్రయత్నంగానే తనూ లేచింది అనుపమ.

నీలిమవైపు చూసింది.

తదేకంగా వెళ్ళిపోతున్న అశోక్‌నే చూస్తోంది నీలిమ.

ఆ కళ్ళలోని భావం ఏమిటో చదవలేకపోయింది అనుపమ.

కళ్ళు తెరచిన మధూ తక్కువైన పాట ఆపి లేచి కూర్చున్నాడు.

"అరే అందరూ పారిపోతున్నారేమిటి ? ఇంక సాదనులే కూర్చోండి అనుపమా!" అన్నాడు చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ, అతని కనుకొలనుల్లో నీళ్ళున్నాయి.

చప్పున కూర్చుంది అనుపమ.

"ఛ! మీ పాటలు చాలా బావున్నాయి మధూ! విబాతవి వింటూంటే హృదయాలు మరింత భారమౌతున్నాయి. బహుశా ఆ హృదయ భారాన్ని తగ్గించుకోడానికే బావ ఏకాంతాన్ని వెదుక్కుంటూ వెళ్ళి నట్లున్నాడు. హృదయం లేని నాలాంటి వాళ్ళకు ఏదీ లేదనుకోండి" ఆ మాట ఎవర్ని వుద్దేశించి అన్నదో మధూ గ్రహించాడు.

ఆ హృదయంలేని మనిషి గుర్తించింది. చిన్నగా నవ్వుతూ.

"మధూబాబూ! హృదయాలందరికీ వుంటాయి. కానీ అవి అన్నిచోట్ల అందరి దగ్గరా స్పందించవు. సారీ మీ పాటలు నన్ను స్పందించలేక పోయాయనుకునేరు. నిజానికి మీ పాటలు వింటూంటే కళ్ళు మూసుకుని ఆపాటలు వింటూ వుండిపోవాలనిపిస్తోంది" అంటున్న నీలిమ మాటలు పూర్తికాకుండానే,

"యింకేం వుండిపో!" అంది అనుపమ వ్యక్రోషంగా.

"నేనున్నా నాతోపాటు మీరంతా వుండరు కదా జనూ!

మధుగారికి హాస్పిటల్, ఆయన పేషెంట్స్ ఆయనకోసం ఎదురు చూస్తారు. నీకూ, మీ బావకూ యింటి దగ్గర మీకోసం వేయి కళ్ళతో ఎదురు చూసే అంకుల్ వున్నారు.

మరి నాకెవరున్నారు ? అప్రయత్నంగా నీలిమ కళ్ళలో నీళ్ళు తిరిగాయి."

నాకునాకెవరున్నారు?నాకోసం ఎవరెదురు చూస్తారు? నాకోసం చూసే వాళ్ళెవరూ లేరు కనుక నే నెక్కడున్నా ఒక్కటే"

అనుపమకు ఒక్కసారిగా నీలిమ మీద జాలివేసింది.

అవును నీలూ కెవరున్నారు? వున్నా లేనివాడికిందే లెక్క వాళ్ళ నాన్న. దాన్ని మాటలతో బాధపెట్టినందువల్ల ప్రయోజన మేముంది? దానికీ మనసు వుంది దాని మనసు చెప్పినట్లు ప్రవర్తించే అధికారం దానికుంది. కాదనడానికి తనెవరు?

(ముగింపు వచ్చే సంచికలో)

---

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

